

భద్రాచల శ్రీసీతారామ లక్ష్మణులు

వామాంకస్థిత జానకీ పరిలసత్కోదండ దండం కరే
చక్రం చోర్ధ్వకరేణ బాహుయుగళే శంఖం శరం దక్షిణే।
బిభ్రాణం జలజాతపత్రనయనం భద్రాద్రి మూర్ధ్ని స్థితం
కేయూరాదివిభూషితం రఘుపతిం సౌమిత్రియుక్తం భజే ॥

ప్రథమ ముద్రణ :-
డిశంబర్ 1999

శ్రీతిరుమల - తిరుపతి దేవస్థానము
వారి ఆర్థిక సహాయముతో ముద్రింపబడిన గ్రంథము

ప్రతులకు :-
**శ్రీమతి యం. నాగమణి.** యం.ఎ., బి.ఇడి.
ప్లాటు నం : 30, జి-2, జి.కె. నగర్, డా॥ ఎ.ఎస్.రావు నగర్,
ఇ.సి.ఐ.ఎల్. పోస్టు, హైదరాబాదు - 500 062 ఆం.ప్ర. : ఇండియా.
ఫోన్: +91-40-7121816



**మూల్యం : రూ॥ 110-00**
**$ 10**

విష్ణుతేజ గ్రాఫిక్స్
2-2-1105/35, తిలక్‌నగర్,
హైదరాబాద్ - 500 044

ముద్రణ :
శ్రీ శాంతా ఆర్ట్ ప్రింటర్స్,
2-2-1105/37, తిలక్ నగర్,
హైదరాబాదు - 500 044 (ఆం.ప్ర.)



శ్రీ తిరుమల తిరుపతి బాలాజీ

శ్రీమాన్ కృపాజలనిధే కృతసర్వలోక
సర్వజ్ఞ శక్త నతవత్సల సర్వశేషిన్।
స్వామిన్ సుశీల సులభాశ్రితపారిజాత
శ్రీవేంకటేశ చరణం శరణం ప్రపద్యే ॥

# శతకంఠ రామాయణము

## అను

# సీతావిజయము

## లింగన కవి కృతము


సంపాదకుడు

''రామాయణ కథారత్న'' ''సాహిత్య రత్న''

**మూలా రామమూర్తి** M.A(Tel) M.A (SKT)



ఆధ్యాత్మిక వికాస ప్రచురణలు

హైదరాబాదు

**1999**

SRI RAM

*Critical Study of*

# ŚATAKANTHA RĀMĀYAṆAM

alias

# SITA VIJAYAM

**Project Report**

*By*

*"Ramayama Katharatna"*

*"Sahitya Ratna"*

**Mula Rama Murthy.** M.A(TEL), M.A(

# Briefing on the Project Report of Satakantha Ramayanamu alias Sitavijayamu.

The Ramayana is as old as Vedas. In the Tenth Mantra of Rigveda, the story of Rama briefly described. With the advent of Valmiki's work in the Galaxy of Sanskrit literature, was attracted both Scholars and Masses in the Universe.

As time passed, the Ramayana Story enbodying many popular versions of incidents ar oriented to the cult of worship of Rama as SUPREME BEING. As the Ramayana literatu spread vividly, certain vulnerable points arose in the acts of Rama, which, ultimately pave the way to state widely by collecting many incidents connected to Rama is the compendiou account of Ramayana Story entitled as "TATTWA SANGRAHA RAMAYANA" b Ramabrahmananda - contemporary of Saint- composed Tyagaraja (1764-1847 A.D). The epi sode of "Satakantha Ramayana" is found in the chapter - 7 Cantos 1 & 2.

The TELUGU PRABANDHA entitled "Satakantha Ramayanamu alias Sitavijayam" of unique importance in the history of Telugu Literature.

Initially on seeing this work, Late Dr. Divakarla Venkatavadhani, Retd. Professo Osmania University has encouraged me to conduct research on this topic. In the course time, the Ministry of Human Resources Development has kind enough in granting fellowshi to conduct research on the subject. As a result of this I have put in strenuous efforts to trace t complete work in Telugu and establish the poet and above all to locate the original Sansk version etc.

During the course of my research, I have conducted tours in various states in India ar in abroad viz., Mauritius, Australia, singapore and Thailand. In locating the original sansk version of the work I am very much indebted to Dr. Dominik Wujastyk, Associate Curat South Asian Collections, Welcome Institute, London, U.K., who is kind enough to pass on t information (copy of letter enclosed) to verify the manuscripts at Madras Oriental Resear Library etc. In this noble cause Dr. Rama Devi, reader Sanskrit Depratment, Madras Univ sity, Madras and Dr. S.Rajalakshmi, Lecturer have helped me a lot. I thank both of them.

I wanted to submit the report in the form of Ph.D Thesis to the Ministry. On 17th Ju 1996 when I attended on the Consulate General, United States of America for a VISA I ma an attempt to visit the Ministry in this connection, to seek permission for late submission the report. I had a talk with Mr. Shiv Narain Singh, Assistant Secretary for permission submit the same on my return from U.S.A. as I was invited by the American Federation Astroloers Inc. to address the convention on Astrology at Chicago. He is very kind enough grant permission and instructed me to submit a compendious report.

I beg pardon from the Ministry for the delay as the project work is so critical one wh warranted me to have consultations in person with many eminent scholars of India as well aborad.

Submitted to the Ministry for kind perusal and record.

(MULA RAMA MURTI



THE WELCOME TRUST

**THE WELLCOM**
**INSTITUTE FOR THE**
**HISTORY OF MEDICINE**
183 Euston Road
London. NW1 2BE
Telephone 071-611 8888
Fax 071 - 61 8545

Dr Mula Rama murthy, MA
Research Scholar & Astrologer
H.No. 1 -14-243, Viman Nagar
P O Secunderbad - 500 003
Andhra Pradesh
INDIA

14 APRIL 1994.

Dear Dr Murthy,

Thank you for your letter about the "Tatvasangraha Ramayanam" as you will see from the enclosed photocopy there are in fact a number of manuscripts of this work in India, specially in the south, see for example the collections at Adyar, Madras, Mysore and Tanjore. I am afraid we do not have any copies of this work at the welcome Institute.

With best Wishes

Dominik Wujastyk

Dr Dominik Wujastyk
Associated Curator, South Asian Collections

encl



గ్రంథకర్త సాహిత్య విద్యా గురువు వారి సతీమణి

''కవిభూషణ'' ''కళాప్రపూర్ణ'' ''విద్యాసనాథ''

**కీ॥ శే॥ డా॥ దివాకర్ల వేంకటావధాని M. A. (Hons) Ph. D.** **కీ॥ శే॥ చంద్రావతి**

సరస్వతీ పుత్ర, కవితా గంగోత్రి
**డా॥ మేడసాని మోహన్**, యం.ఎ., పిహెచ్.డి.
డైరెక్టర్
అన్నమాచార్య ప్రాజెక్టు,
తిరుమల తిరుపతి దేవస్థానము, తిరుపతి

# రామాయణానుభూతి

శ్రీమద్రామాయణ పరిశోధనా నిష్ణాతులైన శ్రీమూలా రామమూర్తిగారు శతకంఠ రామాయణ విషయికముగా గావించిన పరిశ్రమ, అధ్యయనము - ప్రశంసా పూర్వకమైన ఉత్తమ స్థాయిని సంతరించుకొని యున్నవి.

భారతీయులకు రామాయణము ప్రీతిపాత్రమైన 'ఇతిహాసము' సమస్తకళ్యాణ గుణాభిరాముఁడైన శ్రీరామచంద్రుడు నాఁటికీ, నేఁటికీ, ఏ నాఁటికీ ఆదర్శపురుషుఁడే. సంస్కృతాంధ్రముల యందును, ఇతర భారతీయు భాషలయందును. విదేశభాషలలో కూడ అసంఖ్యాకముగ రామాయణములు వెలుబడియున్నవన్నచో రామకథకు అనాదిగా ఎంతటి ప్రాచుర్యమున్నదో తెలియుచున్నది. ''అపారే కావ్య సంసారే, కవిరేవ ప్రజాపతిః యధాస్మైరోచతే విశ్వం తథేదం పరివర్తతే'' - అన్న ఆలం కారిక సూక్తికి అనుగుణముగా ఈ కథాగమనము కూడ ఆయా కవుల క్రాంతదర్శనములు, రసానుభవముల నను సరించి ప్రవాహ సదృశ్యమైన మార్పులకు గురియై యున్నది.

మూలా రామమూర్తిగారు వీరి ప్రణాళికలో భారతదేశ భాషలందలి రామాయణములేకాక, విదేశీయ రామాయణములను గూర్చి కూడ ఆసక్తి కరమైన అంశములను పేర్కొఁనియున్నారు. శతకంఠ రామాయణ కర్తృత్వ విషయికముగా వీరు సోపపత్తికముగా, సహేతుకముగా విశ్లేషించిన అంశములు నాకు ఆశ్చర్యానందములు కలిగించినవి. ప్రత్యేకించి గోవాదేశము నందలి వృత్తాంతము నా ఆలోచనా స్రవంతిని ఔచిత్య పథమునకు మరలించినది. సాహితీ పరిశోధకులు, సామాజిక శాస్త్రవేత్తలకు నిజముగా వీరందించిన అంశములు మార్గ నిర్దేశకములు.

సీతాపాత్ర, స్త్రీలు గావించిన యుద్ధఘట్టములు మున్నగు అంశములు అనాదిగా సామాజిక ప్రస్థానమున స్త్రీవైశిష్ట్యమును బహుధా ఉగ్గడించుచున్నవి. రామమూర్తిగారు వీరి ఈ శతకంఠరామాయణ ప్రణాళికలో సాహిత్యాంశములను విశదీకరించుటలోను, చారిత్రకాంశములను సమన్వయించుటలోను, వ్యాకరణాదులను సమర్థించుటయందును సముచితమైన పాటవమును ప్రదర్శించియున్నారు. గహనాతి గహనమైన విషయములను గూడ స్పష్టీకరించి, విపులీకరించుట వీరికి వెన్నతో పెట్టిన విద్య సీతారామచంద్రులకు సంబంధించిన అధ్యాత్మ విషయములను కూడా వీరక్కడక్కడ చక్కఁగా చెప్పియున్నారు.

ఇవిన్నియు చదివిన తరువాత మూలా రామమూర్తిగారికి ''రామాయణ కథారత్న'' బిరుదమున ''రామాయణ కథా సంశోధన రత్నాకర'' - అన్ని మార్పు చేసినచో సముచితమని నాకనిపించినది.

మేడసాని మోహన్

12.12.98

శ్రీరామ

# నివేదనము

''రామ నామ స్మరణ సుఖమనరా

అనకున్న వినరా

కామితార్థములొసగు సత్యమురా

భవహార మిదేరా''

అని నా మాతామహులు కీ॥శే॥ బ్రహ్మశ్రీ ధవళ (పురాణం) సుబ్రహ్మణ్యశాస్త్రులుగారి వక్క

యావద్భారత దేశమునకే గాక ప్రపంచమంతను శ్రీరాముడు పూజనీయుడు. రామాయణమ బహురచయితలు వారి వారి కాలము నందలి ప్రజల అభీష్టములు, మనస్తత్వములు, ఊహాపోహలు ము వాని ననుసరించి, వాల్మీకిని ఆలంబనముగా చేసికొని రమణీయముగా రచించిరి. అట్టివా శ్రీరామబ్రహ్మానందుల వారి సంస్కృత తత్త్వ సంగ్రహ రామాయణమొకటి. ఇందలి సప్తమ కాండయ శతకంఠుని వృత్తాంతము కలదు. దీనిని మాతృకగాగైకొని లింగనకవి ''సీతావిజయ'' మను శీర్షికన తెలు నాలుగా శ్వాసముల ప్రబంధముగా రచించెను. సుమారు నూరు సంవత్సరములుగా మరుగునపడి య ఈ గ్రంథమును వెలికి తీసి, పరిశోధించి'' ఆధ్యాత్మిక వికాస ప్రచురుణ'' పక్షమున ద్వితీయ కుసు ఆంధ్ర సోదర సోదరీ మణులకు అందింప సమకట్టితిని.

1985వ సంవత్సరమున ''**శతకంఠ రామాయణము అను సీతావిజయ**'' మను పేరుగల, కృ పద్యములు లేనట్టిది, శిథిలావస్థలో నున్నది యగు అతి ప్రాచీనమైన అచ్చుప్రతి లభించినది.

నా గురుదేవులు కీ॥శే॥ డా॥ దివాకర్ల వేంకటావధానిగారు చూచి కృత్యాది పద్యములు సంపాదిం ఆనతిచ్చిరి. అందుపై ఆంధ్రదేశమునందేగాక తమిళ, కర్ణాటక రాష్ట్రములు గూడ పర్యటించి త తిరుపతిలో చూడగల్గితిని. వారు వానిని చూచి నన్ను పరిశోధించమని ప్రోత్సహించిరి. 1986లో బొం ఆసుపత్రిలో యుండి, నాకు పరిశోధనా ప్రణాళికను బోధించిరి. నాదుర దృష్టము. కొద్ది దినములకే బొంబాయి నగరముననే దివంగతులైరి.

వారు గతించినను, వారి మాటను ఆజ్ఞగా భావించి వారినే మనసునందు ప్రతిష్ఠించుకొని పరిశో ప్రక్రమించితిని. ఇట్టి సమయమున కేంద్ర ప్రభుత్వపు మానవ వనరుల మంత్రాలయము, కొత్త ఢిల్లీ దయతో పరిశోధనకు గ్రాంటు మంజూరు చేయగా తిరుపతి విశ్వవిద్యాలయ ప్రాచ్య లిఖిత పుస్తక భాండా

నందు గల ఒకే ఒక సమగ్ర ప్రతిని సంచాలకుల అనుమతిని, లభ్యమగు అచ్చు ప్రతులతో తులనాత్మకముగ పరిశీలించి, అందందుగల బహు వ్యత్యాసములను క్రోడీకరించి పూర్తి స్థాయి సిద్ధాంత వ్యాసమును వ్రాయ సమకట్టితిని. కాని మంత్రిత్వ శాఖవారు ప్రాజెక్టు రిపోర్టు మాత్రమే కోరుటవలన, వారి ఆదేశముల మేరకు కేవలము లఘు సిద్ధాంత వ్యాసము వ్రాయుట జరిగినది.

గ్రంథ కర్తృత్వము నిర్ణయించుట చాల క్లిష్టమగు సమస్యగా పరిణమించినది. ఏమనగా కొన్ని ప్రతులలో లింగకవి యనియ, కొన్నిట మర్దయయని యుండుట. శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తిగారు శ్రీ తూమాటి దోణప్పగారు, శ్రీ శ్రీమన్నారాయణగారు మొదలగు పెద్దల సూచనల ననుసరించి కర్తృత్వ నిర్ణయమును చేసితిని. పెద్దలు, మేథావులు ఇందు విషయమై ముమ్ముందు ఇంకను పరిశోధనలు గావించి నిర్ణయించిన తప్పును సవరించుకుందును.

ఏతద్గ్రంథమునకు మూలము **''తత్త్వ సంగ్రహ రామాయణము''**. ఇంది సంస్కృతము. ఎచ్చట లభించునది తెలియరాని కారణాన 1993వ సంవత్సరమున భండార్కారు సంస్థవారి అమృతోత్సవముల సందర్భమున జరిగిన అఖిల భారత ఓరియంటల్ కాన్ఫరెన్సుకు పూనా వెళ్ళి అచ్చటకు దేశవ్యాప్తముగా విచ్చేసిన పండితుల సందరను దీనిని గూర్చి ప్రస్తావింప, ఫలితము కలుగలేదు. పునాలో నివసించుచున్న డా॥ జి. యన్. సాఠేగారి సలహామేరకు 9వ అంతర్జాతీయ సంస్కృత మహాసభలకు లాట్రోబ్ విశ్వవిద్యాలయము, మెల్‌బోర్న్‌వారి ఆహ్వానముపై ఆస్ట్రేలియాకు వెళ్ళి, అచ్చట లండన్ వెల్‌కమ్ సంస్థ ఆచార్యులు డా॥ డోమినిక్ ఉజ్జస్టిక్‌గారు మూల గ్రంథము మదరాసులో నున్నట్లు తెలిపిరి. వారి సూచన మేరకు మదరాసు విశ్వవిద్యాలయ సంస్కృత శాఖలో రీడరుగా యున్న సోదరి డా॥ రమాదేవి మరియు ఉపన్యాసకురాలు చి॥ సౌ॥ రాజ్యలక్ష్మిగార్ల సహకారమున మూలము లభ్యమయినది. అంతియగాక ఈ గ్రంథ విషయమై మారిషసు, బేంగ్‌కాక్ (థాయిలాండ్)లలో జరిగిన అంతర్జాతీయ రామాయణ సదస్సులకు సహితము వెడలి ప్రస్తావింప అచ్చటకు వచ్చిన వారు కూడా ఏమియు తెలుపలేకపోతిరి.

**''శతకంఠ రామాయణము లేక సీతావిజయము''** అను పేరున ప్రకటింపబడిన ఈ గ్రంథమును గూర్చి నాలఘువ్యాసమున చర్చించడమైనది. కవి లింగన ఇంత వరకు వెలువడిన రామాయణముల యందు ఎవ్వరు వివరించని విశేషములు వివరింపబడుట గమనార్హము. ఉదాహరణమునకు శ్రీరాముని సేనయందు గల వీరుల వ్యక్తి గత పరాక్రమముల వర్ణనము :

1) జాంబవంతుడు (2-70)
2) హనుమంతుడు (2-71)
3) గవయుడు (2-72)
4) నీలుడు (2-73)
5) మైందుడు (2-74)
6) గంధమాదనుడు (2-75)
7) సుషేణుడు (2-76)

అంతియగాక - లక్ష్మణుడు (1-107) శత్రుఘ్నుడు (1-108) భరతుడు (1-109) కుశలవులు (1-110, 111) సుగ్రీవుడు (1-112) అంగదుడు (1-113).

శ్రీరాముని సైన్యము 72 వెల్వలని ప్రతీతి. వెల్వ యననెంతయో నేటి గణిత శాస్త్రజ్ఞులకు సహితము తెలియదేమో యని సందేహము. అట్టి గణిత వివరమును 2-38న తెలియనగును. ఒక్కొక్క పట్టున పోతన అనుకరణములు గూడ గోచరించును. భాగవతావతారిక యందలి పద్యములకు (4-148, 149) రుక్మిణీ కళ్యాణము, నరకాసుర వధ ఘట్టముల యందలి పద్యములకు (4-89) (4-123) సామ్యము గోచరించును.

గ్రంథము వ్రాయుట శ్రమతో కూడిన పని. ముద్రణము మరింత కష్టము. విక్రయించుట కష్టాతి కష్టము. ఈ గ్రంథము ఆంధ్రదేశమునందు పూర్తిగా మరుగున పడినటువంటిది అగుట వలన, ఆంధ్ర సోదర సోదరీ మణులకు తెలియజేయుట కొరకు, బహుముఖ శ్రమముల కోర్చి ఈ పనిని చేపట్టితిని. ఆర్థికముగా వెనుకబడిన వాడనైనప్పటికి శ్రీరామునిపై భారముంచి చేయు నా ప్రయత్నమునకు ఆశీః పురస్సరముగా ద్రవ్య సహాయ మందించిన శ్రీ శ్రీ శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము, తిరుపతి వారికిని, శ్రీ. యం.వి.వి. సత్యనారాయణగారికి, కౌతాట్రస్టు అధినేతలు శ్రీ కౌతా లలిత మనోహరరావుగారికి, శ్రీ ఉంగరాల వేంకట నారాయణగారికి, శ్రీహర్షసంస్థ వేంకటేశ్వరరావుగారికి, లాయరు బాలగోపాలుగార్కి, శ్రీ పార్థసారథిగార్కి, శ్రీసంగిసెట్టి రవికుమారుగార్కి, మారిషసు నివాసి శ్రీ జగన్నాధాచార్యులుగార్కి నా హృదయపూర్వక నమోవాకములు.

శ్రీరాముని మీది భక్తి ప్రపత్తులతో, తెలుగు భాషయందు ప్రవేశము లేనప్పటికి, ఉదారముగా సహాయమందించిన చంద్రకాంత శిలా వ్యాపారులు శ్రీ రవి సింగుగారికి నా నమస్సుమాంజలులు.

సాహితీ వ్యాసంగ విషయములయందు తోడబుట్టిన సోదరునిగా భావించి, వెన్నుతట్టి మంచి సలహాల నొసంగి, ప్రోత్సాహమొసగిన సాహితీ మూర్తులు బ్రహ్మశ్రీ ఆచార్య డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారికి సర్వాదా కృతజ్ఞుడను.

పరిశోధనలో ముఖ్య విషయములందు తోడ్పడిన తిరుపతి విశ్వవిద్యాలయ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగార సంచాలకులు, తిరుపతి ఆచార్య డా॥ యం. శ్రీమన్నారాయణగారు, వారి సిబ్బందికి, కృతజ్ఞుడను.

బ్రహ్మశ్రీ ఆచార్య డా॥ పుల్లెల శ్రీరామ చంద్రుడు గార్కి నమోవాకములు.

ప్రేమతో శతకంఠ రామాయణముపైని పరిశోధనా పత్రమును "విజ్ఞాన సరస్వతి" యందు ప్రచురించిన ఆం॥ ప్ర॥ తాళపత్ర, లిఖిత పుస్తక గ్రంథాలయ సంచాలకులు డా॥ వి. వి.ఎల్. నరసింహారావుగారికి కృతజ్ఞుడను.

పరిశోధనలో దేశదేశములందలి ఆచార్య వరేణ్యుల పరిచయ భాగ్యము పొందుటకు తగు సూచనల



గ్రంథకర్త

"రామాయణకథారత్న" "సాహిత్యరత్న"

**మూలా రామమూర్తి** M.A, (Tel.) M.A., (Skt.)

అర్ధాంగి

**శ్రీమతి నాగమణి** M.A., B.Ed.,

నొసగి, మార్గము చూపి ప్రోత్సహించిన బొంబాయి విశ్వవిద్యాలయ భూతపూర్వ ఆచార్యులు డా॥గజ నరసింహ సాఠేగారికి కృతజ్ఞుడను.

అడిగిన వెంటనే గురుదేవులు **కీ॥శే॥ దివాకర్ల వేంకటావధాని** గారు వారి సతీమణి **శ్రీమతి చంద్ర** గార్ల చిత్తరువులు గ్రంథమున ముద్రించుట కొరకు దయతో యొసగిన **శ్రీదివాకర్ల సీతారామ శర్మ** కృతజ్ఞుడను.

కోరిన వెంటనే ఈ గ్రంథమునకు తమ అమూల్యమైన అభిప్రాయము యొసగిన ''సరస్వతీ పు ''కవితా గంగోత్రి'' బిరుదాంచితులు తిరుమల తిరుపతి దేవస్థానం. అన్నమాచార్య ప్రాజెక్టు తిర సంచాలకులు డా॥ మేడసాని మోహన్‌గారికి కృతజ్ఞుడను.

అత్యంత అపురూపము, క్లిష్ట తరము అగు చిత్రములు వేసి ఇచ్చిన కళాకారులు **శ్రీ పంపరి శ** **రాజా ఆర్ట్స్** గారికి కృతజ్ఞుడను.

గ్రంథమును శ్రద్ధగా అత్యంత జాగరూకతతో సర్వాంగ సుందరముగా ముద్రించిన మి **శ్రీ శాంతా ఆర్టు ప్రింటర్సు** అధినేతలు **శ్రీరామ పవన్ కుమారు**కి ఆశీస్సులు.

ఈగ్రంథము వెలుగులోనికి రావడానికి పరిశోధనా వేతనమును అనుగ్రహించిన కేంద్రప్రభుత్వ వ వనరుల మంత్రాలయము, కొత్త ఢిల్లీవారికి శతసహస్ర వందనములు.

అన్నిటిని మించి. నా సాహితీ జీవితమునకు బాసటగా నిలచి, మిగుల శ్రమముల కోర్చి, తన సర్వ నా కొరకే వినియోగించి, నాలో ఉత్సాహమును పెంపొందింపజేసిన సౌమ్యమూర్తి నా అ **చి॥సౌ॥ నాగమణి,** యం.ఎ. బి.యిడి.కి నా శుభాశీస్సులు.

కేంద్ర ప్రభుత్వ, మానవ వనరుల మంత్రాలయము వారు పి.హెచ్.డి. పట్టమొసగరు. అంద దీనిని సమగ్ర సిద్ధాంత వ్యాసముగా రూపొందించలేదు. విషయ వివరణము నందు కొన్ని పొరపాట్లు యుండి యుండవచ్చును. పెద్దలు, భావిపరిశోధకులు మన్నించి ఆశీర్వదింతురని ఆకాంక్షింతును.

భవతు.

హైదరాబాదు

విద్వజ్జన విధేయుడు

తేది :

**మూలా రామమూర్తి**

# విషయ సూచిక

అవిఘ్నమస్తు శ్రీరస్తు శుభమస్తు

# శ్రీసీతా లక్ష్మణ భరత శత్రుఘ్నహనుమత్సమేత శ్రీరామ చంద్ర పరబ్రహ్మణేనమః

# శతకంఠ రామాయణము

## అను

# సీతావిజయము

## అధ్యాయము - 1

### రామునిపై భారతదేశమున గల ఆదరము వివిధ దేశములందలి రామాయణములు

శ్రీమద్రామాయణము ఆదికావ్యము, తపస్సుచే, వల్మీకభవుడై మహర్షియయిన వాల్మీకి రచించెను. విశ్వసాహిత్య చరిత్రయందును, సంస్కృతవాఙ్మయచరిత్ర ననుసరించియు వాల్మీకి యాదికవి యనియు, రామాయణ మాదికావ్యమనియు తెలియుచున్నది.

''వాల్మీకి నాదశ్చ ససర్జుపద్య''మ్మని అశ్వఘోషుడు

''స్వకృతింగాపయామాస కవిప్రథమ పద్ధతి'' మ్మనికాళిదాసు

''ఆద్యః కవిరసీత్ బ్రూహిరామచరిత్ర''మ్మని బ్రహ్మ వాక్కు.

''అథ భగవాన్ ప్రాచేతసః ప్రథమం మనుష్యేషు శబ్ద బహ్మాణం తాదృశం వివర్తమితిహాసం రామాయణం ప్రణినాయ'' - భవభూతి

వాల్మీకి నాదికవిగా, రామాయణ మాదికావ్యముగ ప్రపంచ సాహిత్య చరిత్రమునందు నిలబెట్టినవి.

రామకథ సుధారసవాహిని యుగయుగాంతరములనుండి, విశ్వ వ్యాప్తమంగ, ఆబాలగోపాలమునకు జీవన యానమున ఉత్సాహప్రోత్సాహములను కలుగుజేయుచు, మార్గోపనిర్దేశమును చేయుటయందు అత్యంత సమర్థమైనది. రామాయణ మనగా శ్రీరాముని చరిత్రమనియు సీతాచరిత్ర మనియు నర్థ విశేషము గ్రహింపనగును, రామాయణము - అయన మనగా చలనము, గమనము అను నర్థములు గలవు. రాముని గమన ఘని యర్థము శ్రీరామ + అయనము, శ్రీరామా + అయనము, శ్రీరామా- లక్ష్మీదేవి - సీత అనగా సీతా చరిత్రము తెలుపబడి యున్న కావ్యము ''కావ్యం రామాయణం కృత్స్నం సీతాయాశ్చరితం మహ''త్తని వాల్మీకియే చెప్పి యున్నాడు. రామస్యఅయనం స్థానం రామాయణమ్. రామునకు స్థానమైనది. రామ + అయన= సవర్ణ దీర్ఘసంధిచే ''రామాయన'' అగును. సంజ్ఞ వాచ్యమగుటచే పూర్వపదస్థములగు పరుషముల మీది నత్వము ణత్వమగును అను శాస్త్రవిధిచే రామాయణ మయ్యెను. (పూర్వపదాత్సం జ్ఞాయామగః, రషాభ్యాం నోణ స్సమానపదే - పాణిని)

రామాయణము లేక రామకథ తొలుదొలుతగా సంస్కృత భాషయందు రచింప బడినది. అనాదిగా భారతదేశమునందు భిన్న భిన్న ప్రాంతములయందు భిన్న భిన్న భాషలు వాడుకయందు గలవు. ఆయా ప్రాంతీయులు, వారివారి భాషలయందు శ్రీమద్రామాయణమును సంస్కృత భాషనుండి అనువదించి, రామకథా సుధారసమును అందించి యుండిరి. భారత దేశమందలి వివిధ భాషలలో గల రామాయణములను గూర్చి దిఙ్మాత్రముగా......

## 1. వైదిక వాఙ్మయము

వైదిక వాఙ్మయమున రామకథ యథాతథముగ కానరాదు. కాని ఋగ్వేదమందలి ఇంద్ర వృత్రుల కథకును రామరావణ కథకును సామ్యము కనవచ్చును. రామ శబ్దము వేదము నందు లేదని చెప్ప వచ్చును. సీత నామము మాత్రము ఋగ్వేదమున యథాతథముగ వాడబడి యున్నది. ఋగ్వేదము నందలి చతుర్థ మండలము **(4 - 57)** నందు రెండు స్తోత్రములు, యజుర్వేదమందు నాలుగు స్తోత్రములు కలవు. తైత్తిరీయ బ్రాహ్మణమున **(11-3-10)** యందలి కథకును, సీతకు కొన్ని పోలికలు కలవు.

## 2. బౌద్ధ వాఙ్మయము

బౌద్ధ వాఙ్మయమున గల జాతక కథలలో దేని యందును రావణుని ప్రస్తావన కానరాదు. వాల్మీకి రామాయణమునకు జాతక కథలే మూల మనుట హాస్యాస్పదము

## 3. జైనవాఙ్మయము

మూడవ శతాబ్దికి చెందిన విమలసూరి ప్రాకృత భాషయందు తొలిసారిగా జైన మతాను సంబంధిగా రామాయణమును రచించెను. జైన రామాయణములందలి విషయములు, ఘట్టములు పూర్తిగా వాల్మీకము ననుసరించి వ్రాయబడలేదు.

## 4. సంస్కృత వాఙ్మయము

సంస్కృత వాఙ్మయము నందు వాల్మీకికి పూర్వము చ్యవనుడు, అగ్నివేశుడు, భరద్వాజుడు మన్నుగు ఋషులు రచించినట్లుగా చెప్పుదురు. బహు ద్వీపాంతర విషయ పరిజ్ఞాత, లోకజ్ఞుడు, ఉత్తమ నాగరకుడు, కవితాపితామహుడగు వాల్మీకి కృత రామాయణమే ఆదికావ్యముగా ప్రసిద్ధి వహించినది.

### 1. అధ్యాత్మ రామాయణము

ఇది అధ్యాత్మిక గ్రంథము ఇందు రాముడు దేముడు.

### 2. ఆనంద రామాయణము

వాల్మీకి రామాయణము నకు పూర్తిగా భిన్నమగు రీతిని రచింపబడినది. ఇది శివుడు పార్వతికి చెప్పినట్లుగా యుండును. ఇందు సార యాత్ర, యాగ, విశాల, జన్మ, వివాహ, రాజ్య మనోహర, పూర్ణ అను తొమ్మిది కాండములు గలవు. ఇందు **109** సర్గలు, సుమారు **12,000** పైబడి శ్లోకములు

### 3. అద్భుత రామాయణము

ఇందు ఇరువది యేడు సర్గలు గలవు. స్వాతికి శివుడు చెప్పినట్లుండును. ఇందు సీత మహాశక్తి స్వరూపిణి. సహస్రకంఠరావణుని సీతాదేవి సంహరించుట ఇందలి ప్రధానాంశము.

### 4. మంత్ర రామాయణము

ఋగ్వేదమునందలి నూట యేబది యారు ఋక్కులకు రామాయణ పరముగ లక్షణార్యుని చే వ్యాఖ్యానింపబడి రచింపబడినది.

### 5 యోగ వాసిష్ఠ రామాయణము

దీనినే ''యోగవాసిష్ఠ'' మనియు పేర్కొందురు. ఇది వాల్మీకి భరద్వాజునకు చెప్పినట్లుండును

### 6 సంగ్రహ రామాయణము

నారాయణ పండితుడు దీనిని మధ్వాచార్య సిద్ధాంత పరముగా రచించెను

### 5. తమిళ వాఙ్మయము:

దక్షిణ భారతదేశ భాషలయందు అత్యంత ప్రాచీన సాహిత్యము గలది తమిళము. అందును సంగమ్ యుగము ప్రాచీనమయినది. ఈకాలము నాటికే రామకథ దక్షిణ భారతమునందు ప్రసిద్ధి వడసియున్నది. తమిళమున మహాకావ్యములుగా ప్రసిద్ధి చెందిన శిలప్పదిగారమ్, మణిమేఖలైలందు శిలప్పదిగారమున రామకథకు దీటు వచ్చు సన్నివేశములు, మణిమేఖలైయందు వానరుల సేతు బంధనము వర్ణితములు. తమిళ వాఙ్మయమునందు అనేకానేక రామాయణములు వెలసి యున్నప్పటికి కంబ మహాకవి విరచిత రామాయణము నేటికిని బహుళ ప్రచారమునందు గలదు.

### 6. మళయాళ వాఙ్మయము:

మళయాళ వాఙ్మయమున పదమూడవ శతాబ్దికి చెందిన శిరామకవికృతమగు ''రామచరిత'' మే ముఖ్యమయినది. ఇందలి భాష ''పాట్టి '' యను ఛందో విశేషము. ఇందలి ప్రధానాంశము యుద్ధకాండ కథావిషయము. యుద్ధ వీరుల నుత్సాహ పరచుటకీ రచన గావింపబడినదిగా జరిగిన దందురు, తరువాతి కాలమున నిరణన్ కవుల జాతికి చెందిన వాడుగా ప్రసిద్ధివడసిన ''కన్నశ్శఫణికర్ రామాయణము'' వీనిననుసరించి అనేకులు రామాయణ రచనమును గావించి యుండిరి.

### 7. కన్నడవాఙ్మయము:

కన్నడ వాఙ్మయమున రామకథ రెండు భిన్న మాతృకల నుండి వెలువడినది (1) జైన సంప్రదాయము (2) వైదిక సంప్రదాయము. జైన సంప్రదాయమునకు ప్రతీకగా పొన్నడు రచించినట్లుగా చెప్పబడుచున్న ''భువనైక రామాభ్యుదయము''. వైదిక సంప్రదాయమునకు ప్రతీకగా తొలి రచనము ప్రసిద్ధి నందినది షోలాపురమునందు రచింపబడిన ''తొరవి'' రామాయణయము కవి నరహరి, కుమార వాల్మీకి అను యశస్సు నందినవాడు. అర్వాచీనుల యందు మైసూరు రాష్ట్ర ఆస్థాన కవియగు డా॥ కె.వి. పుట్టప్ప (కువేమ్పు) వీరు (1) జనప్రియ రామాయణము (2)

## 8. మహారాష్ట్ర వాఙ్మయము:

ఇందు నరహరి సోనార్, ఏకనాథుడు, ముక్తేశ్వరుడు, సమర్థ రామదాసు మున్నగు వారు రామాయణ రచనము గావించిరి. మరాఠీ భాషయందు తొలి రచయిత నరహరి సోనారు అయినప్పటికి ఏకనాథ విరచిత భావార్థ రామాయణమునకే అగ్రతాంబూలము.

## 9. గుజరాతీ వాఙ్మయము :

శ్రీకృష్ణునికే అగ్రతాంబూల మొసగిన దేశమైనను, ఈభాషయందు రామబాల చరితమే తొలి రామాయణము. భీల్హణకవి విరచితము తరువాతి కాలమున అనేకానేక మంది కవులు కవయిత్రులు రామాయణ రచనము చేసి యుండిరి. కాని సంపూర్ణముగకాదు. వీరి వర్ణనముల యందు గుజరాతీవారి సాంఘికాచారములను విపులముగ రామాయణకథలయందు వర్ణించి యుండిరి.

## 10. ఉత్కళ వాఙ్మయము:

ఈభాషయందు సుమారు 12 రామాయణములు గలవు. వీనియందు తొలి రామాయణ కర్తగా పేరు గాంచిన వాడు బలరామదాసు. ఒరియా జీవనమునకు అధిక ప్రాధాన్య మొసగినవాడు. తరువాతి కాలమున లబ్ధ ప్రతిష్ఠుడు సరళాదాసు. రామాయణ, భారతముల నొక్కడే వ్రాసిన వాడు. ఈతని రచనలు, విలంక రామాయణము, విచిత్ర రామాయణము. విలంక రామాయణమున సీత సహస్రకంఠును వధించిన ఇతివృత్తము గలదు. అతి విచిత్ర, అవాల్మీక విషయములు గలది. విచిత్ర రామాయణము.

## 11. వంగవాఙ్మయము:

వంగ భాషలో విశేష కీర్తి నందిన కృత్తివాసుని రామాయణమే తొలి రామాయణము. కృత్తివాసుని తరువాతి కవులలో అత్యంత ముఖ్యమగునది చంద్రావతి యను కవయిత్రి. ఈమె రచించినది గేయరామాయణము నేటికి వంగదేశీయులు శుభకార్యముల యందు ఈరామాయణమును విధిగా పాడు కొనుచుండుట ఆచారమై యున్నది.

## 12. అస్సామీ వాఙ్మయము:

కఛారి రాజు- ముని మాణిక్యుని ఆస్థానకవి మాధవకందలి వాల్మీకి రామాయణమును అనువదించెను. ఈతని యనంతరము శంకర దేవుడు రామాయణమును రచించెను. ఈభాషయందు ఎక్కువమంది రామాయణమును రచింపలేదు.

## 13. హిందీ వాఙ్మయము:

ఇందనేకులు రామాయణ సంబంధ కథలను పెక్కు రచించి యుండిరి. కాని దిగంత యశస్సునందిన ''రామచరిత మానస్'' అను పేరున రామాయణమును పామరులు సహితము పాడుకొనుటకు అనువుగా రచించిన మహాపండితుడు ''గోస్వామి తులసీదాసు'' ధన్యుడు

**14. కాశ్మీరీ వాఙ్మయము :**

**15. పంజాబీ వాఙ్మయము :**

**16. ఉర్దూ వాఙ్మయము :**

ఇతోధికముగా ఈ వాఙ్మయముల యందు రామాయణ రచన సాగియుండెను

రామకథ కేవలము భారతదేశమునకే పరిమితము కాలేదు. ప్రపంచము నందు పలు దేశములలో భిన్న భిన్న రీతులలో కలదు. వేల సంవత్సరముల క్రిందటి భౌగోళిక స్వరూపమునేటి వలె లేదనుట కెన్నియో నిదర్శనములు గలవు. క్రీ॥పూ॥ 5000 ప్రాంతమున ఈజిప్టు (మిశ్రదేశము) దేశమును పరిపాలించిన చక్రవర్తి పేరు ''రామ్ సాయ్ -11'' ఇది రాముని పేరును సూచించును అనగా అంతకు పూర్వము ఎంతకాలము క్రితమో రామాయణ మున్నదనుట కిది నిదర్శనము. ప్రస్తుత మనదేశపు చిత్రపటమును ఆఫ్రికా ఖండవు పటమునకు జతపరచి చూచిన, పూర్వము ప్రకృతి వైపరీత్యముల వలన మనదేశ భూఖండము, ఆఫ్రికా ఖండము నుండి విడివడిన దనుట స్పష్టము. ఇతర దేశముల యందలి రామాయణములను గూర్చి దిఙ్మాత్రముగా -------

**1. చీనా దేశము నందలి రామాయణము :**

సంస్కృత పాళీ భాషల నుండి బుద్ధ జాతక కథలందు చేరిన రోకు - థో-జిక్-క్యో'' అను కథను 247 ఎ.డి. లో ''కో-సే-యే'' అను చీనా పండితుడు అనువదించెను. ఇందలి ''నిధానరాజు'' (దశవిలాసములవాడు) అను కథ. ఒకానొక భూస్వామి తండ్రి మరణింప ఈకథను చెప్పినట్లుగ ''జా-హూ-జో-కా'' అనునతడు రచించెను. ఇందు దశరథుడు కాశీరాజు ఇతనికి 16 వేలమంది భార్యలు గలరు. పెద్ద భార్యకు ఇరువురు కుమారులు, ఒక కుమార్తె. వారి పేర్లు రాముడు, లక్ష్మణుడు, సీత. రెండవ భార్యకైక. ఆమె కుమారుడు భరతుడు. కైక రాజును తనకుమారునికి రాజ్య మిమ్మని కోరును. ఈమె కోరిక కాదనిన బిడ్డలు చంపబడుదురని రామాదులను రాజ్యమునుండి బహిష్కరించును. కార్తాంతికులు 12 సంవత్సరముల లోపున దశరథుడు మరణించునని తెలుపుదురు. 9 సంవత్సరముల పిమ్మట దశరథుడు మరణింప భరతుడు వనముల నున్న రాము నొద్ద కేగి, తండ్రి మరణ వార్తను దెల్పి రాజ్యము చేయమని కోరును. రాముడు నిరాకరించి తనపాదుకల నొసగి భరతుని పంపివేయును. అరణ్యమున ఒక నాగము సన్యాసి రూపమున సీతను గొనిపోవును. సీతాన్వేషణము నందు రాముని దాహము తీర్చుటకై లక్ష్మణుడు తెచ్చి ఇచ్చిన నీరు ఉప్పగ నుండుట గమనించి, లక్ష్మణుడు ఆప్రవాహమును పరీక్షించును. కొండపైకి ప్రవాహము వెంబడి వెడలగా అది యొక కోతి కన్నీరని గ్రహించును ఆకోతి, నారాణిని, సైనికులను. తన మామనుండి రక్షించిన, నీభార్యను తెచ్చుటకు సహాయము చేయుదునని చెప్పును. మధ్యలో నాగముతో పోరి, చనిపోవుచున్న పక్షి నాగమును గూర్చి తెలిపి ప్రాణములు వదలును. నాగమును సంహరించి భార్య పవిత్రతను శకించును. ఆమె రాజుతో ''నేను గుహయందు క్రిముల మధ్యనున్న బురద యందలి కమలము వలె యుంటిని. సత్యమగు నెడ ఈభూమి బ్రద్దలగు'' నని శపథము చేయుటతో కథ ముగియును.

## 2. ఇండోనీషియా :

జావా ద్వీపము నందు ప్రసిద్ధి గాంచిన రెండు దేవాలయ సముదాయములు గలవు. అవి ప్రాంబనన్, పంతరన్ అని. పంతరన్ రాజవంశీకులు ప్రధానముగ శైవులు శివాలయమునందు, బ్రహ్మాలయమునందు రామాయణ సన్నివేశములు చెక్కబడి యుండును. ఈ చిత్తరువుల యందు ప్రధానముగ సీతాపహరణము, సుగ్రీవ కన్నీటి వృత్తాంతము, సీతా జటాయువున కుంగర మొసగుట (వాల్మీకము నందు లేదు) అంగదుని గూఢచారిగ పంపుట. విచిత్ర మేమన ఇచ్చటి రామకథయందు హనుమంతుడు కానరాడు. కాని ప్రాంబనన్ ఆలయ సముదాయమునందు వాలి సుగ్రీవుల యుద్ధము, సుగ్రీవ పట్టాభిషేకము, హనుమంతుడు అశోకవనమును ధ్వంసము చేయుట, ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రము వేయుట మున్నగు అంశములు గలవు.

## 3. కాంబోడియా :

ఇందలి రామ కథలో రామరావణ యుద్ధమున రావణుని వద్దకూడ వానర సైన్యముండుట విశేషము

## 4. థాయ్ లాండు :

పూర్వపు పేరు సయామ్. 13 శతాబ్దిలో ప్రధానముగ బౌద్ధము. వైష్ణవ మతములు గలవు. ఇచ్చటి రామాయణము పేరు ''రామకీర్తి''. వాల్మీకి ననుసరించి రాముడు ఆది దేవుడు. వీరికి కాదు. ఇందు రావణుని ఆత్మ వాని గురువగు గోపుత్రుని యొద్ద నున్న పంజర మందుండును. హనుమంతుడు, అంగదుడు గోపుత్రుని వధించి, ఆత్మను ధ్వంసము చేయగా రావణుడు చచ్చును.

శ్రీమద్రామాయణ ప్రాశస్త్యము భారత దేశము నందేగాక, ప్రపంచ మందంతటను గలదు వాల్మీకి ననుసరించి భారతదేశమునకు సంబంధించి నంత వరకు శ్రీరాముడు కేవలము ఒక ఆదర్శపురుషుడు గాక ఆదిదేవుడు. ఇతర దేశీయులకు ఆదర్శ పురుషుడు. రామకథ ఏదేశ మునందేవిధమున నున్నను, రాముడు దేవుడైనను, కాకున్నను రామునికి గల ప్రత్యేకత, గౌరవాదరములకు ఎచ్చటను లాఘవము కలుగలేదు ధర్మమూర్తి, ధర్మావతారుడు అగు రాముని స్మరించి తరించుటయే తరణోపాయము.



# అధ్యాయము - 2

# శతకంఠ రామాయణము - కర్తృత్వము

# మూలము - అనువాద పద్ధతి

## (1) శతకంఠ రామాయణము

సీతావిజయమను నామాంతరము గల శతకంఠరామాయణమును లింగన యను కవి ఆంధ్రమున నాలుగాశ్వాసముల ప్రబంధముగ రచించెను. సీతాదేవి సాక్షాత్పరదేవతయని పెద్దలు చెప్పుదురు. రామాయణమున రాముని గొప్పతనము విశదీకరింపబడినది. రామునికిగల ఇంతటి కీర్తికి మూలకందమగు సీతామహాత్మ్యము లేక పోవుటచే శతకంఠ రామాయణ మూలమున తెల్పియుందురు. పార్వతీదేవి పరమేశ్వరుని వలన రామకథను వినుచు ఇంకొకటాన తీయమని వేడ, ఈశ్వరుడు శతకంఠుని చరితము చెప్పుటతో ప్రారంభమగును. సంగ్రహముగా----

1. బ్రహ్మకుమారుడు పులస్త్య బ్రహ్మ. పులస్త్య బ్రహ్మకు విశ్రవసుడు, అశ్రముడు అను ఇరువురు కుమారులు. విశ్రవసుకు రావణ, కుంభకర్ణ, విభీషణ అను ముగ్గురు కుమారులు, శూర్పణఖ అను కుమార్తె కలిగిరి. అశ్రమునికి సంతతి లేమి సూర్యుని గూర్చి తపమొనరించి, ఆదేవుని వరప్రభావమున నూరుతలలు ఇన్నూరు చేతులు గల కుమారుని భార్యయగు చిత్రగంధి వలన పొందెను. ఇతనికి "శతకంఠు" డని పేరు

పెదతండ్రి పుత్రుడు రావణుడు నర వానరులచే చచ్చుటెరింగి, తాను బ్రహ్మను గూర్చి తపమొనరించి -

1. సకల దేవదానవుల చేతను
2. నర, స్థల, జలచరముల చేతను చావు లేకుండునట్లు
3. యుద్ధ సమయములయందు తన శరీరమునుండి క్రింద పడిన ప్రతి రక్తబిందువు నుండి ఒక్కొక్క శతకంఠుడు పుట్టునట్లు వరములు పొందెను.

వర బల గర్వితుడయిన శతకంఠుడు దుర్మార్గ వర్తనుడయి, భగవద్విరోధమును వహించెను. దేతలను సంతృప్తి పరచుటకై మునులు చేయు యజ్ఞయాగాది క్రతువులను ధ్వంసము చేయుచు, మునులను ప్రజలను బాధింపు చుండెను. శతకంఠుడు పెట్టెడి భాధలను భరింపజాలక కణ్వుడు, మాండవ్యుడు, మార్కండేయుడు, జాబాలి మున్నగు మహర్షులు శ్రీరాముని సహాయము కొరకు బయలు దేరిరి. దేవతలును, ఆమునులతో వారిపాట్లు శ్రీరామునితో చెప్పమని దీవించి పంపిరి. అట్లు మునులు శ్రీరాముని చూచి వారి బాధలు వివరించి రక్షణ చేయుమని అర్థించిరి. రాముని కోరిక ననుసరించి మునులు, శతకంఠుని గూర్చి విశదీకరించిరి. అంతయు శ్రద్ధగ నాలకించి శ్రీరాముడు, తాను శతకంఠుని సంహరించి శాంతి చేకూర్తునని మునుల కభయ మిచ్చి పంపివేసెను.

రాముడు మునులు తెలిపిన శతకంఠుని వివరములు ఆలోచించి, భయాందోళనములు పొందును. ఏమన రావణుని కన్నను అన్ని విధముల అధిక బలవంతుడు, విశేషించి వానికన్నను అధికమగు వరములు పొందిన వాడని, తనసందేహము, విచారము, ఏకాంత సమావేశమున సుమంత్రాది ముఖ్యుల మధ్య లక్ష్మణునితో చెప్పును. లక్ష్మణుడు రామునితో సోదరులగు భరతశత్రుఘ్నుల బలపరాక్రమములు పుత్రులగు లవకుశుల పరాక్రమ సంపద వివరించును. తదుపరి సుగ్రీవుడు, అంగదుడు, జాంబవంతుడు, నీలుడు, గయుడు, గంధమాదనుడు మున్నగు వారి మహాబల పరాక్రమముల నెరింగించును. ఆపైని హనుమంతుని అవక్ర విక్రమమును, మహిమాతిశయములను తెలిపి అంతటితో చాలింపక మిత్రులైన విభీషణాది రాక్షస ప్రముఖులను గూర్చి తెలిపి, రాముని నిజపరాక్రమమును గూడ జ్ఞప్తికి తెచ్చి ధైర్యము చెప్పును.

లక్ష్మణుడు చెప్పిన మాటలు విని రాముడు తానొనరించిన ప్రతిన నెరవేర్చుటకు గాను ఇంకను శతకంఠుని గూర్చి పూర్తిగా తెలియగోరి విభీషణుని స్మరించును విభీషణుడు, మంత్రులతో గూడి రాముని సన్నిధి కేతెంచును రామునికి నమస్కరించి తన్ను పిల్చిన కారణమడుగును. రాముడు అంతవరకు జరిగిన విషయములను విభీషణునకు వివరించి, శతకంఠుని గూర్చిన విశేషములు వివరింపుమని గోరుడుగును.

విభీషణుడు, శతకంఠుని వలని భయమున తాను తారకాచల మందలి యొక గుహలో ప్రస్తుతము యుంటున్న సంగతి తెల్పి, అన్ని విషయములు విపులముగ విశదీకరించుచు, శత కంఠునికి ఎన్ని వరములున్నప్పటికి ఎంతటి అజేయుడైనప్పటికి రాముని పై పగ సాధింతునని ప్రతిన చేసిన కారణమున వానిని చచ్చిన వాని గనె తాను ఎంచితినని తెల్పును.

అందరి వలన సకల విషయములు శతకంఠుని గూర్చి విని ఆలోచనము కుదురక, మౌనము వహించి చివరకు తనకు పరమాప్తుడగు హనుమంతుని స్మరించును గంధమాదన పర్వతముపైని వసించి యున్న హనుమంతుడు రాముని తలంపు నెరింగి, ఉత్తరక్షణమున రాముని సన్నిధికేతెంచును. ఏకాంతమున రాముని అనుమతిని విభీషణుడు సకల విషయములు వివరించును. అంత హనుమంతుడు రామునితో ''నీబంటునైన నేనుండగ విచారమేల'' నని పల్కి, తాను శివుని వలనను, తనతండ్రి వాయుదేవుని వలనను అమేయమైన వరములను పొందిన వాడనని తెల్పి విశ్వరూపమును ప్రదర్శించి రాముని సంతృప్తి పరచును.

**2.** కార్యోన్ముఖుడైన రాముడు విభీషణుని సర్వబలములతో తనకు సహాయముగ రమ్మనమని కోరి పంపును. అనంతరము లక్ష్మణుని, హనుమంతుని సుగ్రీవు నొద్దకు పంపును. ఆపైని రాముడు ఇంద్రుని స్మరించును. ప్రత్యక్షమైన ఇంద్రుని గాంచి, తనకు సహాయముగ వచ్చు సకల సైన్యములకు శతకంఠుడు చనిపోవు వరకు ఆకలి, దప్పిక, శ్రమ లేకుండునట్లు వరము అర్థించును. ఇంద్రుడు వరము నొసంగి రాముని దీవించి వెడలును.

లంకకు వెడలిన విభీషణుడు తన మంత్రులను రావించి, మహాసైన్యసమేతుడై అయోధ్య కేతెంచును. హనుమంత లక్ష్మణుల వలన విషయమును వినిన సుగ్రీవుడు జాంబవంతాది ప్రముఖ వీరులతో గూడిన అనంత సేనావాహినితో అయోధ్యకే తెంచును.

సైన్యమును రాముడు సమీక్షించు చున్నప్పుడు సీతాదేవి, తనను కూడ యుద్ధభూమికి కొని పొమ్మని కోరును. రాముడు నిరాకరించును. వసిష్ఠుడు ఆమెను తప్పక వెంటగొని పొమ్మని చెప్పును. వసిష్ఠ వచనము నాలించి సీతాసహితుడై రాముడు సుముహూర్తమున దండు బయలు దీసి సముద్ర తీరము చేరి సైన్యమును విడియింప జేయును.

**3.** హనుమంతుడు విశ్వరూపము దాల్చి సర్వసైన్యమును, తనతోకమీదుగ సముద్రములను దాటించును. పట్టణ నాలుగు ద్వారములను అంగదుడు జాంబవంతుడు, గోముఖాది వీరులు, విభీషణాది రాక్షస వీరులు ముట్టడింతురు. రాముడు హనుమంతుని రాయబారిగ పంపును. రాయబారమున శతకంఠుడు కోపించి హనుమంతుని పరిభవింప బోవును. హనుమంతుని వలన శతకంఠుడు భంగపడును. తల్లి చిత్రగంధి మాటను లెక్క చేయక శతకంఠుడు యుద్ధము ఆరంభించును.

**4.** చిత్రగంధి కుమారునికి సీతాదేవి చే శతకంఠుడు చనిపోయినట్లు తాను స్వప్నమున గాంచితినని చెప్పును. సీత సాక్షాత్పరదేవతయని, స్త్రీ చేత చావు తప్పదని, సీతారాములను శరణు వేడమని చెప్పును. శతకంఠుడు తల్లి మాటను త్రోసి పుచ్చి యుద్ధభూమికి వెడలి చివరకు సీతాదేవి చేతిలో చనిపోవును.

శతకంఠుని మరణానంతరము రాముడు శతకంఠుని అంత్యక్రియలకు ఏర్పాట్లు చేయించమని విభీషణునకు చెప్పి, శతకంఠుని కుమారుడగు నీలకేతునకు పట్టాభిషేకము గావించి సైన్యముతో అయోధ్యకు వచ్చును.

వాల్మీకి రామాయణమునకు - శతకంఠ రామాయణమునకు గలకొన్ని సామ్యములు.

| వాల్మీకి రామాయణము | శతకంఠ రామాయణము |
|---|---|
| 1. నారదుడు వాల్మీకికి రామకథ చెప్పుటతో ప్రారంభ మగును. | 1. పార్వతికి పరమేశ్వరుడు శతకంఠుని చరితము చెప్పుటతో ఆరంభమగును. |
| 2. నరవానరులచే తప్ప ఇతురుల చే చావు లేకుండ నట్లు వరమును రావణుడు బ్రహ్మనుండి పొందును. | 2. స్త్రీలచే తప్ప మరెవ్వరి చేతన చావు లేకుండు నట్లు వరములు పొందును |
| 3. సీత రావణుని చే అపహరింపబడును | 3. సీత కోరి రామునితో యుద్ధరంగమున కేగును. |
| 4. సముద్రమును సేతువు నిర్మించి సైన్యమును దాటించును | 4. హనుమంతుడు తనవాలమును పెంచి సైన్యమును సముద్రములను దాటించును |
| 5. రావణుని తల్లి కైకసి కుమారునితో రాముని పై వైరము తగదని నీతి నుపదేశించును | 5. శతకంఠుని తల్లి చిత్రగంధి సీతారాములతో వైరము తగదని నీతినుపదేశించును. |
| 6. రావణాదుల నాశము త్రిజట స్వప్న వృత్తాంతమున సూచింపబడును. | 6. చిత్రగంధి స్వప్నమున సీతచే శతకంఠు నాశము సూచింపబడును. |
| 7. అంగద రాయబారము | 7. హనుమద్రాయబారము |
| 8. లక్ష్మణుడు మూర్ఛనొందుట | 8. రాముడు, సోదరులు, లవకుశులు యుద్ధమున మూర్ఛనొందుట |
| 9. రంభకారణముగ నలకూబరుడు రావణుని శపించుట | 9. భంగపడిన కణ్వమహర్షి కుమార్తె విమలాంగి శతకంఠుని స్త్రీచే చచ్చునట్లు శపించుట. |
| 10. రావణుడు చివరుకు యుద్ధమునకు వచ్చుట | 10. శతకుంఠుడు ఆదినుండి యుద్ధము నందుండుట |
| 11. అగస్త్యుడు రామునికి ఆదిత్య హృదయము పదేశించును విభీషణుడు రావణ వధకు తోడ్పడును. | 11. నారదుడు బ్రహ్మాస్త్రముచే శతకంఠుని చంపమని సీతకుపదేశించును. |
| 12. విభీషణుని పట్టాభిషిక్తుని గావించును. | 12. శతకంఠుని కుమారుడు నీలకేతుని పట్టాభిషక్తుని గావించును. |

## 2) కర్తృత్వము:

సీతావిజయము, శతముఖరామాయణము, శతకంధర రామాయణము, శతకంఠ రామాయణము అను పేరులతో పిలువబడు ఈగ్రంథము ''శతకంఠరామాయణము అను సీతావిజయము'' అనుపేర వెలుగులోనికి వచ్చినది. ఇద్దాని కర్త లింగన ఇది నాలుగాశ్వాసముల ప్రబంధము.

కందుకూరి వారి ''ఆంధ్ర కవుల చరిత్ర'' యందు ఈ ప్రబంధము లింగకవి, గంగకవియను నిరువురు కవులు రచించి నట్లు గలదు. కవుల చరిత్రములోని వాక్యములీక్రింద పొందు పరచుచున్నాను.

''ఈ ఇరువురు కవులునుం జేరి సీతావిజయమను నామాంతరముగల శతముఖ రామాయణమును రచించిరి. ఈ ఇరువురు కవులు పేదాద్రి పురనివాసులు. వీరిలో నీలకంఠోపాసుకుడైన లింగకవి తాను రచించిన మొదటి మూడశ్వాసములు చిన్నారెడ్డి పుత్రుడగు పోచనృపాలునకంకితము చేసెను, నృసింహోపాసకుడగు గంగకవి తాను రచించిన నాల్గవ యాశ్వాసమును భోగ నృపాలున కంకితము చేసెను. ఈ యిరువుర కవిత్వమును మొత్తము మీద రసవంతమై, నిర్దుష్టమై హృదయంగమముగా నున్నది. ఈకవులిన్నూరు సంవత్సరములకు ముందున్నట్లు తెలియ వచ్చుచున్నది.''

ఈగ్రంథపు తొలి ముద్రణమెప్పుడు జరిగెనో తెలియదు. కాని సెప్టెంబరు, **1904**వ సంవత్సరమున విశాఖ పట్టణమునందు శ్రీవిన్నకోట అప్పల నరసింహులుగారు ద్వితీయ ముద్రణమును వారేగావించిరి, ద్వితీయ ముద్రణ పీఠిక యందు ''శతకంఠరామాయణమను పేర వాడబడు సీతావిజయమను ప్రబంధమింతకు పూర్వమే ప్రసిద్ధి నొంది యున్నది. ఆకావ్య రత్న మింతదనుక నేకారణము చేతనో కాని ముద్రితము గాక యుండుటచే దానిని ముద్రింపదలచి నాస్నేహితులగు బ్రహ్మశ్రీ మారేపల్లి రామచందశాస్త్రిగారి యొద్దనొక ప్రతియును మ॥రా॥రా॥ నిడుదవోలు సుందరము పంతులుగారి లైబ్రరీలో నొక ప్రతియుండగా నవిపుచ్చు కొని వానిననుసరించి సాధ్యమగు నంతవరకు దోషములు లేకుండ సవరించి ముద్రింపించితిని. కాని రెండు ప్రతులయందును కృత్యాది పద్యములు లేవయ్యె. పిమ్మట మరియొక ప్రతి లభించినది గాని దాని వలనను నాకొరత దీరదయ్యె. మొదటిసారి వేసిన ప్రతులన్నియు చాలాకాలము క్రిందటనే చెల్లిపోయినను కృత్యాది పద్యముల కొరకు చేయుచుండిన ప్రయత్నము సఫలమగునను నభిలాషతో నింతదనుకవేచి యున్న నవి యిప్పటికి లభింపమిచే నీరెండవ కూర్పునందు గూడ మొదటి కూర్పున నున్న రీతినే ముద్రింప వలసి వచ్చినది. ముందు దొరకిన యెడల పై కూర్పున నీలోపము పూర్తి చేసికొన యత్నించెదను. మహరాజ శ్రీ రాయబహదూరు కందుకూరి వీరేశలింగము పంతులుగారు వ్రాసిన కవుల చరిత్రలో నీప్రబంధ మిరువురు కవులు రచించినట్లు వ్రాసి యున్నారు. కాని మాకు దొరకిన గద్యలు గల రెండు ప్రతులలో నొక దానియందివి ''మర్దన'' కవి విరచితముగాను, రెండవ దానియందు లింగన కవి ప్రణీతముగాను గాన వచ్చుచున్నది. అయినను నేనారంభించిన ప్రతి మర్దనకవి విరచితముగా నున్నది యగుట చేతను లింగనకవి కృతముగానున్నది

యొకటి రెండాశ్వాసములు ముగిసిన పిమ్మట లభించియుండుట చేతను నాశ్వాసాంతముల మర్దన కవి ప్రణీతముగనే ముద్రింపవలసి వచ్చినది. ఇంతకు కృత్యాది పద్యములు దొరకునంతవరుకు గవి నిర్ణయము చేయవలను పడక యున్నది. దొరకిన ప్రతులు శుద్ధప్రతులు కాక పోవుట చేత నెంత కష్టపడి పరిశీలించినను గొన్ని లోపములుండక మానవు''.

**1954**వ సంవతసరమున శ్రీవావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ వారు ఈగ్రంథమును ముద్రించియుండిరి. వారి పీఠిక యందు ''సీతావిజయము, శతముఖరామాయణము, శతకంధర రామాయణము నను మూరుపేరులుగల ఈ రామాయణము మూడు ప్రతులను బట్టి సిద్ధము చేయబడినది. అందు మొదటిది ఆంధ్ర పరిషత్పు స్తకభాండాగారములోని కాగితపు ప్రతి. రెండవది తాళపత్ర ప్రతి. మూడవది విశాఖపట్టణపు ముద్రిత ప్రతి. పరిషత్ప్రతి గోదావరీ మండలములోని, అమలాపురము తాలూకాలోని అల్లవరములో గుబ్బల సుబ్బారాయుడు గారు **1903**వ సంవత్సరమున వ్రాసినది. రెండవ తాళపత్ర ప్రతి హేవిళంబి సం॥ ఫాల్గున బ॥**14** లగా యితు విలంబి సం॥ ర చైత్ర శు॥ **12** వరకు పత్యేపిచ్చయ్యగారు వ్రాసినది. మూడవది **1904** సం॥ నచ్చుపడినది. ఈగ్రంథము యొక్క కర్తల నామములను గురించి కొంత వివాద మున్నది. తాళపత్ర ప్రతిలో, ముద్రిత ప్రతిలో, దొరతనము వారి పుస్తక భాండాగారములోని యస్/**5-2-19** లోను మర్దయ కవియనియు, పరిషత్ప్రతిలోను, దొరతనము వారి పుస్తక భాండాగారములోని కె.**1-44** లోను లింగ కవి యనియు నున్నది. మరియు నందేకల **12-1-37** లింగయ, రంగయ్య కవులచే రచియింప బడినదని ముద్రిత పట్టికలో నున్నది,

పై నుదాహరించిన రెండు ముద్రిత ప్రతులు గాక హైదరాబాదు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము నందు రెండు తాళ పత్ర ప్రతులు Acc No. 440 call No T3 - 355 మరియు Acc No. 2747 call No T3 - 346గలవు. ఇందలి Acc No. 440 ప్రతి యందలి విషయము **1904**వ సంవత్సరపు ముద్రిత ప్రతికిని, **1954**వ సంవత్సరపు ముద్రిత ప్రతికిని స్వల్ప భేదములతో సరిపోవుచున్నది. కాని ఇందును కృత్యాది పద్యములు అవతారిక లేదు. కాని ఈప్రతి లింగన కవి కృతముగా యున్నది. మర్దన నామధేయము కానరాదు. Acc No. 2747 న ఆశ్వాసాంత గద్యము నందు పెనుబల్లె కోనయామాత్య సుపుత్రుడు (కవిపేరులేదు) బాఘసంవేద్యమందలి సీతావిజయంబు సర్వంబు నేకాశ్వాసము అనికలదు. ఇది రోమర్షమహాముని ధర్మరాజునకు శతకంఠవధను గూర్చి చెప్పును. ఇందలి రచన పూర్తిగా భిన్నము కృత్యంకితము కృతిపతి లేరు.

తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్య కళాశాల పుస్తక భాండాగారమునందు నాలుగు వ్రాతప్రతులుగలవు. అవి **70**R, **468**R, **551**R, **642**R మరియు **742**R ఇందు **70**R అసమగ్రము నిర్దుష్టముగాదు. మూలము వసిష్ఠ రామాయణము కర్తనామము లేదు.

**468** R ఆశ్వాసాంత గద్యము పేరుగా గలదు. గ్రంథ కర్త పెనుమల్లి బాపయామాత్యుడు మూలము శ్రీవిష్ణు సంవేద్య మహాత్మ్యము.

551R శ్రీవర్ఘ్నల చిన సీతారామస్వామి వారి ప్రతి ననుపరించి 1919 నందు శ్రీసాంబమూర్తి గారి చే లిఖించబడినది. ఇందు అవతారిక లేదు.

642R ఇందు అవతారిక లేదు. కవినామము మర్దయ.

742R ఇది సమగ్రవ్రాతప్రతి. అవతారిక గలదు. ఆశ్వాసాంత గద్యలయందు లింగన ప్రణీతము , మూడు ఆశ్వాసాంతములయందు రంగరెడ్డి పుత్ర భోగనృపాలునకును, రెండు, నాల్గవ శ్వాసాంతమున చిన్నారెడ్డి పుత్ర భోగనృపాలాంకితముగానున్నది. ఈప్రతి తొలుత అబ్బూరి య్యగారిది. ఇద్దానిని అబ్బూరి దేశరాజు కుమారుడు లక్ష్మీనరసయ్య బహుధాన్య నామ సంవత్సర ము శుద్ధ తదియ బుధవారం నాడు అనగా సుమారు ఫిబ్రవరి, 1879వ సంవత్సరమున వ్రాసికొనినది. గుంటూరు జిల్లా పెద్దపల్లి వాస్తవ్యులు యల్లా ప్రగడ వేంకట నరసింహారావుగారి వద్ద నున్న వ్రాత నుండి 1920-21 లో వ్రాయబడినది.

1904వ సంవత్సర విశాఖ పట్టణప్రతి మర్దయ పేరున ముద్రితమయినది. 1954వ సంవత్సర శ్య వారి ప్రతియు మర్దయ పేరుననే ముద్రింప బడినది. హైదరాబాదు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత క భాండాగారము నందలి ప్రతి లింగన కృతముగా గలదు. రెండవ ప్రతికాదు. తిరుపతి ప్రాచ్యలిఖిత క భాండాగారము నందలి ప్రతులలో 2 ప్రతులు మర్దయ లిఖితముగా కానవచ్చుచున్నది. మన్నిగు అవతారిక లేనివి, అసమగ్రములు 742Rసంఖ్య ప్రతి మాత్రము అవతారిక కలిగి గ్రముగా గలదు. కవి లింగన ఇంతియ గాక ''మర్దయ'' అను కవి నామము కందుకూరి వారి ధ కవుల చరిత్రము నందుగాని, చాగంటి శేషయ్య గారు రచించిన ఆంధ్ర కవి తరంగిణి యందుగాని, ద్రగారు రచించిన సమగ్రాంధ్ర సాహిత్యము నందుగాని, బులుసు వేంకటేశ్వర్లుగారి ఆంధ్ర కవి శతి యందుగాని కానరాదు.

''మర్దయ'' అను నామము వ్రాయస కాండ్ర లిఖిత ప్రమాదము వలన సంభవించి యుండి ండవచ్చును. ఏలనన మనయాంధ్రకవులు కృత్యాది నిష్టదేవతా వందనములు, కృతి పతి వంశావళులు చుటలో నెంత పట్టుదల గలవారో, యట్లే మన వ్రాయసకాండ్రును పీఠిక పద్యములను దొలగించి లు వ్రాయుటలో నంత పట్టుదల గలవారు అవియుట్లుండె. మనయాంధ్ర దేశమున తలిదండ్రులు న పేరును వదలివేసి మరియొక నామమున ప్రసిద్ధి నొందిన వారెంత మందియోగలరు. హరణమునకు కొందరు వారివారి పిల్లలకు పెంటయ్య, పెంటమ్మ, పుల్లయ్య, పుల్లమ్మ మున్నగు ములతో పిలుచుటాచారమైయున్నది. ఇందులకు కారణము మనగ్రామముల నైసర్గిక స్వరూపము సరించి యుహింపనగును. సాధారణముగా ప్రతి గ్రామమునకు యొకదేవాలయము ఊరి మేరన యుండును. అనంతరము కొంత భూభాగము నిరస్తముగా ఎవరికి చెందనిది యుండును. తరము తరువాత గ్రామపు సరిహద్దు ఆరంభమగును. సాధారణముగా ఊరియందు చెత్త చెదారము లము నందు పారవేయుటాచారము. పురిటి గదియందు ప్రసవమయిన వెంటనే బిడ్డలు మరణించిన

ఆస్థలమునందు పారవేయుదురు. కొండొకచో అట్లు పారవేయబడిన శిశువు జీవము గల్గియుండిన గొని తెచ్చి పెంచుదురు అట్లుగాకక బిడ్డలు దీర్ఘకాలము వరకు దక్కక పోయినను సంతానము కలుగకపోయినను చివరకు సంతానమునకు ఏదోయొక వికృతపు పేరున పిలచుట సహజమై యుండెడిది. అట్లుగాక చిరకాలము సంతానము లేమిచే కొందరు బైరాగులు, ఫకీర్లు మున్నగు వారి అనుగ్రహము వలన సంతానము కలిగిన, ఆ యా బైరాగులు, ఫకీర్లు విధించిన నామధేయమున ఆబిడ్డలు ప్రసిద్ధులగుట కలదు. ఇందులకు అద్దంకి రాజధానిగా ఆంధ్రదేశము నేలిన పెదకోమటివేమారెడ్డి గారి నామమునందు గల ''కోమటి'' శబ్దము అట్టిదే.

ప్రస్తుతము గోవా రాష్ట్ర రాజధాని పాణాజి (పంజిమ్) నగరాధ్యక్షులు (Mayor) అగు ''శ్రీరమేష్ సలీమ్ ఖాన్'' గారి చరిత్రమే ప్రత్యక్ష సాక్ష్యము. శ్రీరమేష్ గారి పూర్వీకులు బ్రాహ్మణులు. వారు క్రీ॥శ॥ **1850**వ సంవత్సర ప్రాంతమున గోవా రాష్ట్రమందలి లౌటులిమ్ గ్రామమున స్థిరపడిరి. ఆ దంపతులకు సంతానము కలుగలేదు. ఒకనాడు ఆ దంపతులు ఒక మహమ్మదీయ ఫకీరున కాతిధ్యమెసగిరి. ఫకీరు ఆ దంపతుల ముఖమందలి విషాద రేఖను గాంచి కారణమడుగ సంతానము కలుగలేదని విన్నవించుకొనిరి. ఫకీరు మీకు కలిగిన ప్రతిబిడ్డకు ''సలీముఖాను'' అను పేరుంచిన తగు నుపాయముపదేశింతునని పలికెను దంపతులు అంగీకరించిరి. వరుసగా పురుషసంతానము కలిగినది. అందరకు హిందూ నామము చివర ''సలీముఖాన్'' అను పేరుంచిరి. వారు బ్రాహ్మణులయినప్పటికి సలీముఖాను నామధేయముననే నేటికిని ఆకుటుంబములు వ్యవహరించు చుండిరి. అటులనే ''లింగన॥ ''మర్దయ'' గ స్థిరపడి యుండి యుండ వచ్చును.

లభించిన సమగ్ర వ్రాత ప్రతి లింగన కృతముగ యుండుట వలనను, పూర్వపు ముద్రాపకుల పీఠికల యందలి వివరణముల వలనను, కవి యొక్క అసలు నామధేయము ''లింగన'' యని నిష్కర్షముగా చెప్పనగును.

## 3. మూలము

శ్రీమద్రామాయణము వివిధ భారతీయ భాషలయందేగాక ప్రపంచ మందలి బహు భాషలలో గలదు. అన్నిటికిని మూల గ్రంథము వాల్మీకి కృతమగు సంస్కృత ప్రతియే. తెనుగు సాహిత్యము నందలి అన్ని ప్రబంధములకు, గద్య, పద్య కావ్యములకు మూల గ్రంథములు సంస్కృత భాషయందు వెలసినవేను. అట్టి యెడ సీతావిజయము అను నామాంతరముగల శతకంఠ రామాయణమునకు సంస్కృత భాషలో మూలమేది యనునది మిక్కిలి కఠినాతి కఠినమగు ప్రశ్నము.

ప్రకృత గ్రంథ విషయమునందు సలిపిన పరిశోధనలో బహు భాషలు, బహుదేశముల యందు గల వివిధ రామాయణములను గణనకు తీసికొనబడినవి. కొన్ని గ్రంథములయందు ఇద్దానికి మూలము వాసిష్ఠ రామాయణమనియు, మహాభారతము - అనుశాసనిక పర్వమనియు, ఆనంద రామాయణము

- రాజ్యకాండమనియు చెప్పబడినది. ఇట్టి వానిలో కీ॥శే॥ శ్రీరావూరు దొరసామి శర్మగారు రచించిన ''తెలుగులో రామ కథ'' యను పుస్తకమొకటి. తదుపరి హైదరాబాదు దొరతనము వారి ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారము నందలి ACC-**2747** ప్రతియందు మూలము వాసిష్ఠ రామాయణమని కలదు. అటులనే తిరుపతి శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయ కళాశాల ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము నందు గల **70R** అను ప్రతి యందు మూలము వాసిష్ఠరామాయణమని పేర్కొనబడినది. అందే **468R** అనుప్రతియందు మూలము శ్రీవిష్ణు సంవేద్య మహాత్మ్యమని పేర్కొనబడినది.

కీ॥శే॥ శ్రీరావూరు దొరసామి శర్మగారి ''తెలుగులో రామకథ'' అను గ్రంథము నందు మూలము వాసిష్ఠోత్తర రామాయణము, అద్భుతోత్తర రామాయణము అని పేర్కొనబడినది. అద్భుత రామాయణము నందు సహస్ర కంఠ వృత్తాంతము కలదు కాని శతకంఠువృత్తాంతము కానరాదు. అటులనే లభ్యమగు వాసిష్ఠ రామాయణపు ప్రతులలో మనదేశమందు శతకంఠు వృత్తాంతము లేదు. Universitat Munchen, Germany లైబ్రరీలో గల BIIe / 1750/1 - 2 సంఖ్యగల ప్రతులయందును శతకంఠువృత్తాంతము కానరాదు. కామిల్ బుల్కే గారి గ్రంథము నందు'' ఆనంద రామాయణము రాజ్యకాండ - **80** నుండి **85** శ్లోకములు'' అని గలదు. ఆనంద రామాయణము నందలిది మూలకాసుర వృత్తాతము. ఇయ్యది శతకంఠు వృత్తాంతమునకు దగ్గరగ యుండును.

పరాశరసంహిత అను నామాంతరముగల శ్రీ ఆంజనేయ చరిత్రమునందు శతకంఠు వృత్తాంతము **2** సర్గల పరిమితిలో సమారు **42** శ్లోకములు గలది కలదు. కాని ప్రకృత ప్రబంధ అనువాదమునకు మూలముగా యుండుట లేదు.

తత్త్వ సంగ్రహ రామాయణమనుపేర యొక తాళపత్ర ప్రతి రామబ్రహ్మానంద రచితముగ మదరాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునందు **31**.IM **2878** సంఖ్యతో కలదు. ఇది **7** ఆశ్వాసములుగలది. ఇందలి **7**వ ఆశ్వాసమందలి మొదటి **2** సర్గలలో గలదు ఇదియే లింగనకృత శతకంఠ రామాయణమునకు మూలముగా కనుపించుచున్నది.

## 4. అనువాద పద్ధతి.

సంస్కృత గ్రంథముల నాంధ్రీకరించు పట్టున కవి తనయసమాన ప్రతిభను ప్రకటించుట సహజము. భాషాంతరీకరణమును చేయు సందర్భముల యందు కవి సందర్భానుగుణంబుగ వినువారి కెంతయు నానందము కలిగించు నట్లును, కొన్ని చోట్ల మూలము ననుసరించియు, కొన్ని యెడల మూలమున కంటె నధికంబుగా పెంచియు, వర్ణనము లెక్కువ చేసియు, కొన్ని తావుల నింపుగాకుండేని, వదలివేసియు కొన్ని యెడల సమకాలీన సంఘపుటాచారముల ననుసరించి ఔచిత్యమును పాటించుటయు మున్నగు విధములు జరుగుట సామాన్య ధర్మము.

ప్రకృత గ్రంథకర్త నామము ''మర్దయ'' అనియు, ''లింగన'' అనియు గలదు. మర్దయ పేరున ప్రకటింపబడిన ముద్రిత ప్రతి యాశ్వాసాంత గద్య యందు కవి తనను గూర్చి (1) మహాకవిత్వవిద్యా పారీణ (2) సమహితాంధ్ర గీర్వాణ భాషా ప్రవీణ (3) సంగీత లక్షణ ధురీణ (4) సకల విద్వన్మిత్ర యను విశేషణములను వాడబడినవి. దొరకిన సమగ్ర వ్రాత ప్రతియందు ''లింగన'' తనను గూర్చి ఏమియు విశేషణములు చెప్పికొని యుండక తన నిరాడంబరత్వమును చాటు కొనినాడు.

ఏతద్గ్రంథమునకు మూలమనదగిన తత్త్వ సంగ్రహ రామాయణము నందలి సప్తమకాండమున తొలి 2 ఆశ్వాసములనితెలినది. అందు ప్రథమాశ్వాసము నందు 30 శ్లోకములు, ద్వితీయాశ్వాసము నందు 63 శ్లోకములు వెరసి 93 శ్లోకముల పరిమితమై యున్నది. (అనుబంధముగ మూలము చేర్చబడినది) ఈ మాత్రపు స్వల్ప పరిమాణముగల ఇతి వృత్తమును కవి లింగన సుమారు 674 పైబడిన పద్య, గద్యములతో 4 ఆశ్వాసములుగ తీర్చి దిద్ది ఆంధ్ర సాహితీ మణిమాలకు ఒక అనర్ఘ రత్నమును చేకూర్చిన ధన్యుడు.



# అధ్యాయము - 3

## సీతా పాత్ర వైశిష్ట్యము

''మాతృ దేవోభవ'' అనివేదము. అనగా సృష్టిలో మాతృమూర్తిది అత్యంత విశిష్ఠ మగు స్థానము రామాయణము అను శబ్దమునకు సీతాచరితమను అర్థము. రామునకు రామకథకు సంబంధించినంత వరకు, నేటివరకు వెలువడిన బహు గ్రంథములు పరిశీలించిన తత్‌గ్రంథ కర్తలందరు, రాముని పాత్రకే అగ్రస్థాన మొసగి యుండిరి. శతధా ప్రచరితమ్మైన రామకథయందు కేవలము రామునికే ప్రాధాన్యమొసగి యుండుట వలన, రామునికి గల కీర్తికి మూల కందమగు సీతామాత గొప్పతనమును గూర్చి వివరణాత్మకముగ ఏ ఒక్కరు పేర్కొని యుండి యుండక పోయిరి.

రామాయణమునంతయు విని రామునికి సీత ఏ మౌతుంది? అని అడిగాడట ఓ కొంటి కోణంగి వాల్మీకమును శ్రద్ధగా పరిశీలించిన సమాధానము సాక్షాత్తు హనుమంతుని నోటనే పలికించెను.

''అస్యాదేవ్యా యథా రూపం అంగప్రత్యంగ సౌష్ఠవం
రామస్యచ యథారూపం తస్యేయమసి తేక్షణా

**(5 - 15 - 50)**

ఈమె శరీరాకృతిని రాముడును, రాముని అవయవముల చక్కని అమరిక నీమెయు కలిగి, ఒకరికొకరు తగియున్నారు.

''రాజ్యం వాత్రిషు లోకేషు సీతావాజన కాత్మజా
త్రైలోక్య రాజ్యం సకలం సీతాయానాప్నుయాత్కలామ్

**(5 - 16 - 14)**

ముల్లోకములపై యాధి పత్యమా లేక జనకుని కూతురగు సీతయా గొప్పదని విచారించు చో, సమస్త త్రైలోక్య రాజ్యమును సీతతో నించుకయు సాటిగావని చెప్పగలను.

త్రైలోక్యరాజ్యాధిపత్యము జగజ్జనని యగు ఆదిపరాశక్తి శ్రీలలితాంబకు మాత్రమే చెల్లును. లోకోద్ధరణము కొరకు మహామాయా స్వరూపిణి, పరబ్రహ్మ పట్టమహిషి యగు జగన్మాత ఏకకాలమునందు రెండు రూపములతో నవతరించినది. ఆరెండు రూపములే ప్రకృతి - పురుషుడు - సీతారాములు. ఈశ్వరాంశ సంభూతుడగు హనుమంతుడు అశోక వనమున సీతామాతను గాంచి దివ్య దృష్టిని సీతారాములను ఆదిపరాశక్తిగా నెరిగిన వాడని పెద్దలు చెప్పుదురు.

అదియునుంగాక శ్రీవిద్యోపాసనయందు చండీ పారాయణము చేయుట గలదు. అటులనే చండీ హోమమును చేయుట గలదు. చండీ పారాయణము, చండీ హోమములయందు చండీ సప్తశతి యందలి మంత్రములు మాత్రము ప్రయుక్తము : చండీ సప్తశతియన 700. అనగా శ్రీవిద్య సప్త సంఖ్యాపరివృతమ్మై సప్త సంఖ్యాపరిపోషితమ్మై యొప్పుచున్నది. శ్రీమద్రామాయణము కూడా సప్త సంఖ్యాపరివృత్తమ్మై,

సప్తసంఖ్యాపరిషోషితమై యలరారును. కాది, నవ టాదినవ గణన వివరణమును పరిశీలించిన, రామ శబ్దము .............

రామ (2+5) = 7

రామావతార సంఖ్య = 7

రామాయణ కాండ సంఖ్య = 7

రామాయణమున యుద్ధ సంఖ్య = 7

రామరావణ యుద్ధమున మృతవీరుల సంఖ్య = 7

రామ జన్మతార సంఖ్య = 7

ఏకవింశత్యవతారముల యందు 16వది (1+6) = 7

శ్రీవిద్యోపాసన మోక్షప్రదము. తదధిష్ఠాన దైవతము. శ్రీదేవి. ఆమేయే. సీతామాత. సీతారాముల అనుగ్రహము కోరినవాడు, మహాతపఃశీలుడైన దశకంఠ రావణుడు.

లోకహితము కొరకు, ధర్మ సంస్థాపనము కొరకు ఏ ఇతరమైన శక్తికి సాధ్యము కాని విధమున దుష్ట శక్తులుద్భవించు పట్టున వానిని నిర్మూలించుట కొరకు ఆదిపరాశక్తి అవతరించుట జరుగుచుండును. శతకంఠుడు పొందిన వరముల వలన, వానిని బ్రహ్మేంద్రాది మహనీయులు సహితము నిగ్రహింప లేక పోయిరి. అట్టి యెడ, కేవలము తన్ని రోధము కొరకు మాత్రమే అవతరించిన మహాశక్తి స్వరూపిణి సీతామాత. జగన్మాత.



## అధ్యాయము - 4

# పురాణములలో స్త్రీలు యుద్ధము చేసిన ఘట్టములు.

సాధారణముగా స్త్రీ అబల. ఎన్నడు హింసా పూరితము, భయానకము, భీభత్స వాతావరణములకు దూరముగ యుండును అనివార్య సమయములయందు లోక కళ్యాణము కొరకు స్త్రీ విజృంభించిన తావులు కలవు. శ్రీమహావిష్ణువు యొక్క అవతారములు 10. అటులనే జగన్మాత యగు దేవీ అవతారములు కూడ 10 గలవు. ఆయా అవతారములు దుష్టశిక్షణకు, శిష్ట సంరక్షణకొరకు అవతరించుట జరిగినట్లుగా పురాణాముల యందు గలదు.

ఉదాహరణమునకు దేవీ అవతారములను గూర్చి -

1. మధుకైటభ సంహారమునకు విష్ణువునకు మహాకాళీ స్వరూపమున సుదర్శన చక్ర మొసగినది.

2. మహిషాసురుని సంహరించుటకు, సకల దేవతల యొక్క శక్తులను కైనొని, మహాలక్ష్మి అవతారమును ధరించెను.

3. సరస్వతీ రూపమున రక్త బీజుని సంహరించెను.

4. యోగమాయా స్వరూపమున దేవకీదేవి యొక్క అష్టమ గర్భమును కంసుని బారినుండి రక్షించెను.

5. రక్తదంతిగా ఆవిర్భవించి తనదంతములతో రక్తదంతుని సంహరించెను.

6. భీకర కరవు తాండవించునప్పుడు ఎల్లరకు శాకములు, ఫలములు ''శాకంభరీ'' రూపమున యొసగి సృష్టిని కాపాడెను.

7. దుర్గావతారమున దుర్గుడను రాక్షసుని వధించెను.

8. సంతాన హీనుడైన మతంగముని కోరికను మన్నించి తానే స్వయముగా మాతంగీ రూపమును ధరించెను.

9. భీమాదేవియై భీముడను రాక్షసుని వధించెను

10. భ్రమర రూపమున దారుణాఖ్యుడను రాక్షసుని సంహరించుటకొరకు భ్రామరీ రూపమును ధరించెను.

అంతియగాక నరకాసురుని సంహరించు పట్టున సత్యభామ శ్రీకృష్ణుని ప్రార్థించి తానుకూడ యుద్ధరంగమునకేగి, స్వయముగ యుద్ధమును నిర్వహించి, నరకుని వధించి నిజనాథుని మెప్పువడసెను. అటులనే శతకంఠ రామాయణము నందు సీతాదేవి శ్రీరామునితో తనను కూడ వెంట గొంపొమ్మని అభ్యర్థించును. రాముడు నిరాకరించును త్రికాజ్ఞుడగు వశిష్ఠమహర్షి సీతను విధిగా యుద్ధమునకు వెంట గొంపొమ్మని చెప్పును. కవి సీతాయుద్ధమును వర్ణించిన తీరు భాగవతమున బమ్మెర పోతన సత్యభామా నరకాసురుల యుద్ధఘట్టమును స్ఫురింప జేయును.

# అధ్యాయము - 5

# కవిత్వ ప్రశంస

ఏతద్గ్రంథకర్త బహులోకజ్ఞుడు. అపార పాండితీధురంధరుడు, కల్పనా చతురుడు. కేవలము **93** శ్లోకముల పరిమితిగల ఇతి వృత్తమును ఏకవీ ఇంతవరకు చేయని విధముగా సుమారు పదిరెట్లు పెంచి తనకావ్యమును తీర్చిదిద్దెను. కవిత్వము రసవంతము, నిర్దుష్టము, ధారా సంశోభితము. కొన్ని పద్యములు సంస్కృత పదభూయిష్ఠములు. కొన్ని యెడల వ్యాకరణ విరుద్ధ ప్రయోగములు మున్నగు నవి అచ్చుటచ్చుట కాననగును. ఇట్టి దోషములను ''ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు'' అను చిన్నయ సూరి సూత్రము ననుసరించి సాధువులు గనే భావింపవలసి యుండును.

ఇంతదనుక ''శతకంఠ రామాయణము'' ''శతకంఠ రావణుడు'' ''సీతావిజయము'' అను పేరులు ఆంధ్ర దేశముననే గాక యావద్భారత దేశము నందేగాక, యావత్ప్రపంచము నందును తెలిసిన వారు లేరనిన అతిశయోక్తి కాజాలదు. అంత మాత్రాన ఈ ఇతి వృత్తము లేదని కాదు, ఈచరిత్ర కన్నడ దేశమునందు ''యాక్షగాన'' రూపముననను, మళయాళ దేశమున ''కథా'' రూనముననను, వంగభాషయందు, మరాఠీ బాషయందు నున్నప్పటికి పూర్తిగా మరుగున పడిపోయినది. ఇట్టి వైలక్షణ్యాము గల సన్నివేశము శ్రీరామునితో సంబంధము కలదగుటచే ముందుముందు అత్యంత ప్రాచుర్యము నొంది ''యావత్ స్థాస్యంతి గిరయః, సరితశ్చమహీతలే'' అను నాభాణకమును సార్థకము చేయుననుటలో సందియమేమాత్రము యుండదు.

ఓం తత్సత్

# తత్త్వ సంగ్రహ రామాయణమ్

## ఉత్తర కాండే (7th canto) 1, 2 సర్గౌ

**సూతః**

1. పార్వత్యై పూర్వ చరితము త్తైవం మునయ శివః ।
తదుత్తర కథాం భూయం పార్వత్యై వక్తుమారభత్ ॥

శ్రీమహాదేవః :

2. అథరామస్తు వైదేహ్యా రాజ్య భోగాన్మ నోరథాన్।
భ్రాతుభిర్భంధుభిర్భ కైర్భభూనాపాలయన్మ హమ్ ॥

3. కదాచిద్దేవమునయో రామంద్రష్టుం సమాగతాః ।
కశ్యపో(త్రిర్వసిష్ఠశ్చ విశ్వామిత్రోథ గౌతమః ॥

4. వామదేవో భరద్వాజో నారదః పర్వతస్తథా ।
అగస్త్యో గాలవోగార్గ్యో ధౌమ్య శ్శక్తిః పరాశరః ॥

5. దత్తాత్రేయశ్చ భగవానసితో దేవలోచనః ।
బృహస్పతి రుచథ్యశ్చ మార్కండేయః శృతశ్రవాః ॥

6. ద్వైపాయనో విదర్భశ్చ జైమినిర్మకరః కఠః ।
కౌశికశ్చాథ రామశ్చ రోమశశ్చ మహాన్ ఋషిః ॥

7. ఉదంకశ్చైవ రైభ్యశ్చ పౌలోమశ్చ ద్వితత్రితః ।
కాపిర్వై కాలహస్తాఖ్యో మునిర్వై ధాతిలిస్తథా ॥

8. సారస్వతో యవక్రతః పులిందో మడ్కణ స్తథా ।
సంవర్తో ఋష్యశృంగశ్చ స్వస్త్యాత్రేయో విభాండకః ॥

9. రుచికో జమదగ్నిశ్చ తద్భార్యస్తపసాం నిధిః ।
ఏతేచాన్యే చమునయో బహవస్సంశితవ్రతాః ॥

10. సంప్రాప్తాతో మహాత్మానో రాఘవస్య నివేశనమ్ ।
విష్ఠితాః ప్రతిహారస్థా హుతాశన సమవిగ్రహాః ॥

11. శృత్వా ప్రాప్తాన్మునీ స్తాంస్తు ప్రత్యుద్ధాయ కృతాంజలిః ।
రామోభివాద్య ప్రథత ఆసనాన్యాదిదేశహ ॥

12. తేషు కాంచన చిత్రేషు స్వాత్రీ ర్ణేషు సుఖేషుచ ।
యథార్హము పవిష్టాస్తే హ్యాసనే ఋషయస్తతః ॥

13. శ్రీరామ ష్టోత్తర శత్రై ర్నామాభి ర్లోకమంగళై ః।
రాఘవం పూజయామాసుః పూజార్థమమి తౌజసమ్ ॥
14. తతస్తైః పూజితో రామః ప్రసాద ప్రణవ స్తదా।
వరేణో చీచ్ఛందయన్వి ప్రానిదం వచన మబ్రవీత్ ॥
శ్రీరామః
15. భో భో ద్విజోత్తమాస్సర్వే తుష్టోస్మి భవదర్శనాత్।
కిమాగమన కార్యవః కుర్వే తదబ్రూత మాచరమ్ ॥
ఋషయః
16. త్వాంతు దిష్టయా కుశలినం పశ్యామో హతశాత్రవమ్।
దిష్టయా నేనిహతోరామ రావణః పుత్ర పౌత్రవాన్॥
17. యస్యప్రమాణాద్విపులం ప్రమాణం నేహ విద్యతే।
దిష్టయా స సమరే రామ కుంభకర్ణో నిపాతితః॥
18. ద్వంద్వయుద్ధమను ప్రాప్తో దిష్టయా తేరావణోర్హతః।
దిష్టయాతే తాని హతా రామ కుంభ కర్ణ సుతోదయః॥
19. న హి భారస్య తే రామ రావణో రాక్ష సాదిభిః।
స ధను స్త్వం హి లోకాం త్రీ న్విజ యేధాన సంశయః॥
20. తథాపి కించిద్దక్ష్యామః సర్వం జానాతి యద్యపి।
రావణాద్బల వాన్కాచిచ్ఛుతానన ఇతిశృతః॥
21. సప్తానామపి సింధూనాం పరహారేస్తి రాక్షసః।
దేవదానవదుర్ధర్షో ద్ర ష్టుం స్మర్తుం నశక్యతే॥
22. శతథా రావణా దుర్గః పాప కర్మాపి తాదృశః।
ఏవంచాతి ప్రసంగేన రక్షసాం బహుకోటయః॥
23. ప్రతి సంవత్సరం చాపి స్వర్గ సారం హరత్యలమ్।
తదనంతరమేవార్థ మవాశిష్టం హి రావణః॥
24. ద్వయోరప్యంతరం వీర మేరుసర్ష పయోరివ।
ప్రబలై శ్వర్య విభవ బల దుష్కృతి బాధనైః॥
25. అసాధ్య స్తస్య నికటౌ కశ్చిదస్తి మహాసురః।
రక్త బిందురితి ఖ్యాతో మహీబల పరాక్రమః॥
26. రణమధ్యే యస్య రక్తం యుద్ధభూమౌపతిష్యతి।
సర్షపస్య ప్రమాణేన తద్బలో భవతెఽ సురః॥

27. తచ్ఛరీ రాన్ని పతితా రక్త బిందోథతాహశః ।
తచ్ఛరీర ప్రపతి తాన్పునర్భవతి తాహశః ॥

28. ఏవం చాతి ప్రసంగేన రక్షసాం బహు కోటయః ।
తతో విజయ ఏవాస్య న కదాచి త్పరాజయః ॥

29. తన్నాశయ మహాబాహో లోకానాం హితకామ్యయా ।
నభవస్తం వినా సౌమ్య తస్య హన్తాత్ర విద్యతే ॥

30. భగవాన్ పరమో దేవః శంఖ చక్రగదాధరః ।
ఏవం వదస్తు విప్రేషు రామస్తు మునిసత్తమాన్ ॥
భవిష్యతి వధస్త స్యేత్యుక్త్వా తాన్వి ససర్జసః ।

ఇతి శ్రీ తత్త్వ సంగ్రహ రామాయణే ఉత్తర కాండే
రామం ప్రతి ఋషికృత శతానన వధ ప్రార్థన
కథనం నామ ప్రథమ సర్గః ॥

ద్వితీయ సర్గః

శ్రీ శివః

1. గతేషు తేషు విప్రేషు గత్వా శ్వాంన్తః పురంహరిః ।
సల్లాపసమయేఽ న్యోన్యమువాచేదం ధరాత్మజామ్ ॥

శ్రీరామః

2. శతాననవధార్థాయ మునిభిః ప్రార్థతో స్మ్యహమ్ ।
తదర్థం శ్వో గమిష్యామి త్వం తిష్ఠాత్ర సుఖం ప్రియే ॥

సీతా

3. సరాక్షసః పురారామ తపసారాధ్య శంకరమ్ ।
పుం మాత్రా పధ్యతాం ప్రాప తస్మాద్వధ్యోనతేఽసురః ॥

4. దశాననోయందుష్టాత్మా హతస్తే శత్రు సూదన ।
శతాననవధం కుర్వే లోకరక్షణ కారణాత్ ॥

5. ఇదమేవ మహత్కృత్య మావయో రవతారయోః ।
తమహం హన్మిదుర్ధర్షం రక్తబిందుచ పాపినమ్ ॥

6. బ్రహ్మ దత్త వరాస్తోపి దుర్జయో దేవకంటకః ।
హతాతస్మిన్ హతప్రాయః శతాస్యో నాత్ర సంశయః ॥

7. ఇత్యుక్తో భార్యయా రామస్త ద్వాక్య మభి నంద్య చ ।
ప్రహసన్ రాఘవః ప్రాహ వైదేహీం ప్రియవాదినీమ్ ॥

శ్రీరామః

8. దుర్భర్షోయం రక్తబిందు ర్యదా వా సాధ్య తేకలమ్ ।
ఉపాయ స్తత్ర గమనే కో వా వద శుభాననే ॥

9. మమదేహ స్య ముత్పన్నామ్ రక్తబిందు ప్రహారిణీమ్ ।
జిహ్వాం బహూన్ రక్షబిందూన్ప్రసార్య ప్రహరామ్యహమ్ ॥

10. ఉపాయస్తత్ర గమనే హనూమాన్నో భవిష్యతి ।
ఇత్యుక్త్వోఽ చ్య హనూమంతం సమాహూయే దమబ్రవీత్ ॥

శ్రీరామః

11. శివావతారస్త్వం వీర శివవీర్య సముద్భవః ।
అపరః శివ ఏవత్వం శివతుల్య పరాక్రమః ॥

12. అగాధసత్వో బలవాన్ కామరూపీ ధురంధరః ।
ఇయద్బల మియద్వీర్యమియాన్ దేహస్తవేతిచ ॥

13. పరిచ్ఛేత్తుం సమర్థోస్తి కః పుమాన్ భువనత్రయే ।
యయుత్తార హితాస్తే స్యుర్జల విక్రమ బుద్ధయః ॥

14. యథా దశాననవధే విక్రాంతోసి సమీరజ ।
శతానన వధే త్వేవం విక్రమ స్వ మహాబల ॥

15. ఇత్యుక్తో రాఘవేణాయ హనూమాన్ రాఘవాగ్రతః ।
వవృధే విఘ్నయత్పూర్వం యావదాదిత్య మండలమ్ ॥

16. తమారురోహ వైదేహీ కపిం సౌమిత్రిణా సహ।
అనంతరం సమారూఢాః కపయో రాక్షసాశ్చయే ॥

17. విభీషణశ్చ సుగ్రీవో జాంబవానంగదోనలః ।
గజో గవాక్షో గవయః శరభో గంధమాదనః ॥

18. మైందశ్చ ద్వివిదశ్చైవ యే చాన్యే కపినాధకాః ।
స్వ స్వ సేనా సమాయుక్తో హనూమన్త మథారుహన్ ॥

19. ఆరూఢేషు చ సైన్యేషు సర్వేష్వ ద్భుత విగ్రహః ।
అసంకీర్ణం విక్రమేణ హనూమాన్మారుతాత్మజః ॥

20. ఉల్లంఘ్య సప్త జలధీ పక్షీవ ప్లవగేశ్వరః ।
దక్షిణాభిముఖో భూత్వా మహామేఘ ఇవోత్థితః ॥

21. శతానన పురోపస్యే సర్వాన్ తానవతారయత్ ।
తతః ప్రవహాతే యుద్ధం భీమం ప్లవగ రక్షసామ్ ॥

22. తదా శతానన బలం వానరైర్బహుధా హతమ్ ।
శతాననోపి స్వబలం హతం దృష్ట్వాతి కోపితః ॥

23. రణాయ స్వయమేవాగాస్తహితో రక్తబిందునా ।
తతః సేనాపతిః ప్రాగాత్సహస్రార్బుద సేనయా ॥

24. రథనాగాశ్వబృందానాం గణనా నాస్తి తత్ర వై ।
త దృష్ట్వా బలమాయన్తం హనూమానతికోపితః ॥

25. నృసింహ తార్క్ష్య వారాహ హయాస్య కపిరూపితః ।
చతుర్దిక్షు చ మధ్యే చ క్రమాత్పంచాననైర్వృతః ॥

26. మహాఘోరం దశభుజం నానాదివ్యాయు ధైర్యుతమ్ ।
కృత్వైవం దు స్సహం రూపం చకార కదనం మహత్ ॥

27. సీతా హృష్టదశాభుజా కరాలా రక్తలోచనా ।
నానాయుధధరా సర్వ శక్త్యుపబృంహితా ॥

28. హనూమస్తం సమారుహ్యా యుయుధే రక్తబిందునా ।
జిహ్వాం ప్రసార్య తద్రక్షో రక్తం పీత్వా హసచ్చుతమ్ ॥

29. తతశ్శతాననే ( ఛిన్నం పత్రం) నాజౌ యుద్ధ్వా మాసం నిరన్తరమ్ ।
త్రిశూలేనాపి తం హత్వా ననాదాతి భయంకరమ్ ॥

30. అవాశిష్టంతు తత్సైన్యం ముష్టి భిః పాద ఘట్టనైః
దశాసైర్వాలబంధైశ్చ హనూమాన్ న్యహనత్ క్షణాత్ ॥

31. ఏవం హతేషు దుష్టేషు లోకనాశకరేత్వథ ।
దేవాస్సంతుష్ట మనస్తుష్టు వుర్జానకీ తదా ॥

దేవా ః

32. నమస్తే దేవి వేదేహి నమస్తే భక్త వత్సలే ।
శరణ్యే త్ర్యయంబి కే దేవి నారాయణి నమోస్తుతే ॥

33. పరాసూక్ష్మాచ పశ్యంతీ మధ్యమా వైఖరీతథా ।
షట్చక్రసేవితావాణీ త్వ మేవనను జానకీ ॥

34. అజాత్వమేవ త్రిగుణా స్వగుణైః సృజసీశ్వరాన్।
బ్రహ్మాణం హరిమీశానం ప్రజాశ్చ త్రివిధాస్తతః॥

35. నశక్తస్త్వం వినారామః కర్తుం సృష్టావికాః క్రియాః।
నిర్వికారో యతో నంతస్త్వమేవ సకలం తతః॥

36. జడభక్తి శ్చాతథాత్వం చిచ్ఛక్తి ర్జీవరూపిణీ।
యాశక్తి స్సర్వదేవేషు త్వమేవ జన కాత్మజే॥

37. త్వమేవా వికృతిః పూర్వం తతస్సప్తకృతా కృతాః।
వికారాష్షోడశత్వం హి త్వాం వినానాస్తి కించన॥

38. హిరణ్యా వర్ణాం హరిణీం సువర్ణ రజత స్రజామ్।
చంద్రాం ప్రభాసా యశ సా జ్వలం తీజానకీం శ్రితాః॥

39. హిరణ్యా సాలా మార్ద్రాంచ భక్తే భ్యః కామవర్షిణీమ్।
పద్మే స్థితాం పద్మ వర్ణీమాశ్రయా మేవ యం శ్రియమ్॥

40. అశ్వపూర్వాం రథమధ్యాం హస్తినాద ప్రబోధినీమ్।
మనసః కామమాకుతిం వాచస్సత్య మసీమహి॥

41. గంధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీమ్।
ఈశ్వరీం సర్వభూతా నాం భజామోజాన కీం వయమ్॥

42. ఏవం దేవై స్తుతా సీతా (ఛిన్నం పత్రమ్)।
భక్తాన్న వర్షయంతీ (ఛిన్నం పత్రమ్)

సీతా

43. అహం రుద్రైశ్చ వసుభిరాదిత్యైశ్చ చరామ్యహమ్।
బిభర్మి మిత్రం వరుణ మిందాగ్ని అశ్వినావపి॥

44. అహ మాహన సంసోహం త్వష్టారం పూషణం భగమ్।
బి భర్మి యజమానాయ దధామి స్వం హవిశ్మహే॥

45. అహమేవ స్వయమిదం దదామి శృణుతామరాః।
యం కావయే తం తముగ్రం తం బ్రహ్మాణ మృషిచతమ్॥

46. శృణోమి సఘ్నియం తం చ జ్ఞానినం చ వివేకినమ్।
రుద్రాయాహం ధనుర్దద్యాం త్రిపురాం వధకార ణాత్॥

47. అహం జనాయ సమదం శృణోమి పృథివీం దినమ్
సత్వరూపే (ఛిన్నం పత్రం) పితరం సురాః॥

48. బహునోక్తేన కిం దేవా యత్ర యత్ర బలం ధృతి ।
తేజః ప్రజ్ఞాశృతం వీర్యం వినయాద్యా మమాంశజాః ॥

శ్రీశివః

49. ఏవముక్తవతీ సీతాం జ్ఞాత్వా సర్వాత్మికాం సురాః ।
నమస్కృత్వా బ్రువన్గౌరీం ప్రపన్నాః సర్వభావతః ॥

50. త్వయా సీతే మహత్కార్మకృతం బ్రహ్మాదిభిస్సురైః ।
అసాధ్యం తేన లోకాస్తే హ్యధునాస్సుర్గత వ్యధాః ॥

51. ఏవం ప్రసాద్య వైదేహీం హనూమన్త మథాబ్రువన్ ।
హనూమస్తే నమస్యామో రుద్ర రూపిణ మీశ్వరమ్ ॥

52. పంచ వక్త్రం మహాభీమ త్రిపంచ నయనైర్యుతమ్ః ।
............. ప్రతీకాశం కపివక్త్రం సుతేజసమ్ ॥

53. శ్లోకః పూర్ణతయా అదృష్టమ్ (పత్రస్తావత్ ఛిన్నః)

54. అత్యుగ్రతేజో వపుషం భీషణం భయనాశనమ్ ।
పశ్చిమంగారుడం వక్త్రం వక్రతుండ మహాద్యుతి ॥

55. సర్వ నాగ ప్రశమనం సర్వభూతారి కృన్తనమ్ ।
ఉత్తరే సూకరే వక్త్రం కృష్ణాదీప్త నఖోజ్వలమ్ ॥

56. పాతాల సిద్ధిదం ఘోరం సర్వరోగ నికృన్తనమ్ ।
ఊర్ధ్వం హయాననం ఘోరం దానవాన్త కరం పరమ్ ॥

57. దశభిస్తు భుజై ర్యుక్తం నఖరాలి కరాననమ్ ।
ఖడ్గం త్రిశూలం ఖట్వాం గం పాశం పర్వత మకుంశమ్ ॥

58. ముసలం చ ద్రుమం ముష్టిం ముద్గరం దశమం స్మృతమ్ ।
ఏతాన్యాయుధజాలాని ధారయంతం స్వకైః కరైః ॥

59. రక్షః ప్రేతాసన స్థం తం దివ్యా భరణ భూషితమ్ ।
రక్తాంబర ధరం దేవం రక్త గంధాను లేపనమ్ ॥

60. రక్తవస్త్రం రక్త రూపం భజామో వాయునందనమ్ ।
ధ్యాయ న్నేవం పంచవక్త్రం మనుం తద్వా దశాక్షరమ్ ॥

61. సర్వ సిద్ధిమవాప్నోతి దేవానామపి దుర్లభమ్ ।
సర్వరోగాః పణశ్యంతి గ్రహాద్యా శాన్తి దూరతః ॥

62. ఏవం స్తుత్వా హనూమన్తం దేవా జగ్ముర్యథాగతమ్ ।
తతః ప్రసాదితా దేవైః సీతా హనుమతా సహ ॥

63. శాంత రూపా పుష్పకేణ సబలా స్వపురీం గతా ।
తతశ్శతాస్య నిధనం శ్రుత్వా రామోఽతి విస్మితః ॥
ముముదే సీతయా సార్థం సేవితః కపిరాక్షసైః ।

ఇతి శ్రీతత్త్వ సంగ్రహరామాయణే ........
శతముఖ నిధనాదికలనం నామ ద్వితీయ స్సర్గః.

# BIBLIOGRAPHY


| Sl. No. | Name of Book | Author |
|---|---|---|
| **I.** | **SANSKRIT :** | |
| 1. | Srimadramayanam | Valmiki |
| 2. | Tattwa Sangraha Ramayanam | Ramabrahmananba |
| 3. | Ananda Ramayanam | |
| 5. | Vasistha Ramayanam | |
| 6. | Siddhanta Kaumudi | |
| 7. | Patanjali Bhashyam | Patanjali |
| 8. | Yoga Darsanam | - do - |
| 9. | Parasara Samhita | Parasara |
| 10. | Raghuvamsam | Kalidasa |
| 11. | Rasagangadharam | Jagannutha Pandita Rayalu |
| 12. | Mahabharatam | Bhandarkar Institute Pune |
| 13. | Kurma Puranamu | Vyasa |
| 14. | Agni Puranam | -do- |
| 15. | Vishnu Puranam | -do- |
| 16. | Padma Puranamu | -do- |
| 17. | Brahmunda Puranamu | -do- |
| 18. | Maha Bhagavatamu | -do- |
| 19. | Devi Bhagavatamu | -do- |
| 20. | Amara Kosamu | -do- |
| 21. | Niruktamu | Amaruka |
| 22. | Manusmriti | Manu |
| **II.** | **TELUGU :** | |
| 1. | Ranganatha Ramayanamu | Gona Buddha Reddy |
| 2. | Bhaskara Ramayanamu | Bhuskara & others. |
| 3. | Molla Ramayanamu | Molla |
| 4. | Telegu Sahityamulo Rama Katha | Ravuru Dorasami Sarma |
| 5. | Vividha Bharatiya Bhashallo Ramayanam | Dr. Malaya Vasini |
| 6. | Ramayana Sudhalahari | Yava Bharati Publication |
| 7. | Ramayana Prasangamulu | E. Krishnama chary |
| 8. | Ramayana Upanyasamulu | V.S.Srisivasa Sastry |
| 9. | Ramayana Sarvaswamu | Sanskruta Bhasha Prachara Samithi |
| 10. | Janapata Vagmayamu. | Dr. B.Rama Raju |
| 11. | Yakshagma Vagmayamu | Dr. S.V. Joga Rao |
| 12. | Andhra Bhasha Vikasumu | G.J. Somayaji |
| 13. | Adhumnikamdhra Kavitvamu, Sampradayamulu, Prayogamulu | Dr. C.Narayana Reddy |
| 14. | Sahitya Silpa sumaksha | Pingali Lakshmi kantham |

| Sl. No. | Name of Book | Author |
|---|---|---|
| 15. | Sahitya Sopanamulu | Dr. D.V.Avadhani |
| 16. | Appa Kaviyam | Appa Kavi |
| 17. | BalavyaKarnamu | Chinnaya Suri |
| 18. | Kavyadarsamu (Tr.) | Dr. P. Sreeramachandrudu |
| 20. | Dharmasena Ramayanam | Munipalli Subrahmamyakavi |
| 21. | Nirvacanottara Ramayanam | Janamanchi Seshadrisarma |
| 22. | Mahabharatam | YerraPraggada |
| 23. | Uttara Ramayanam (Vimarsa) | M.Panduranga Rao |
| 24. | Purana Vagmayamu | Dr. G.V. Subhahmanyam. |
| 25. | Antaratha Ramayanam | Peyyeti Lakshmi Kantamma |
| 26. | -do- | Kala Prapoorna V.Suryanarayana Sast |
| 27. | Satakantha Ramayam(Prose) | Puranam Pichayya |
| 28. | Sri Ramayana Sarodharamu | Mulukutla Lakshmi Narsimhavadhan |
| 29. | Samira Kumara Vijayamu | Pushpagri Timmana |
| 30. | Sri Ramakatha Sudha | Kuchibhotla Sakuntalamma |
| 31. | Ramayana Kalpavrikshamu | "Kavi Samrat" Viswanadha Satyanarayana |
| 32. | Sanskrita Vagmaya Charitra | Malladi Suryanarayana |
| 33. | Vasitha Ramayanamu | Madiki Singana |
| 34. | Ramayana Rasavahini | Satyasai College, Anuntapur |
| 35. | Andhra Kavula Charitra | Kandukuri Veresalingam |
| 36. | Andhra Kavi Saptasati | Bulusu Venkateswarlu |
| 38. | Samagrandhra Sahitya Charitra | Arudra |
| 39. | Telugu Lo Parisodhana | Yuva Bharati |
| 40. | Mahati | Yuva Bharati |

## III. HINDI :

| | | |
|---|---|---|
| 1. | Ramacharita Manas | Goswami TulasiDas |
| 2. | Mythilisaran Gupta | Memorial Magazine |

## IV. ENGLISH :

| | | |
|---|---|---|
| 1. | Sanskrit - English Dictionary | Sri Monier Monier Williams |
| 2. | Introduction to the Study of Literature | W.H. Hudson |
| 3. | Poetics | Aristotle |
| 4. | Ramayana Tradition in Asia | Dr. Raghavan |

## V. ORIYA :

| | | |
|---|---|---|
| 1. | Vilanka Ramayanam | Sarala Das |
| 2. | Vichitra Ramayanam | Sarala Das |

## VI. BENGALI :

| | | |
|---|---|---|
| 1. | Krithivasa Ramayanam | Krithivasa |

## VIII. MARATHI :

| | | |
|---|---|---|
| 1. | Bhavartha Ramayanam | Ekanath |

# సీతా విజయము

## ప్రథమా శ్వాసము

ఉ॥ శ్రీవనితాల లామమునుశిష్ట జనస్తుత శీలయైన భూ।
దేవత పాదపద్మముల తిప్రియ మేర్పడమెత్త శేషమూ
ర్థావళిగల్లు రత్ననివహద్యుతియంగములం వెలుంగునా।
నావిధ సంభ్రమంబులఁగ నందగు రంగవిభుండు భోగమ।
క్ష్మావిభునాదరించియతి సౌఖ్యపరంపరమీఱ బ్రోవుతన్॥ 1

ఉ॥ జింకమిటారికేలుపయిజెందిన వన్నెలతోట మేడలుం।
పొంకపుటల్లుధారలును బొంకముతోడను బట్టినట్టివెన్
బింకపువాలునంగ లిగి పెంపుగ లోకమునందు మించుత
చ్ఛంకరుగా చుఁగా తనయ సభ్యునిభోగమ రెడ్డిభూపతిన్॥ 2

చ॥ అలిగినఁ బార్వతింబలు విధంబుల రొమ్మునఁ జేర్చుచందమున్
తెలియకయున్నఁదండ్రిఁగని తీవ్రతఁ గొమ్మున వెండికొండబి।
ట్టులు కనుజాయపార్వతి యునుల్లమునంభయ మందిదన్ను భా।
గ లరఁగఁగొ గలింప శివుఁడౌ రసు పుత్రకుడంచుమెచ్చఁగా।
వెలసిన యాగణేశుఁడు వివేకుని జేయును భోగయాధిపున్॥ 3

శా॥ వీణానాదవినోద భక్తు జనులన్ వేఁడుంగటాక్షించు చో
రాణింపం సమగట్టి సద్విజయవక్త్ర ప్రాకటావాసయై।
పాణింగ్గా తన మాటలోనె మొలఁగంబొర్లన్ నియోగించునా।
వాణీవే వెలభోగయక్షి తివరుల్లవర్థిల్లన్‌ఁగా జేయుతన్॥ 4

శా॥ దాతనందండ గొనియాడి తద్వీరించి
సదృశ విద్యావరుబ రాశరుని బగడి।
యతని పౌత్రుని శుకయోగియనువు మీా ఱ।
దలచి వాక్కుల కొనరవందన మొనర్చి॥ 5

సీ॥ ధీరమయూరుని తెలివిమ్మై నుతియించి।
బాణుప్రవీణుని బ్రస్తుతించి
మాఘుగుణౌఘుని మహిమలు వర్ణించి
కవిమల్లురిపుభల్లు గ రుత గొలచి
కాళిదాసుని హృద్వికాసుని గీర్తించి
శ్రీనాథు గుణయోధు జెలఁగి పొగడి।
గ్రక్కున తిక్కన గరిమ సంభావించి
భయధట్టి నన్నయ భట్టునెన్ని।
గీ॥ మొనసి సద్గుణధాము భీముని భజియించి।
పోతరాజును రవితేజుఁబొసఁ గఁదలఁచి
పరఁగ జయదేవుదివ్య ప్రాభవుని మెచ్చి
సోము సద్గుణయశః కళాసోము నుడి వి॥ 6

చ॥ నెఱులు పట్టిగాని మఱి నిల్వఁగనే రరుదుష్కవుల్ దగన్
కొఱికిన కాక వెండియును కోమలతం బొసఁగించనేర్చునే।
మఱి శునకంబుభూపనివహక్రియహేమ సుఖాననాగ్రసుం।
ద రమణిమధ్య ఘటి తస్పుటచి త్రదు కూలకుద్భముల్। 7

వ॥ అనియివ్విధంబున నిష్టదేవతా ప్రార్థనంబును మహాదేవవంద నంబును గణాధిపతిస్తోత్రంబును, సరస్వతీ భజనంబును పురాతనవర్తమాన సకల సుకవి సంభావనంబును కుకవి నిరాకరణముఁగావించి సీతా విజయంబను మహాప్రబంధంబురచియింపనుద్యోగించి యీ మహాకావ్యంబునకునే మహాత్ముండర్హుండొకోయనివిచారించు సమయంబునగొబ్బూరి వంశసుధాంబోధి హిమకరుండును హరముందార నీహారగోక్షీర తారకోహిత కర్పూర సదృశ కీర్తివిహారుండును, గౌళకర్ణాటద్రావిళ పాంచాలకోసల సౌరాష్ట్ర మహారాష్ట్ర కాంభోజాది నానాదేశ సభాసన్నుతుండును పొన్నూరి పట్టణాధ్యక్షుండును నగు భోగన్నృపాలుండీ మహా కృతికి నధిపతి గాదగుననియుంటి యంత నతండును యద్భా వంతద్భవతి యనుమార్గంబు నిజంబై యొనర్పంబూని ప్రబంధా లంకారంబులు విని నన్ను రప్పించి భూషణాంబరపరిమళాదుల నాదరించియిట్లనియె॥ 8

చ॥ ఎలస తిలింగ సత్క విసురేంద్ర ఫణీంద్రవచో విలాసినీ।
పలుకులుతాండవేశ్వర కపర్దులు రుద్గణనా పగాచల
చ్చల దురుయం తరంగచయ సంకషజాతి నిరర్గళాతిని
ర్మల విలస త్యుమామాముఖు సమాన విజృంభణముల్ దలంపఁగన్॥

ఉ॥ కావున నీవు సేయుఁ గృతిగన్గొన నాకిపుడంకి తంబుగా।
పావన వృత్తిఁజేయుమని పాయ కనూట పదా విచ్చునం।
నేవివరించి సమ్మతిని సేర్పున నవ్విభుపేరనెంతయున్।
నావి నిభోగభూపతికొనర్పఁగఁజేసెద చిత్తగింపుడీ॥

వ॥ ఇవ్విధంబున నాయొర్పంబూనిన సీతావియజంబునకుఁగథా క్రమం బెట్టిదనిన॥.

ఉ॥ భా సురలీల శంభుఁడు గృపారర సముప్పతిలంగ చారుకై
లా సమునందుఁబార్వతికి రాముకథల్ వివరింపనందుచే।
వాసి గసంతసిల్లి నిజవల్లభుపైఁదన చూడ్కి నిల్పియో
దా సజనావనాత్మక సదాశివయింకొ కథాన తియ్యవే॥

మ॥ శతకంఠుండను ఘోరదైత్యుడు రఘుస్వామిన్ రణంబందునే।
గతిమై తల్లడిలంగఁజేసె నటుతత్కాంతాలలామంబేను
ధ్ధతి వీక్షించిపెనంగె నెట్లు మఱిత త్కాండ ప్రచండక్రియన్।
మృతుమై యేవిధిగూలె నాతడది పేర్మిన్ దెల్పుమా వెండియున్॥

గీ॥ ఎవ్వఁడా రాఘవేంద్రుని యుచ్చఁదలఁచు
నెవ్వఁడా సీత మహిమంబు లెఱుఁగఁగోరు.
నాయురాగోగ్యములు వాని కతిశయిల్లు
తాండవంబాడు లక్ష్మియా తనిగృహమున।

కీ॥ ఈచరి త రాఘవుని దట
యాచాలు నఁబుట్టినా రిదట మ హిమమొగిన్।
నీచే తలలు కఁబడునటుఁ
చూచిన వ్రాసినను విన్న సుఖులౌటురుదే॥

వ॥ అనిన వినిసర్వజ్ఞుండగు మహాదేవుండు సమ్మతించి పులస్త్య ప్రకారంబును, తత్సుతుల విశ్రావసాశ్రముల విధంబును. రావణ కుంభకర్ణ విభీషణాది జన్మంబును, అన్న కొడుకులంజూచియశ్రముండు వగచుటయు దపంబుసేయుటయుఁదత్ప్ర ప్రభావంబు నమహావీరునింగనుటయునతండు రాముచేతందెగిన రావణాను జదను జప్రళయంబు వినుటయునప్పుగ నీ గఁగోరితపంబు సేయుటయున జుండు పొడఁజూపుటయు నతని వలన దుర్లభంబులగు వరంబులు గొనుటయు మునులంబంధించుటయు నమ్మునులు రామచంద్రుని పాలికింజని శరణు చొచ్చుటయు వారికి నభయ హస్తం బులిచ్చుటయు శతకంఠునింజం పఁబ్రతిజ్ఞ సేయుటయు మును లంబొమ్మనుటయు వెనుక నమ్మహాదను జువిక్రమంబులు విని బల సామగ్రి చాలదని వగచుటయు లక్ష్మణుండు తమ పరాక్రమంబులు దెలుపుటయు విభీషణు రాబంపుటయును నతని వలన కొన్ని వివరంబు లెఱుంగుటయు హనుమంతునిందలంచుటయు నతనికి దనవృత్తాంతంబు జెప్పుటయును నక్కపికులోత్తముండు దన మహా రూపంబుజూ పుటయు సకల మనుజదను జవన చరబలంబుల రప్పించుయు తన్నుంగొని జనుమని సీతవేఁడుటయు రాఘవుండనుమతించుటయు దండు వెడలుటయు నందఱినొక్కపెట్టునహనుమంతుడు తనశరీరము ద్రాల్చుటయు దేవతులు సన్నుతించి పుష్పవర్షంబులు గురిపించుటయు, నందులకు మిగుల నుత్సహించి పవనజుండు దన వాలంబుపై నఖిలదళంబుల సముద్రంబు దాటించుటయు లగ్గపట్టుయు హనుమద్రాయబారంబును చిత్రగంధి నీతియు ద్వంద్వయుద్ధ ప్రకారంబును సకల బలప్రళయంబును రాముండుదలఁవడి ఘోరయుద్ధంబు సల్పుటయు నందు రాఘవుండు గళవళించుటయు సీతవిల్లందుటయు దనుజబలసంహారంబును శతకంధరు పరాభవంబును మరునాడరుదెంచుటయు నారదాగమనంబును హితోపదేశంబును బ్రహ్మాస్త్ర ప్రయోగంబును శతముఖు మరణంబును చిత్ర గంధి విలాపంబును నీలకేతను బట్టాభిషేకంబును హనుమంతుడు జలధులు దాటించుటయు బురంబుజేరుటయు రాజ్యంబు భావించుటయు మొదలుగ నంత యుందలపోసి మందస్మిత ముఖారవిందుండై యిందు శేఖరుండు పార్వతీదేవి కిట్లనియె ॥ 15

**కీ॥ రావణుఁడురుసం గరవి।**
**ద్రావణుఁడాఖిల బాహుదండ జితోగ్రై**
**రావణుఁడే సేయునురుదు.**
**ర్భావపరా భవములాత్మభావించి సురల్॥ 16**

గీ॥ క్షీరవారాశి కడకేగి శ్రీరమాధి।
నాథుఁబొడగని గదసివందనములొసఁగి।
తమ పరాభవమెఱింగింపఁగమల నాథు।
డభయకరమిడి పనిచెఁగొన్నబద్ధములకు॥

గీ॥ త్రిదశులనుబ్రోవనాత్మఁజింతించి పంక్తి।
రథు మహిషిగర్భదుగ్ధాంబు రాశియందు
నొనరసత్సంతతికి మోద మొదవరామ
చంద్రుఁడు దయించె పూర్ణిమా చంద్రు పగిది॥ ఇట్లుదయించి॥

సీ॥ ధరణీ ధరాటక తాటకఁబడనేసి
జన్నంబు పన్నంబు జక్కఁజేసి
ఖ్యాతిఁగాఱాతిని నాతిఁగా గావించి
భవుని చాపంబు రూపంబు మాపి
సీతను భాగ్యసమేతను పెండ్లాడి
కైకవాక్యంబున కైక్యంబునొంది
గుహుని సద్ధర్మ హృద్గుహుని సంభావించి
రాష్ట్రా పరాధు విరాధుగొట్టి

గీ॥ ఘనులమునులను మన్నించి ''ఖరులగు ఖర''
దూషణులద్రుంచి ఖీకరాదులను గూల్చి
యొక్క రక్కసి వెక్కసై సొక్కుదాని
ముక్కు చెవులకు గలనిక్కుఁజక్కఁజేసి।

శా॥ మారీచుంబడనేసివాయుజుని సన్మానించి కిష్కింధకున్।
నీరేజాప్తజురాజు జేసియల కర్ధింబూని బంధించి బల్।
నారాచంబుల పంక్తి కంఠఘటకర్ణశ్రేణి హింసించి, లం।
కారాజ్యంబున నవ్విభీషణుని భాగ్యప్రాప్తుగా నిల్పుచున్।

ఉ॥ వారధివానరాళి గొలువంగను గ్రమ్మఱదాఁటి సీతయుం।
దారునులక్ష్మణుండున వధానవిమానము లెక్కివేల్పులున్।
భోరున పుష్ప వర్షములు బొంగుచుఁగుర్వఁగవైరి దూరగం।
భీరమనస్కులైచనిరిపెల్లుగఁదల్లులఁ జూచువేడుకన్॥ **22**

వ॥ ఇట్లు చనిచని నిరంతరకుసుమఫలభరిత తరునిచయారామంబులును। విమల కమల కల్హారషండమండితజలాశయంబులును అభేద్య పరిఘాప్రాకారద్వారకవాటదురణతోరణవిరాజిత సౌధాగ్రబంధ బంధురశాతకుంభి కుంభసముదాయంబులును హాటక విరచిత నూత్నరత్న దీప్తి ధగద్ధ గాయమాన రాజ్యప్రాసాద ప్రాంగణరంగ సంగత కనకమంటపావరణ విచిత్రకుడ్యగవాక్షసంశోభితంబులును వీరకుమారసుందరమందిర పశ్చాద్భాగసంస్థితకేళికాకుధర నిత్యనివాస కీరమయూరశారి కాపికప్రకటకోలాహలంబును, అనవరతమదజలపంకసంకరగండ మండల శుండాలతాతండబులును జపవిజిత పవనమనోవేగ రంగత్తరంగరబులను। అవక్రమణి చక్రాగణిత ఘంటికాఘణఘణం రవాభ్రంకషధ్వజ కలన సాధనాయుత రధనిచయంబులును । రంభా సంభోగారంభ విజృంభమాణవిభవగంభీరనాదవీణా సంఘంబులును, సమస్తరాగోపరాగతానమానావధానమంగళపాఠ మహిమంబులును అభ్రంకష గోపురపాకారచతుర్ద్వార పవనాత్మదళిత వృష భకే తన నానా ధూప ధూమఘుమఘుమాయమాన వాసనావాసిత దేవాలయంబులును, భేరీమృదంగ శంఖకాహళపణవఢక్కాముఖానేక వాద్యఘోషంబులును ప్రజ్ఞావిశేష నిర్జిత శేషభాషా ధీశులగు విప్రవర్గంబులును నమరపరశరభేదితోరణ స్థల నిర్మలాక్షత భూషిత భూషణ క్షత్రియ కుమారవారంబులును ధనకనకవస్తు వాహన ప్రవర్ధమానవ్యావహారహాసిత ధనదాలులగు వర్తకులును, అక్షుద్ర భద్రత రశాశ్వతైశ్వర్య తిరస్కృత సముద్రులగు శూద్రులుగల్గుసా కేతనగరంబు ప్రవేశించి యనర్గళ సంభ్రమాయత్త చిత్తుండై రఘువరుండు మక్కువనొక్కనాఁడు శుభముహుర్తంబునను జనపరివేష్టి తుండైముని జనపురోహితామాత్య జననీత్రయానుమతంమున జానకీ సమేతుండై ॥ 22

కం॥ పట్టాభిషిక్తుఁడయ్యెను।
నెట్టనభువనములగల్గు నృపతులు మెచ్చన్॥
భాట్టప్రభాకరధీశా
స్తోత్టింకి తులైన సుకవులొనరనుతింపన్॥ **23**

గీ॥ ఇట్లు పట్టంబుగట్టుక యేపుమెఱసి
దనుజవిదళనబిరుదు పద్యములు వినుచు।
నెల్ల జనములుముదమందసేలు చుండె
తల్లియునుదండ్రియును దాతదానెయనఁగ॥ 25

సీ॥ ధర్మంబునాల్గు పాదంబుల వర్తిల్లు
వాంఛించినప్పుడే వానగురియు।
తరువుపేళనుద్ధతిమీ ఱఫలియించు
పయిరులు దున్నక పండుచుండు
తిరిపుంపు విరసమేది క్కునొదవదు.
మొదవులు పితుకకమున్నెపితుకు।
వ్యాధులు నఘములు వరుసలైదూఱించు।
చింతించుకోర్కెలు సిద్ధినొందు।

గీ॥ రాజపరమేశ్వరుఁడుదైత్య రాజ్యహరుఁడు।
రాజసింహుండు దశరథరాజసుతుడు।
రాజసదృశకళాంగుడు రాఘవుండు।
మించిమేదిని ప్రజలపాలించుచుండె॥ 26

గీ॥ ఘట్టి ధాన్యంబపోకకుపుట్టెడేసి
యట్టి పోకకురూకలు యెనిమిదేసి।
యట్టి రూకకులు కూడకు నరువదేను।
యట్టిమాడలుయింటింటనగణితములు॥ 27

క॥ మే ఘశ్యామలదేహుఁడు।
రాఘవుడీరీతిభూసురస్ఫూటభాషా।
మోఘా శీర్వాదమహా।
శాఘామతి నేలుచుండు సమయమునందున్। 28

చ॥ శతముఖనామధేయుండొక చెడ్డనిశాచరులోకనాథుడు ।
గ్రతమున పంక్తి కంఠ ఘటకర్ణపురందర జిత్ప్రహస్తులీ ।
క్షితిబడుటంతయున్ హితులచే విని రాముని మీఁదనాదటున్ ।
ఘృతయుత పావకాకృతిని గెంటక మందుచు హుంకరించుచున్ ॥ 29

గీ॥ మెఱసి బ్రహ్మాండ మెల్లను మ్రింగునట్టు
హాసమొనరించు వక్త్రగహ్వరముదెఱచె ।
తెరవ నరుండునురువడి తెరవుఁదప్పి ।
నురువుగాదని మేఘుని మఱువుఁజొచ్చె । 30।

ఉ॥ అగ్గలమయ్యెగ్రమోఁతజగ దంతర మందునఁదద్భయంబుచే ।
దిగ్గజ పంక్తిద్రెళ్లె మఱి తెప్పిరి లేకసమస్త జీవముల్
మ్రొగ్గె వయోధులుంగ లఁగెమ్రాన్పడెనబ్జభవుండు నాసుధా ।
ఛుగ్గణమెల్ల భీతివిరిభోరున రాముజయంబు గోరుచున్ ॥ 31

వ॥ మఱియునయోధ్యా దిపట్టణంబుల మహోత్పాతంబుద్భవించె । శతముఖుండును డెందంబున నందంద విచారించి రాముండన నొక్కనరుని మాత్రంబునకు సకలోకంబులుంబరి మార్చనేల వాని కింప్రియంబులగు నొక్క మౌనిపై జల్లునుర్వీపరాగంబు బ్రాహ్మణదేవతాదులని విందుముగాన తత్ప్రహరణంబులుగా వించెద । రాముండను వాడందులకునడ్డఁబడఁదాన గపడేనేని పగదీర్చెకొనెదనని ॥ 32

గీ॥ మదినిబొదలుచు ఋష్యాశ్రమముజొచ్చి ।
దాడి మఱియును హోమకుండములు బూడ్చి ।
యాగధేనువులను గూర్చి పూగముఖ్య
భూజముల ద్రోసి కాసారములుగ లంచి ॥ 33

కా॥ మునిసుతులఁ జెఱలుగొనియా
మునివరులను దునుమ చిత్తమున రోసి తుదిన్ ।
వనల తలమును లకరములు
ఘనముగ బంధించు వికృత కఠినముఖుండై ॥ 34

క॥ నెపమే మియులేకయెదన
రపమై తము బాధ పరప రాక్షసుమీఁదన్।
కుపితాత్మకులై తపసులు
శపియింపఁగఁజాలరైరి జలజు మహిమన్॥

సీ॥ ఒక మునివరుబట్టి యూర్ధ్వపుండ్రము నాకు।
నొకవి ప్రుజందెము లొడసితెంచు
నొక్క తాపసుబట్టి నోరుమూయు
నొక్కయోగీంద్రుని ముక్కుఁజిదుము
నొక్క భూసురునిపై నుమియు మత్తులు గొని
నొక్క దిగంబరు మెలయఁదన్ను॥

గీ॥ నొకత పోధనుఁడేతెంచి వికలమతిని
పెక్కు మాఱులు శతముఖు పేరునుడివి
పాహిపాహియని చాగిలఁబడిన యతని।
కాలు బట్టీ డ్చున తనిని గాలుపగిది।

సీ॥ దిక్కుంభికుంభముల్ వ్రక్కలుగావించు
నుక్కునఁజెలరేఁగి యొక్కనాఁడు।
తన బాహుకండూతిదప్పఁగులాద్రులు
నుంకించి పెకలించు నొక్కనాఁడు।
తపియింప జేసెనా తపమునని భాను
నొడయంగనూహించు యొక్కనాఁడు
పొలయరావణుబూని మలయమారు తముల।
నుప్పున నెగయించు నొక్కనాఁడు।

గీ॥ ఉరగులను బట్టి దండించు నొక్కనాఁడు।
ఉగ్రుఁడై నిర్జరులద్రోలు నొక్కనాఁడు
ఉదరి మానవులను మ్రింగు నొక్కనాఁడు
యుబ్బి లోకంబుగాలించు నొక్కనాఁడు॥

క॥ ఈ విధిని లోకభయదము
గావించిన చిత్తములను కళవళపడియా
దేవతలు మునులు ధరణీ
దేవతలను గూడి జావి దేలుచు నొకచోటన్॥ **38**

క॥ ఎవ్వాఁడు మనలకుఁదిక్కిఁక
యెవ్వాఁడు యీభాధమాన్పునిల నెవ్వనిచే।
ని వ్వికృతుఁడీల్గు నెవ్వని
మవ్వపుఁగరుణారసమున మనులోకంబుల్॥ **39**

వ॥ అనిదుశ్చింతా సముద్రంబున మునింగి యపరిమిత డోలాయమానమానసులై క్రమ్మర ధైర్యంబులు బురిగొల్పుకొని సురలు మునివరులకిట్లనిరి.

క॥ మును మాకొఱకును దానవ।
హనన మునకు విష్ణుఁడవని నల రి దశాస్యం।
దనున కుంఁబుట్టి రఘూద్వహు
డన నిప్పుడు నున్నవాఁడు యధికులెఱుంగన్॥ **41**

గీ॥ అట్టి రాఘవుఁడఖిలరాజ్యాధిరాజు
చారు కోటీరమాణిక్య చాకచక్య
హారమండిత సత్పదాంభోరుహద్వ
యుండు మనకింక దిక్కుఁగా కొండు గలడె ॥ **42**

మ॥ దశదిగ్భాగములన్ ప్రతాపమహిమన్ దట్టుంబుగోనిండనా
దశ కంఠస్తుతకంఠ పక్తి సమరోద్దండ గ్రహాఖీలక
ర్కశభల్లంబుల సంహరించి మనలంగా పాడడేయట్టిస।
ద్రసి కోత్తంసమ దిక్కుదీనికి విచారంబేల నూహించఁగన్॥ **43**

సీ॥ తనభక్తు నొంటిపోc దలcప దమ్ముcడుదాసు
దోడయ్యె రామచంద్రుండు కాడె।
కులహీనుcడనక మక్కువమీఱ నొకకిరా
తునిఁబ్రోచె రామచంద్రుండె కాడె।
మర్కటుండనక నయ్యర్కజు పట్టభ।
ద్రుని జేసె రామచంద్రుండు కాడె
తనదైత్యుడనక యద్దైత్యుతమ్ముని గాచె।
రూఢిగా రామచంద్రుండెకాడె 44

గీ॥ యట్టి కరుణాపయోనిధి కట్టి సుకృతి
కెల మిమీఱంగమనలనుసేలు టెంతc
తడయకచ్చోటికేc గుడీ తపసులార
జాగు సేయంగసేటికి సభ్యులార॥ 45

వ॥ ఏమును దివినుండి పొడచూపెదమని చెప్పి సురలు నాకంబునకుంజనిరంత॥

శా॥ శాండిల్యుండును జహ్నుమౌని వరుcడున్ జాబాలియుంగౌత్సుడుc।
కౌండిల్యుండును గాలవుండును మహాకర్ణుండు మైత్రేయుcడున్।
మాండవ్యుండును మందపాలుcడును సన్మార్గప్రభావుండు మా।
ర్కండేయుండును గూడివచ్చి రతిశీఘ్రుంబొప్పరాముంగనన్॥ 46

క॥ ఆతతము గcగాంచిరిసా
కేతమువరన్నృ పతిజనని కేతమునతి ఏ
ఖ్యాతమునీప్సితవస్తు।
వ్రాతమున సమానవైభవాంచితముదగన్। 47

ఉ॥ కాంచితదీయ దివ్యపరిఘావి శదంబును గోటవాటమున్।
కాంచన గేహపంక్తియును గంధగ జాశ్వరథోష్ట్రవారమున్।
మించిన వేcడ్కజూచుచును మెల్లనెవీడ్కొని తత్పురీంద్రమ।
ధ్యాంచి తసీమనొక్కకనకాయ తసౌధముగాంచి మెచ్చుచున్॥ 48

క॥ ఆమందిరమధ్యంబున
కోమల చకచకలఁదనరు గురు మణిశో ।
భాయమయమగు సింహాసన
మా ముని పుంగవులు గనిరియతి హర్షమునన్॥ 49

సీ॥ కడుపుణ్యచారిత్రు కంజాతనిభనేత్రు
జలధర దేహునాజానుబాహు ।
కరుణా కటాక్షుశృంగార సుందరవక్షు ।
సత్య సంశీలువిశాలపాలు
స్మిత ముఖాం బోజునా శ్రితజనసురభూజు
హారకే యూరు వికారదూరు ।
రవికోటి సంకాశురాక్షసేంద్రవినాశు ।
భువనప్రశస్తునద్భుతగృహస్థు ।

గీ॥ సమరతల భీము బుధజనకుముదసోము
వినుతసుత్రాముత్రై లోక్యవినుతనాము ॥
జానకీరామునృపకులసార్వభౌము
గనిరి మౌనులు గన్నులఁగరువుదీర ॥ 50

సీ॥ వీఁడటేకృప మీఱ వెల్పుల కొఱకునై
మహిమీఁదఁబుట్టిన మాయలాఁడు ।
వీఁడటేదశరథోర్వీభర్త కునుతన
సుద్దులనుబ్బించుముద్దులాఁడు।
వీఁడటేపిన్న నాఁడేడాసి వెక్కసి ।
రక్కసి చెక్కిన రట్టి కాఁడు ।
వీఁడటేగాధేయువిమలత రాటోప
యజ్ఞంబు రక్షించు యజ్ఞభోక్త ।

గీ॥ వీఁడటే శౌర్యములకెల్ల వీడుపట్టు।
వీఁడటే ధర్మముల కెల్ల c దోడcబుట్టు.
వీఁడె సాక్షాత్కరించిన విష్ణుమూర్తి
వీని గనుగంటె శుభములు వేఱెఁగలవె ॥ **51**

వ॥ అని మునీంద్రులు సాంద్రకరుణారస పరిపూర్ణహృదయులై వేదోక్తమన్త్రాక్ష తవిన్యస్త ప్రశస్తంబులైన హస్తంబులెత్తి. భక్తితో ఁగదసియిట్లనిరి ॥ **52**

సీ॥ శ్రీరస్తు! ధరణిజాశ్లిష్టభుజాదండ
దండ మోత్తండ కృపా ప్రచండ
విజయోస్తు! త్రిభువన విఖ్యాత చారిత్ర
వికచాబ్జ నేత్ర పవిత్ర గాత్ర।
దీర్ఘాయురస్తు! భూదేవత మందార
కలుష సంహారభాగ్య ప్రకార
ఆరోగ్యమస్తు! శతార్క తేజోరూప
గురు జయాభ్యుదయ సద్గుణకలాప।

గీ॥ అనుచు నాశీర్వాదించి మన్త్రాక్షతప్ర।
సూనచయలాజములు ముఖ్య శుభములొసఁగి
భయము ప్రియమును జయమును రయమునయము।
పెనఁగొనఁగ నిల్చిరారాముకను గొనుచును ॥ **53**

వ॥ రాఘవేంద్రుండు ప్రత్యుత్థానాభివందనంబు లందఱికివే ఱువే ఱనాచరింయర్ఘ్య పాద్యాది విధులంబూజించి యుచితపీఠంబులనుండ నియోగించి రఘువరుండు మందస్మితముఖా రవిందుండై యానంద మందంద సందండింప నందంబుగ మెల్లన మునివరులకిట్లనియె ॥ **54**

శా॥ అయ్యా మా విషయంబు లెల్లభవదుద్యత్పూతపాదాంబుజో
ఱయ్యాలోకనచింతనంబున గదాజ్యానొప్పనీడే రుమీ।
రెయ్యేతావుల కేగుదేంతురలు మీరక్షింతురిం పొందగా
రయ్యా తావులు వృద్ధిబొందుమను టెయాశ్చర్య మూహింపగన్॥ **55**

శా॥. క్షేమం బేగదమీకు మీపరిజనుల్ శిష్యుల్ విడంబింతురె।
సేమంబొప్పంగధే నువుల్ బిదుకునే నిత్యోత్సవక్రీడలన్।
వేమారుంఫలియించునే తరువులుర్భీసత్తపో భూములన్।
ప్రేమన్ వర్ధిలునే నిరంతరమ ఖాభీష్టంబు వీడేరునే॥ 56

శా॥ దైన్యంబేమి యులేక మీ కరుణ నిద్ధాత్రీతలంబెల్లహ్రా
ద్వ్యన్యాసంబుగలనే లంగంటి మఱి కాదేయింవుమ్మై కావునం।
సన్న్యాసత్వముఖాని నన్‌మదికినిచ్చుల్ మీఱచ్చుందాముస్న్చో।
నన్న్యాయంబెటునుద్భవించుదుగదా యాఖీలవైరంబులన్॥ 57

క॥ ఏ పని పనిచిన జేయుదు
మీ పాదములాన తెలియమెల్లన చెప్పుడా।
దాపరము సేయనే టికి
తాపస వరులారమీకు దాసులయెడలన్॥ 58

క॥ నావిని మునివరువెల్లం
భావంబున సంతసిల్లి బహువైఖరులం।
దీవించి రాఘవేంద్రుని
తో వినుముని యిట్టులనిరి తొడిబడకరుణన్॥

ఉ॥ శ్రీ రాఘురామ శత్రుముఖజీవన జస్ఫుట సోమభూరిర।
ఘోరణభీమ చారుతరసుందరనిర్జిత కామ విస్ఫుర
సహస్ర ధామ భవదుఃఖవి రామ పవిత్రనామవి।
స్తారయ శోభి రామ శుభధామ రఘూద్వహహృద్వహోద్వక॥ 60

గీ॥ అలగి రావణ కుంభకర్ణాదిఘోర
రాక్షసావవి నెల్లను రణములోన
బాణముల పాలు జేసి మా భాధమాన్పి।
తింతకంటెను సుఖము మాకేదిచె పుమా॥ 61

చ॥ ధృతభుజదండ నిర్జిత వరేణ్యుప రాక్రమ ఇంద్రయక్షరా।
డతులి తసిద్ధసాధ్యగరుడా హిసమస్త చరాచరుల్ మహో
ద్ధతుభు వనై కకంటుకుని దానవనాయకు పంక్తికుంతు నిం॥
క్షితిబడనే యనెవ్వనికిజెల్లునే తల్పంగ రాఘవేశ్వరా ॥

శా॥ నిద్రాసక్తియొ కింతమానిన బొమల్ నిక్కించి చే చాచియ।
క్షుద్రాకారుధరా పరిత్వములు కల్శోధించియే మబ్బినం।
రౌద్రాకారతవక్త్రగహ్వరము చేరందెచ్చిబక్షించుకో
పోద్రేకుండగు కుంభకర్ణునురుదే హుంగూల్పంగా శక్యమే ॥

శా॥ జంభారాతిని మాఱు మాఱులనిలో సాధించి లంకాపురిం।
శుంభద్విక్రముండై తదీయ సతులన్ సృక్కంచరల్ బట్టిదో।
స్తంభానర్గుణుండై మహోగ్రరణ కాంక్షం సంచరించెన్మహా।
దంచభ ప్రోద్ధతు నింద్రజిత్తుగని యుద్ధక్రీడలో సాధ్యమే ॥

ఉ॥ దోయిటు బట్టనేర్చు నలతో యధులన్నియు నొక్కపెట్టునం।
వాయువునిల్పనేర్చు శిఖివాతంబడైన నువెల్లనేర్చుమా।
యాయుత విక్రముండ తనినన్యనృపాళికి శక్యమే మృతుం।
జేయంగమేటి రక్కసి వజీరుని నాయతికాయు నాజిలోన్॥

గీ॥ పిన్నయప్పుడె యము బట్టి పీఛమడంచి
యెడయె ఱింగివేల్పు లరినెల్లయే పుమాపె
త్రిభువనాజేయుండై చాలా ధిక్కరించె।
నమ్మ హాకాయునెదిరింప నల వియగునె ॥

గీ॥ వినకయుందు రుముందు మీరును వెసమహేంద్రు।
నొక్కప్రేల్మిడి నెగదోవిరుక్కు మిగిలి
యప్రతిద్వంద్వు సాహసులైన యట్టి।
కంపనా కంపనులతోడం గడగందరమె ॥

ఉ॥ అంతమొనర్ప నేర్తురు కృతాంతునినై నకరణంగిరేనిమ .
ప్పింతురు రావణాసురుని భీమగదా రణకౌశలంబునన్.
వింతగ వారి గన్ననల విశ్వప తైనభయ ప్రశస్తుదే .
వాంతకు నన్నరాంతకుని యాహవమందె దిరింప వచ్చునే ॥ 68

॥ మఱియు నదియు నుంగా క దేవ దానవసంగ్రామరంగనిరో దయుండగు మహోదరుండును సకలది
ంతదంతావళదంతాగ్రసంఘాతక్షతనిమ్నోన్నత వక్షస్థల ప్రశస్తుండగు ప్రహస్తుండును క్రోధాధనమా
లచలాయమానవిశ్వుండగు మహాపార్శ్వుండును నిఖిల శత్రుభీముండగు ఖడ్గరోముండును ప్రళయసమ
యక నదనలసదృశరోముండగు సర్పరోముండును హాలాహల ప్రతిమాన విషరోమష్ఠావరుండగు వృశ్చిక
రోముండును । శమన సమక్ర విక్రమవిక్రమ తోదగ్రమహో గ్రాహిత్యు వర్ణుండగు నగ్నివర్ణుండును ।
మొదలుగాఁగల దానవుల పారబలపరా క్రమవంతులు గారె. వారి నల్లనల్లన సంహరింపవె అదియును గాక
దుష్టనిగ్రహ శిష్టపరిపాలకుండవు । ధనురురుండవు జగదే కవిక్రముండవగునని బిరుదులు నీకెచెల్లునని
పండియున మ్మునీంద్రులు రామచంద్రునకిట్లనిరి ॥ 69

సీ॥ అనఘ నీశౌర్యమునఁజేసి యఖిలజనులు
పరిణమించియు నిప్పటి బాధవలన ।
పరిణమించక యున్నారు పార్థివేంద్ర ।
ఎట్లు జెప్పుదు మవ్వార్త వేము నుడివి ॥ 70

సీ॥ శతముఖుండను ఘోరరాక్ష సవరేణ్యు
డప్రతిద్వంద్వ దోర్భలుఁడై సరోజ
గర్భువరమునఁజేసి లోకములు గలఁచె ।
కావరుండు బ్రతాపలం కావరుండు ॥ 71

క॥ ముసు దశకంధుని బాధకె
మనజాలకయొక్క భంగిమంటిమి యిపుడో ।
జనవల్లభ శతకంఠుం
డొనరించెటి ఘోరబాధకోర్వంగలమే ॥ 72

గీ॥ వారెదివిజులు దేవతావర్గమెల్ల।
నద్దురా త్ముండు గావించునాపదలకు।
వెరచివచ్చిన వారు నీశరణు బొందగ।
న నుడు రాముఁడు వీక్షించెనభ్రతలము ॥ **73**

వ॥ ఇట్లు వీక్షించిన దేవతలు బొడఁజూపి పారుజాత ప్రసూనంబులా నృపసూనుపైఁగురియించి యంతర్థానంబు నొందిరి। రామచంద్రుడును విష్ణుహృదయుండై చింతించి పదితలల రక్కసినుక్కణం చనోపక సీతావియోగుండనై యకారణంబవాలినిద్రుంచి కోతుల వుఱుగుజొచ్చియనేక ప్రయాసంబుల వైరంబుజక్కంబెట్టి లోకంబు లుద్ధరించితి న దియట్లుండె నూఱు తలలును కరశతద్వయంబునుంగల శత కంఠునెట్లు సంహరింప నేర్తునని యుల్లంబున మెల్లన వగచి వెండియు నమ్మ నీంద్రులతో నిట్లనియె॥ **74**

క॥ ఎవ్వనికింబుట్టెనా తండు।
ఎవ్విరి కొఱకింతఁజేసె నిట్టిదురాత్ముం
డెవ్వధిగోరె వరంబులు
మవ్వంబున పద్మభవుఁడు మఱియెట్లొ సఁగెన్॥ **75**

క॥ ఎఱిగింపుఁడి పుడసన్మని
వరులార భయంబు నొంది యొన రఁగనేలా।
దురితాత్ముని మీపంపున
తెరువొప్పఁగ సంహరింతు ది విజులు బొగడన్॥ **76**

క॥ అన విని మునివరులెల్లం
మనమున హర్షించి మృదు మధురతరోక్తుల్।
పెనఁగొనగ రామచంద్రని।
గను గొనియిట్లనిరి భయ వికారము దోఁచన్॥ **77**

క॥ విశ్రాంతి దనరునుసు గృహ।
స్తాత్రశ మఖనియగుపులస్త్యుఁడను సుకృతునకున్।
విశ్వావసుఁడను వాఁడును।

నా|శముండను వాఁడు నుద్దయమైన రిద్ధఔొగిన్ ॥ 78

వ॥ అందు విశ్వావసుండను వాఁడుకైక సియను దాని పాణిగ్రహణముగావించి దాని వలన క్రమంబున రావణకుంభకర్ణాదుల జగదేకప్రతాపులంగాంచె। నాశ్రముండును జిత్రగంధియను గంధర్వ వధూటినిందగులు కొనిసంతానంబుగాన క కతి పయదినంబులు జింతించి దశ కంధర ఘటకర్ణ విభీషణప్ర ముఖులగు విశ్వావసు ప్రముఖుల సమరప్రచండాదులగని లజ్జించి తన మనంబునయిట్లనియె। 79

శ॥ తనయులు తాని ధామమునుదైవని వాసములేని గ్రామమున్।
వినయములేని విద్యయును వివేకము మానినయట్టి వైద్యమున్।
జనపతి లేని రాజ్యమును సౌఖ్య విరోధమునైన భోజ్యమున్।
కనకములేని భాగ్యమును కన్గొనన్నియు వ్యర్థ కార్యముల్ ॥ 80

ఉ॥ కావున పూనియేను దశకంఠుని కంటి ప్రతాపశాలిగా
వావిరి నాత్మగో రియొకవంకతపంబొనరించి యందుచే
నావల నూఱు మోములును హస్తశతద్వయుముంగ లట్టిస।
ద్భావుని ఘోరశాత్రవని పాటుని బుత్రుని గందు వేఁడుకన్ ॥ 81

చ॥ అనిచని యాశ్రముండొకవనాం తరమందున మూడు మూర్తులన్
మనమున నిల్పి చండ రవి మధ్యమునం దన చూడ్కి నిల్పియి
మ్మనఁదపమాచరింపఁగ త్రిమూర్తులు దానగుటం జెలంగియా
యినుడు ప్రసన్నుఁడై తపయు నిచ్చె జగద్భయు ప్రతాపునిన్ 82

వ॥ ఇట్లు భండనోద్దండ శతద్వయ భుజాదండుండగు పుత్రుని బడసి మఱియు లంక కంటెను సహస్రగుణాతియంబుగు ప్రతా పలంకయను నొక్క పట్టణంబు ఘృత సముద్ర మధ్యంబున విశ్వకర్మ చేనిర్మింపం జేసి యందు శతకంఠుని పట్టంబు గట్టించి వెండి యుదపంబున కరిగెనంత ॥ 83

క॥ మీరు నురావణ ముఖ్యు
క్రూరాసుర వరులజంపికు వల యయెల్లం।
భారంబున రక్షించితి
రారూఢిగ వేలుపులు భళాయనిబొగడన్ ॥ 84

గీ॥ శతముఖుండును రావణ క్షయము కుంభ
కర్ణమరణంబు నింద్ర జిత్కాయభగ్న
మగుటయును విని విలయకాలాగ్ని పగిది।
మండి దండారియూహించె మనము లోన॥ 85

గీ॥ నరులు వానరుల ననెంత నాకుఁదృణము।
జగతిఁదక్కిన వారిచేఁ జావకుండ
నిమ్ము వరమని యలభారతీ శుగోరె।
గా నిరావణుఁడే ష్యంబుగానఁడయ్యె॥ 86

వ॥ కావున పర పురుషులచేనెవ్వరి వలన జావులేకుండ విరించి గోరెదనట మీఁదను రాముని సంహరించి తన యగ్రజులపగ నీగె దనని తనప్రతాపలంకా పరిపాలనంబునకు నాప్తులగు మంత్రుల బ్రతిష్టించి మాణిక్య కనకతామ్ర లోహాదినవ ప్రాకారరక్షకులగు రాక్షుల నాదరించి యొక మహారణ్యంబున కుంజని యందు దుఁగ్రుత స్నానుండై భారతీరమణును దేశించిజగదద్భుతంబుగాఁ బంచాగ్ని మధ్యంబునంబొట మనప్రేలూఁతఁ గొనినిక్కి హస్తంబులెత్తి మహోష్ణ ప్రచండ మధ్యాహ్న మార్తాండ మండలంబు జూచుచుఁదపంబు నిరాహారుండై వెయ్యేండ్లు గావించెనంత॥ 87

చ॥ జగములు తల్లడించెర విచంద్రులు గన్పడరైరి పెల్లుగా
దిగిభములెల్లమ్రొగ్గె జలధివ్రజమింకెను సప్తజింహుఁడున్।
వగచె సురేంద్రుఁడుంజె దరెవాయువణంగె హిరణ్య గర్భుఁడున్।
మొగినరుదెంచినిల్చెనతి మొహముమైశతకంఠముందుటన్॥ 88

వ॥ ఇవ్విధంబున నవ్విరించి సుప్రసన్నుఁడై కరుణా రసంబునుల్లంబున బల్ల వింప నిబ్బరంబుగనిట్లనియె॥

శా॥ అన్నా ఓయిశతాస్య యీశ్ర మతనూ జాయుష్మదుద్య త్తపో
త్యున్నత్వంబునకిచ్చ మెచ్చితి వరంబూహింపు మాయిచ్చెదన్।
కన్నుల్ విప్పుము నన్నుజూడు మనుచుంగారుణ్య పాదో నిధిం।
చెన్నారంగను నాదరింప పరమేష్టింజూచి హర్షాత్ముఁడై॥ 90

మ॥ కరముల్ మోడ్చి విరించికిం శ తన మస్కారంబులం దండ ।ని ।
ధ్ధరపై భక్తి నొనర్చి పేచి తన వక్త్రంబుల్వి డంబించెనో
హరి నాభీకమలోద్భవా ని గమ విఖ్యాతప్రశస్తానా
కరుణాసాగర నీకు మ్రొక్కెదను మత్కామ్యంబు లీడేర్పవే॥ 91

వ॥ అనివుఱియును బహువిధంబుల గైవారంబుజేసినవినివనజభవుండు పరవు ప్రీతుండైనె యొక్కవరంబువేడు నొసంగె దననుడు శతముఖుండును సంతసిల్లి అయ్యా నెయ్యంబున వరం బుకరంబుగా నొసంగుఁదలంపు మీకుండెనేని యక్షారాక్షససిద్ధ విధ్యాధ ర కిన్నరకింపురుషసురనరవానరాదులగు పురుషులవలనను మృగాండజభుజంగమలోకంబుల వలనను । మీనమకరకచ్ఛపాదిజలచరసము దయంబుల వలనను మరణంబులేకుండ నిమ్మెనిననప్పరమేష్టి యుఁద ప్పకదయఁచేసి। మఱియునొక్క వ రంబువేఁడు మనినదను జేంద్రుండు హర్షించిరణంబుసేయు.నెడతనశరరంబునంగల శోణిత కణంబెచటదొరం గునచటనూర్గురు శతముఖులు జనియించునట్లు గాప్రసా దింపుమనుండు జలజాస నుండునన త్తెఱంగునకు సమ్మతించి నీత పోవుహింబునకువుూడులోకముల యందు ను సరినెరుంగవు। గావున నింక నొక్కవరంబడుగుమనినసు ప్రసన్నుండైన గని । జరయును శ్రమంబును బరితాపంబును భయంబును ధైర్యంబును నెన్నండునుదన్నుం బొరయకుండ నొసంగుమనుండువిరించియట్లుగావించి యంత ర్థానంబునందె శతముఖుండును దనపురంబగు ప్రతాపలంకాపురంబునకు వచ్చునెడ ॥ 92

క॥ మెండు కొనిభయముధరణీ
మండలమదల్లడిల్లెమాగురుదిశలన్।
నిండుకొనెనిర్జరేంద్రుండు
గుండియఝల్లనుచు చేతికులిశమువైచెన్ ॥ 93

వ॥ శతముఖుండును తన పురంబు ప్రవేశించి తన జ్ఞానతులగు రావణకుంభకర్ణుల పగ యాగ రామునిందుని మెదనతండగుపడదనుకను దత్ప్రియంబులగు బ్రాహ్మణదేవతాహననంబు గావించెదనని ప్రధానులు దండనాయకులు దన్నుగొలువ సకల దిక్కులును వక్కలుగావించి దేవతుల పురంబునకు దాడి పెట్టి దివిరాజులంబారదో లిమర లిమాయాశ్రమంబులు దూఱి కొంత ఱమును లంజంపి పతివ్రతలగు తరుణుల చెరగొని హోవుధేనువులందునిమి యువిమొదలు గాననేకంబులగు బాధలుగావింపఁదొడ ంగెనని వెండియునిట్లనిరి. 94

గీ॥ నీవు దప్పమా కునెవ్వరుదిక్కువే
రట్లుగాన భీతినమరవరులు
వేలయమిమ్ము శరణు వేఁడుకొమ్మని పంప
వచ్చినా రమభయమిచ్చిబ్రోవు ॥

గీ॥ అనుచు బాష్పధార లఖులఁదొరుగఁగా
నతి భయయాత్ములగుచు నమ్ము నీంద్రు ।
లున్న వారి నుడువ నూహించి రామభూ ।
వరుఁడు బలికె మధుర వాక్యములను ॥

గీ॥ తెగువ నింత సేయు దేవతాద్రోహిని
సంహరించి మిమ్ము సకల సుకల
గాతు కరుణ మీ ఋ గావగా లేకున్న
బ్రాణ మేల యూ కృ పాణమేల

గీ॥ అనుచువారి కప్పు డభయ హస్తమును యిచ్చె
నఘ విదూరుడెన రఘు వరుండు
చనిరి ముని వరులును సంతోషభరితులై
మగిడి తత్త నాశ్రమంబులకును

గీ॥ చనిన పిమ్మట నేకాంత సౌధమందు
రాఘవుడు భూరి తరశరలాఘవుండు
మహిమతోడుత సౌమిత్రి మెఱయఁ
జేరి కొలువంగఁ గూర్చుండి చిత్తముననను

క॥ శతముఖుని జన్మమహిమయు
జతనంబు గనతఁడు దపము సల్పినధైర్య
స్థితియును వరము లుగొనుటయు
మదిలోఁద లఁపోసి దీన మానసుఁడయ్యెన్ ॥

కII తానసురాంతకుండయ్యును
మానవుఁడై యుంటఁజేసి మహిమలు దెలియన్।
గానోపక పలుమాఱును
వాని పరాక్రమము దలఁచి యొనరఁగఁదొడఁగెన్॥ 101

వII ఇట్లు దలంచుచుఁ దదనంతరంబాసుమంతాది మంత్రులనటు కురావించె వారును వినంగ లక్ష్మణుదిక్కు మొగంబైయిట్లనియె॥ 102

సీII పొలవక లవణ యిక్షుసురామృతసము
ద్రంబు లేవిధమున దాఁటవచ్చు
దాటెపోఁబూని విధాత్రుఁడిచ్చిన వర
గర్వమే తెఱఁగునఁగ డవవచ్చు।
గడచెబోనవ పరిఘాయిత ప్రాకార
పట్టణం బటులుగ్గఁబట్టు టెట్లు।
పట్టెబో కలనిలో పర పురుషా భేద్య
దనుజవల్ల భనెట్లు దనుమవచ్చు।

గీII ఏలవచ్చిరి సకలము నీంద్రు లిటకు।
ఏల ప్రతినలు గావించి తేనుదనుజ।
వంశవిభుఁడెట్టికై వడి వసుధఁగూలు।
నకట తమకించి పలుకుట హానికాదె॥ 103

వII అని తానును లక్ష్మణుండు దక్క తక్కిన సామగ్రి చాలకుండటకుఁజతుగ్సముద్రలంఘనంబు గావించుటకు జాలకనిర్విణ్ణ హృదయుండయ్యె మంత్రులు నిట్టిట్టని యూహింపరైరి తత్ప్రకారంబు వీక్షించి కోపారుణితలో చనుండై సౌమిత్రిరామ చంద్రునకిట్లనియె॥ 104

గీII శతముఖునియంత రాక్షసచక్రవర్తి
నెట్లు సాధింతునని విచారింపనేల
తూలికాపర్వతంబును ధూళిసేయ।
మిణుఁగురెంతై నఁజాలదేమేదినీశ॥ 105

వ॥ ఇట్లుగా విచారింపు మదియునుంగాక। 106

చ॥ వడిగబళింతుసే శశిదివాకరుబింబము లంకలంగమై।
పుడి సిటిలోన నిల్పుదునె భూరిపయోనిధులెల్లఁ బెల్లుగా।
పిడుగును బోలు ముష్టిహతి పృథ్వియునింగియు ధూళిసేతునే।
యడపక నాదుముందట సహించిశతాస్యుని జెప్పనేటికిన్॥ 107

శా॥ చిత్తంబొప్పఁదపంబు జేసిహరుమెప్పించి త్రిశూలంబొగిన్।
సత్రామాదులు మెచ్చఁగై కొనినృపక్షోభుం బ్రళస్తుంబుధా
మిత్రాత్ముల్ లవణా సురుందునుమదె మీరెల్ల హర్షింపనా।
శత్రుఘ్నుండ సమానుఁడే తలఁపఁగా సంగ్రామ రంగంబులన్॥ 108

చ॥ నిరుపమ విక్రమస్థితికి నీ సరివచ్చు నపారఘోరసం
గరమగు వేళదుర్విమత ఖండన మంత్ర మెఱుంగుఁక్ర మ్మరన్।
పరబల మిచ్చి వచ్చిన శుభంబొనఁగూర్ప కొసం గనేర్చునే।
భరతుఁడుకేవలుండె యురుభండన భూమిని రాఘవేశ్వరా॥ 109

శా॥ దండిన్ మున్ను మహోద్భరాశ్వమునకై దర్పించి మమ్మందఱి।
గుండె లేవింపఁగఁజే యరే దివిజులా ఘోషింప యుద్ధంబునన్
వెండింమిమ్ములనుంజనంకి మన రే వేగంబునం భండమో।
ద్దండుండో కుశుఁడున్ల వుండుధరనే తన్మాతృవే భూవరా॥ 110

చ॥ రసికుఁడు విద్యలందుఁబ రరాజ్యభయంకరుఁడెంచి చూడఁగా।
నసిము ఖతీక్షణాస్త్ర వివిధాశు గసంచిత శౌర్య శాలిధై।
ర్య శమనమూర్తి శుంభదభివారణ గోత్రపవిత్రధారమీ।
కుశుని కుమారుఁడుగ్రరణకోవిదుఁడా విజయుండు బేలయే॥ 111

మ॥ అదియట్లుండఁగ నిమ్ము పేల్పులు రణోద్య త్ప్రాభవుల్ దన్నుడె।
బ్బదిరెండెల్వలు గొల్వరౌద్రముఖుడై భానుప్రభన్ మీఱఁగా।
కదనందమ్మునెదిర్చినంభయ దవాలాభీలుఁడై మృత్యువుం।
గెదమంగాఁ గల బాహువిక్రముఁడు సుగ్రీవుండు సామాన్యుఁడే॥ 112

శా॥ ఓష్ఠద్వంద్వము పెల్లుఁగా నదర రాఁహుంబోలిమందోదరిం।
నిష్ఠూరంబున బట్టి దెచ్చుచుఁగపుల్ నిక్కందశాసాగ్రహుం।
నిష్ఠోభంగము జేసి పెంపుగనఁడే నీముందటన్ వానర।
శ్రేష్ఠుండంగ దుఁడంతవాఁడు గలుగంజింతింపఁగా నేటికిన్॥ 113

శా॥ తల్లిందండ్రి వినీవెయించునుమందిందాత్పర్య ముప్పొంగమీ।
తెల్లందానవమర్మముల్ దెల్పుచుంయద్దాన వాధీశుహ్రా
త్పల్లంబై చరియించు ఖండనమునంబ్రత్యర్థి సంహారుఁడా।
భూల్లోకేంద్రుఁడు జాంబవంతుఁడు దలంపంగాంచుఁడే తెలియగన్॥ 114

శా॥ కేలన్ సాలమహిజయుగ్మము రణాంగీకారమొప్పన్ మహా
ఖీలుండై ధరియించియు ల్లదిశలం భే దిల్లఁగా నార్చుచుం।
వాలంబభ్రముదాఁకఁబెంచిరి పులన్ వారించుధీరాత్ముఁడా।
నీలుంశౌర్యగుణాలవాలు నెదురన్ నెదిరింపఁగా వచ్చునే॥ 115

ఉ॥ కార్ముకమందెనేని పటుకాండపరంపరచే నరాతులన్।
మర్మముబుచ్చిపోవ న సమాన చమత్కృతి సేయనేర్చుదు।
ష్కర్ములఁగూడఁడెన్నఁడు రుశౌర్యుఁడు కార్యవేదిజ్యో
తిర్ముఖుఁడంత వాఁడు మనదిక్కునఁగ లఁగఁజింతయేటికిన్॥ 116

చ॥ క్షితి ధరవృక్ష వర్గమఱచేతుల నిల్వఁగ ణంగెరేనియా।
శితిగళుఁడైన భీతిలునశేషపరాక్రమ లాహవంబునం।
దితిసుత లోకశుష్కవన తీవ్రదవానల కీలలుగ్రులా।
శతబలియుం గవాక్షుఁడును జాలరె దైత్యుని సంహరింపగన్॥ 117

వ॥ మఱియు నదియునుంగాక వానరకులోద్ధారకుండగు తారుండును మహాభుజుండగు గజుండును. వజ్రధారా ప్రతిమానకరభుండగు శరభుండును। సమర విజయావమానస్తోముండగు గోముఖుండును గంధమాదన ఋషభమైందద్వివి ద వేగదర్శిగవయ ప్రముఖ నిఖిల మహావనచర సముదయంబు గ ణంగిరేని చతుర్దశభువ నంబులుబరిమార్పయ దియునుంగాక మీరు పెట్టినచెట్టు విభీషణుండు యిట్టిసమయంబునన్

దోడుగాకుండ నే యంతండలిగిన సకల బ్రహ్మాండ భాండబులు చూరలాడఁడేయింతలల సామగ్రిలుగనసురవరుని కొఱకునింతచింతనొందఁదగు నేయని మహాబలవంతుడగు హనుమంతునుతలచి చిరునవ్వునవ్వి లక్ష్మణుండు వెండియు రామచంద్రున కిట్లనియె॥ **118**

సీ॥ పుట్టినప్పుడె పట్టి బెట్టిదంబుగనెట్టి
ద్రింగఁడె భానునినింగికెగసిఁ
అసమానజవము చేనలరి కాల్వయుఁబోలె।
దాఁటుఁడే యల సముద్రంబుగడసి
లంకాపురముజొచ్చి శంకయించుకలేక
హతుని గావింపఁడే యక్షుగణంగి ।
దీపి తాటోప కోపాపరాశిఖిశిఖా ।
తతుల చేఁగాల్పఁడె తత్పురంబు ।

గీ॥ అట్టి జగజట్టి యగ్గాడ్పుపట్టి మనకు।
నిట్టి వేళలఁగలుగంగనేలవగువ
నతఁడు గణఁగినశతకంఠుఁడనఁగనేల।
నొలక్క వ్రేల్మిడినినెగయగమీటును నుర్వినెల్ల ॥ **119**

వ॥ మరచితిరే నాఁడు మనలనిరువురంగొని పోయిమైరావణుండు పాతాళంబున భద్రకాళికి బ్రియంబుగా భేదింపంబూను సమయంబున నొక్క శతపత్ర నాళంబున సూక్ష్మరూపంబున వచ్చి యచ్చటఁగా వున్నవచ్చువల్లభుతో బెనఁగి యతిరయంబున నిశిసమయంబున నప్పాతాళలంకానివాసులగు రాక్షసులనందఱిని. నిర్మూలంబుంగావించి పిదప మైకావణుతోఁబోరాడి సప్తభ్రమరంబులతోడ వాని ప్రాణంబులు గొని మనలంబ్రతికించెఁగాదే అట్టి ప్రాణబంధుండును శౌర్యధురంధరుడునునగు మరున్నందనుండు మన కవశ్యుడై యున్న వాఁడదియునుంగాక సకలదేశంబుల వారును సుఖదుఃఖబులకు మనలో వారుగాని వెలియై ప్రవర్తింప నేరరింతయు విచారించి సంగరంబున కరిగి శతముఖుని సంహరించి లోకంబు మను పుమని వెండి యునిట్లనియె॥ **120**

గీ॥ డంబు గలభద్ర దంతావళంబు బోలెఁ
నిన్నునీవె ఋంగవుగాక నీవురణము
నందునలిగి తివేని బ్రహ్మాండ మెల్ల
నిలచి భస్మీకరించవే నిమిషమునను ॥ 121

గీ॥ అనుచుఁదమ్ముఁడు బోధించనలరిరామ।
భద్రుఁడంతయు సత్యంబుబరులఁగెలువఁ
వచ్చు నీచెప్పినట్టి భావమున ననుచు
జనవరేణ్యుండు పిదపలక్ష్మణుని గనియె॥ 122

గీ॥ కార్యఖడ్గములన రెండు గలవు యందు।
కార్యముత్తమమదిచక్కఁగాకయున్న
పలువిధంబులనవ్వలిబలిమి యెఱిఁగి।
ఖడ్గమునరింపనటమీఁద కర్జమంద్రు॥ 123

వ॥ అది గావున సామభేదదానంబులదెగటార్చెద నందున నొనగూ కున్న దండధరుని లోకంబునకనుచువాఁడనినంత యింతలో విభీషణురావించి యత నివలనశతాస్యుని వర్తనంబుదెలసి యటమీఁద నమ్మహాత్ముండు జెప్పిన ద్రోవంజనుదమని విభీషణుందలచె నతండును దనమనంబున హర్షించె నెవ్వనికి నెఱింగింపకశీఘ్రగమనంబున॥

చ॥ అనిలుఁడు నన్నలుఁడు హరుఁడోదిగఁగల్గిన మంత్రులందరున్।
దనుగొలువంగ శీఘ్రసముదగ్రసముద్రము దాటే దుర్గ్యానం।
వెను కొని యభ్రవీధినినవనీరయంబున వచ్చి వచ్చి సఁ
జ్జనమణియైన రాఘవుని సన్ను తిసేయుచు తత్పురంబునన్॥ 125

క॥ రాముని కోమలమేఘ
శ్యాముని ముని లోకపతితసంతతనిలస
న్నాముని శాత్రవ భీముని
ప్రేమతొ వీక్షించెనవ్విభీషణుఁడెలమిన్॥ 126

క॥ వీక్షించియతనిచరణము
లక్షీణముదవహామనస్కుఁడై తననిటులం।
బాక్షణము సోకమ్రొక్కుచు
రాక్షసనాయకుండ లేచి రసి కోత్తముఁడై॥ **127**

చ॥ జయజయమౌని హృజ్జలజచారణ పాపవినాశకారణా
జయజయ దైత్య సంహరణసాయక కామ్యఫలప్రదాయకా।
జయజయ పుణ్యగాత్రయతిసత్యపవిత్రపవిత్ర విక్రమా।
జయజయ రామచంద్ర గుణసాంద్ర సురేంద్ర మహేంద్రసన్నుతా॥ **128**

వ॥ అని యిట్లు పలుదెరంగుల వినుతింప నమ్మధు రమృదుభాషణుండగు విభీషణుంగా ఢాలింగనంబుగావించి యానంద బాష్పజలపరంపరలు దొరుగ సరగుననతండు నొక్కయుచిత పీఠంబునం గూర్చుండ వెట్టి భక్త పారాయణుండగు రామచంద్రుండతని సేమంబుదెలసిమన్నించి మెల్లన యిట్లనియె॥ **129**

శా॥ ఆవేళంబవరంబునందల దశాస్యా ఖీలదావాగ్నిగ।
న్నావిర్భూతము నొందస్రుక్కి మఱిచెయ్యా డింపఁగాలేనిచో
నీవా దైత్యుని మర్మకర్మ తతులన్నిం దెల్ప హింసించితిన్
నీవంటాప్తుఁడు భూమిలోనఁగలడే నిక్కంబు దైత్యోత్తమా॥ **130**

గీ॥ ఓవిభీషణనీవంటి నావఁజేసి।
సంగరాంబోధితరియింపఁజూడఁగంటి।
నట్టిదెల్లనుగడచిన దంతకంటె।
నొక్కప్రణయంబు వార్త నేఁడుద్భవించె॥ **131**

గీ॥ అట్టి వృత్తాంతమెఱిఁగింతు ననఘవినుము।
నూ ఱుదలలును యిన్నూఱఘోరబాహు।
లుండుదైత్యేంద్రుఁడొక్కడు ద్దండుఁడగుచు
తావసుల దేవతల గ్రొవ్వి యేపు మాపె॥

వ॥ మఱి యునునేక తెఱంగుల గోబ్రాహ్మణ దేవతాహననంబును సకలదేశారమణతాడనంబులును నఖిల జీవసంక్షోభంబులుగావింపనద్దురాత్ముండు సేయుబాధలకు. జాలక ముని దేవతానివహంబుల రుదెంచి

తవంబాధల తెఱంగంతయు నెఱింగించి శరణుజొచ్చి యంభయహస్తం బిచ్చి పంపించితి నటమీఁదనేదియుందెలియకే యద్దానవుని వర్తనంబులన్నియు నీచేనెఱుంగుటకని న్నురావించితినవిన విభీషణుండు జనవరేణ్యుని కరుణామహిమంబునకు నిచ్చనచ్చెరువడి మచ్చి కనిట్లనియె॥ **133**

సీ॥ జంభారి గంభీరదంభోళిధారతో

పర్వతంబొకటి దీర్పంగఁగలదె

కఠిన నఖాఖీల కంఠీరవశంబుతో

భద్రేభమొకటి దీర్పంగఁగలదె

సంవర్తి సమయప్రచండానలంబుతో

నెఱిశుష్కగహనంబునిలువఁగలదే

జంఝూ హ్వాయప్రభంజన ధాటితో

కొలఁదిగా గుంబుమార్కొనఁగఁగలదె।

గీ॥ ఎంత వాఁడైనవరములనెన్నిగొన్న।

కనలినీతోడయెది రించి మనహగలడె।

పుడమిపటుచూర్ణమైతానె పోవుగాకఁ

రామదివ్యకళాసాంద్రరామచంద్ర **134**

క॥ పగవారినిమీయదుటనుఁ

పొగడఁగ రాదైనఁగాని భూమిశ్వరన

న్నేగియడిగినయందుకుదైఁ

త్యగణోధిపుమర్మమెల్లఁదగనెఱిఁగింతున్॥ **135**

క॥ పంకజగర్భుండైనను।

శంకామదినుండు పొగడఁజాలకయేనున్।

బొంకింపఁగలనె యకటా

లంకారము తత్ప్ర తాపలంకమహీశా॥ **136**

క॥ ప్రాకారంబులు దొమ్మిది
భీకరమైయుండు జంభీభిన్ముఖ్యసురా।
నీకంబులకును దక్కి_న
లోకులకుం జెప్పనేల లోకాధీశా॥ **137**

వ॥ మఱియుఁ బరి ఘాజలప్రమాణంబున న తిక్రమించి బ్రహ్మరుద్రాదులకు నభేద్యంబై ప్రవర్తిల్లు దీర్ఘ జిహ్వాయోజనహస్తదుర్ముఖ శూర్పకర్ణరక్తాక్షసింగళాక్షగజోదర త్రిముఖులను మంత్రులునెనమండ్రు వర్తింతురు. అందునెలకొక్క_మంత్రికి నూఱేసి కోట్లు రాక్షసులు వర్తింతురందునేకైక ప్రధాని మృత్యువుంబొరి గొనఁజాలు దురంద ఉుగూడిన చతుర్దశభువనంబుల జప్పరింతురు వారికి నాధుండైన శతముఖుండు పరమేష్టివరంబుల చేసకలపరపురుషభేద్యంబును ఁమఱియునేక దుర్లంభంలగు సంగరమహిమంబులు గొని విష్ణుశంకరాదులదృణీకరించు నతండు మనంబున నేమిమ్ముసేవించి రావణాదులందు నిమించి తిననిన నన్నుజంప దలంచియుండు నాకునతనికి వైరంబెప్పుడునుంగలదు వాడు. మీచేతనే గానినుఱినెవ్వరికిన జేయుండనిన వెండియునిట్లనియె॥ **138**

గీ॥ శతముఖునికింకరులు దన్ను హతునిజేయ।
నకట యెప్పుడు వత్తురోయనుచుదిశలు।
చూచుచుండంగఁజాలవు చూపులనుచు ।
నమరభర్తసహస్రాక్షుఁడయ్యెగాదె ॥ **139**

గీ॥ ఉరుబలాధికుఁడగుశతాస్యుఁడుమదించి।
దాఁడి మన మీఁద నెప్పుడు దవిలివచ్చు ।
నొక్కొ_యనిభీతిమైనేనుక్కుఁదక్కి_
తారకాచలగహ్వరాంతముననుందు॥ **140**

వ॥ అనివిని పార్వతీదేవి మహైశ్వర్యంబునొంది చిరునవ్వునవ్విశం కరు మొగంబు పైఁదన చూడ్కి_నిలిపి మహాత్మా యిట్టి విచిత్రంబుయెన్నఁడును వినియునెఱుంగ నీదివ్య కధావిధానంచేపుణ్యాత్ముండా కర్ణింపంబూను నతని కాయురారోగ్యంబును మహాదైశ్వర్యంబును పుత్ర పౌత్ర లభ్యంబును సకల బంధుని వహానుకూలంబును నై యా చంద్రతారార్క_ంబుగావర్ధిల్లునటుగాన నేనుగృతార్థురాలనైతిన టమీఁదివృత్తాంతంబానతిమ్మనిన నమ్మహాదేవుండిట్లని యెనట్లు విభీషణుండు శతకంఠుని మహిమంబు గొంతవినుపించి రామచంద్రునకు వెండియునిట్లనియె॥ **141**

క ॥ అతులితదోర్బలమునకును
విततపరాక్రమునకును వివరింపఁగనీ
శతముఖునకు రావణునకు
మతమునదలపోయ హస్తిమశకాంతరమున్

క॥ కావున శతముఖుదునుమగ।
నీవేగాకొండుగలరెన్నృపవరవేగం
రావింపుము యుద్ధమునకు
పాపవమగు హనుమదాదిబలములనెల్లన్॥

సీ॥ నావుడువిని నరనాథుండుజింతించి
ఏవె అవున దాఁటుదేను వార్ధ
నెవ్వరి బలమునకేగుదాహమున
కేవిధమునద్రుంతునేను రిపుని
యేలాగుబోషింతు యేను యోగీంద్రుల
నెట్లు ధరింతునే నేమిసేతు
దేవతాభయము లేతెఱఁగునవారింతు
వడిసైన్యములమ రెవ్వఁడునడుపు।

గీ॥ నను చుదలఁనోసి తలఁపోసి యాత్మయందు
యంతయును జూచి యాహనుమంతునుండి
కొంతకార్యంబుమఱి సమకూరుననుచు
కోరిధైర్యంబు మఱిబురిగొల్పియపుడు॥

క॥ హనుమంతుని పటుదోర్బల
ధనవంతుని సకల ధరణి దైవతనుతస
ద్బలనశాంతుని కవిశాంతుని
చను దెమ్మనిరాఘవుండు సయ్యనఁదలచెన్॥

ఉ॥ అగ్గిరి నానృపాలమణినాత్మదలంచిన మారుతాత్మజుం।
డగ్గలమైనమోదము భయంబును బెన్గొనవేఁడ్క మీఱఁగా।
నగ్గురుగంధమాదన మహాచలశృంగము మీద నుండి తా
దిగ్గున నేఁగుదెంచెనతి తీవ్రవరయంబున దక్షిణంబునన్॥ **146**

వ॥ ఇట్లు సంభ్రమంబున మనోవేగుండై వచ్చి సాకేత పురంబుజొచ్చి యొక్క చక్కనిముహూర్తంబున॥ **147**

ఉ॥ శీలుని దివ్యనూత్నమణిచేలుని యాహవస్ఫుటానల।
జ్వాలుని ధర్మసద్గుణవిశాలుని ఖండ కలానిధిస్ఫుర
ద్భాలుని సర్వశాస్త్ర పరిపాలు కృపాలుని రామభద్రభూ
పాలుని గాంచి తచ్చరణ పద్మములంబడి వేచినిల్చుచున్ ॥ **148**

చ॥ కరములు మోడ్చి యోదనుజఖండన యోకరుణాసముద్రయో
పరమ వివేక మోకలుషభంజన యోరఘురామచంద్ర యో
చరణపయోజముల్ భజన సల్పఁగ సేర్చుటు మూఁడులోకముల్।
తరలకవేడ్కనేలుటగదా తలఁపోయంగమానవేశ్వరా॥ **149**

చ॥ ధరణి సుతాధిపాయభుజదండవినిర్జి తదానవాయభా।
స్కర కులసంభవాయ జలజాత దళాంకవిలోచనాయసం।
గర విజయాయతాపసని కాయనమోనమతేనమోనమో
పరమకృపాత్మయోవరనృపాయరఘూత్తమరాజ్యసత్తమా ॥ **150**

ఉ॥ ఏపనికైననన్ను జగదీశ్వరపంపుము సప్తవార్ధులుం।
వాపుగ బట్టి సైన్యములు దాటగఁజేతునోమృత్యు వక్త్రముల్
దాపలిచేత మూయదునొడాసి కృతాంతుని బట్టి తెత్తు నో।
భూపకులావతంసవెస బూని కులాద్రులు బెల్లంగింతునో॥ **151**

వ॥ అని పెక్కుభంగుల సన్నుతింప దశస్యందననందనుడుమరు నందనుంగరుణామృతలహరులు చెదర నవలోకించి రమ్మురమ్మురొమ్మగదియనని నాలింగనంబుగావించి కుశలంబడిగిపదశ్రమంబు దీరనొక్కరమ్యహర్మ్యంబునవిడియ నియమించి యతండు చనిన పిదప విభీషణుంగ నుంగొనియి మ్మహామహునిచే మనకార్యంబు లొడఁగూడంగలవనియిష్టాలాపంబుల నారేయిగడపిమరునాఁడు

సంధ్యాదిక్రియలు నిర్వర్తించి గురు పితృ పూజనంబులు గావించి, యగ్ని హోత్రంబులు దర్శిం
విప్రసహస్రంబునకుంగర్పూరతాంబూలపరంపరలొసంగి వారిచేతనాయురారోగ్యాశీర్వాదంబులుగైకొని భర
శత్రుఘ్న లక్ష్మణులతోఁగూడి న లంకృతుండై సుమంత్రాదిమంత్రులను రప్పించి సభామంటపంబున రత్
సింహాసనంబున గూర్చుండి యచ్చటికి హనుమంతుని రప్పించి యతండునుదానును విభీషణుండునురావణ
కుంభకర్ణ దేవాంతకాకాంపనాతికాయయింద్రజి త్రిహస్త మహాపార్శ్వమహోదరఖడ్గసర్పవృశ్చికాగ్ని వ
ప్రముఖనిఖిల దానవమహోద్దండభండన ప్రకారంబులుగ్గడింపుచు। నెడనెడ మారుతింగొని యాదుచుఁగొం
ప్రొద్దు పుచ్చి శతకంఠుని ప్రకారంబెఱింగింపుమని విభీషణుని కెగసన్నగావింప నమ్మహాత్ముండును సమ్మదంబు
నమ్మరుత్పుత్రునకుందెలివిపడశతకంఠుని జన్మంబును తపోమహిమంబును జలజజువరంబుల తెరంగును
చతుసవముద్ర లంఘన ప్రయాసంబును పరిఘావిశేషంబును ప్రాకారప్రకారంబును ద్వార
రక్షకమహాదానవనివహ విక్రమక్రమంబును మంత్రి ప్రచండ త్వంబును కరతలామకంబుగానెఱింగించిన వి
వనచరవర్యుండుగగనంబుముట్టి కుప్పిగంతు విడుచు రామభద్రునింగొని యాడుచు తనచేత నింతయు
సాధ్యంబగుటకుమనంబున నిశ్చయించి రఘువల్లభునకాంజనేయుండిట్లనియె॥ **152**

గీ॥ అన్న రాఘవనీబంటునున్నవాఁడ
యెంత వాఁడైనవాఁడన్న యెంతమనకు
మీరు పంపిన యొకఁడనేక్రూరఁడైన
శతముఖుని ద్రుంచియే తెంతు సత్యముగను॥ **153**

సీ॥ అదియెటువలె నన్న నద్రిజాధీశుని
శక్తి నా యందున సంఘటించు
నరయజగత్ప్రాణుఁడై నమాతండ్రిచే
జవసత్వములు నాకుఁజాల గలవు
యశ్రమంబునజరామరణాదిమృతిలేక।
యమరుల వలన నాయందునుండు
నదిగా కనీదివ్య హస్తంసంస్పర్శచే।
మెండు గావజ్రదేహయుండనైతిఁ

గీ॥ గానమీయాజ్ఞఁదలమోచి కదనమునను
కణగి కదసిన శతకంఠుఁడనఁగనేల।
నట్టహాసంబు జేసి కాలాగ్నినైన
బట్టి మ్రింగుదునే చలపట్టి యధిప॥ 154

గీ॥ దాటరాదని జలధులఁదడవనేల।
మేలదాఁటింతువాలంబుమీఁద సేన।
తివిలి యాత్మస్తవంబు గాఁదలఁపవలదుఁ।
తథ్యమింతయు నీదు పాదంబులాన॥ 155

వ॥ అని మరుత్సుతుండు వెండియునిట్లనియె। దేవా మీరు నమ్మించిన నమ్మక సుగ్రీవుండు మీ చే దుందుభికళేబరంబు మీటించి సప్తతాళంబులు నొక్కకోలందునియలు జేయించియట మీఁద నాశ్రయించెఁగాదె। కావున మీరు నమ్మహా రూపంబు వీక్షించినం గాని సమ్మతింప రెల్లి మీపేరచంద్ర తారాబలంబులు గలిగియున్నది నేనును నాయందుగల బలంబు గొల్వమంత్రులుచితంబునఁ జేరి భజింపనున్నచో నమ్మారుతాత్మజుండటకు నల్లన వచ్చె విశేషమే ర్పడన్॥ 156

క॥ ఈ రీతి వచ్చి రాఘవు
భూరి జనంబుల కుమొక్కిపోల్పడు మూర్తిన్।
వారకచూపననజ్ఞులు.
భోరుకొని చెలంగి వాయు పుత్రుండచటున్॥ 157

సీ। తనదువాలంబుమార్తాండ ప్రచండమై
తతరథంబునకు కేతనముగాఁగ।
తన మోముసత్యలోక నివాస జలజాత
భవచతురాస్యచుంబనము సేయ।
తనవంటి దీర్ఘ దోర్దండ ప్రభావంబు
దిగ్గజంబులనెల్ల మొగ్గఁజేయ।
తన బర్బరస్థూల తనుమహాహిమంబు।
నీరజాండంబులు నిండుకొనఁగ।

సంధ్యాదిక్రియలు నిర్వర్తించి గురు పితృ పూజనంబులు గావించి, యగ్ని హోత్రంబులు దర్శించి విప్రసహస్రంబునకుంగర్పూరతాంబూలపరంపరలొసంగి వారిచేతనాయురారోగ్యాశీర్వాదంబులుగైకొని భరత శత్రుఘ్న లక్ష్మణులతోఁగూడి న లంకృతుండై సుమంత్రాదిమంత్రులను రప్పించి సభామంటపంబున రత్న సింహాసనంబున గూర్చుండి యచ్చటికి హనుమంతుని రప్పించి యతండునుదానును విభీషణుండునురావణ కుంభకర్ణ దేవాంతకాకాంపనాతికాయయింద్రజి త్ప్రహస్త మహాపార్శ్వమహోదరఖడ్గసర్పవృశ్చికాగ్ని వర్ణ ప్రముఖనిఖిల దానవమహోద్దండభండన ప్రకారంబులుగ్గడింపుచు।నెడనెడ మారుతింగొని యాడుచుఁగొంత ప్రొద్దు పుచ్చి శతకంఠుని ప్రకారంబెఱింగింపుమని విభీషణుని కెగసన్నగావింప నమ్మహాత్ముండును సమ్మదంబున నమ్మరుత్పుత్రునకుందెలివిపడశతకంఠుని జన్మంబును తపోమహిమంబును జలజజువరంబుల తెరంగును, చతుసవముద్ర లంఘన ప్రయాసంబును పరిఘావిశేషంబును ప్రాకారప్రకారంబును ద్వార రక్షకమహాదానవనివహ విక్రమక్రమంబును మంత్రి ప్రచండ త్వంబును కరతలామకంబుగానెఱింగించిన విని వనచరవర్యుండుగగనంబుముట్టి కుప్పిగంతు విడుచు రామభద్రునింగొని యాడుచు తనచేత నింతయు సాధ్యంబగుటకుమనంబున నిశ్చయించి రఘువల్లభునకాంజనేయుండిట్లనియె॥ **152**

గీ॥ అన్న రాఘవనీబంటునున్నవాఁడ
యెంత వాఁడైనవాఁడన్న యెంతమనకు
మీరు పంపిన యొకఁడనేక్రూరఁడైన
శతముఖుని ద్రుంచియే తెంతు సత్యముగను॥ **153**

సీ॥ అదియెటువలె నన్న నద్రిజాధీశుని
  శక్తి నా యందున సంఘటించు
నరయజగత్ప్రాణుఁడై నమాతండ్రిచే
  జవసత్వములు నాకుఁజాల గలవు
యశ్రమంబునజరామరణాదిమృతిలేక।
  యమరుల వలన నాయందునుండు
నదిగా కనీదివ్య హస్తంసంస్పర్శచే।
  మెండు గావజ్రదేహయుండనైతిఁ

గీ॥ గానమీయాజ్ఞఁదలమోచి కదనమునను
కణగి కదసిన శతకంఠుఁడనఁగనేల।
నట్టహాసంబు జేసి కాలాగ్నినైన
బట్టి మ్రింగుదునే చలపట్టి యధిప॥ **154**

గీ॥ దాటరాదని జలధులఁదడవనేల।
మేలదాఁటింతువాలంబుమీఁద సేన।
తివిలి యాత్మస్తవంబు గాఁదలఁపవలదుఁ।
తథ్యమింతయు నీదు పాదంబులాన॥ **155**

వ॥ అని మరుత్సుతుండు వెండియునిట్లనియె। దేవా మీరు నమ్మించిన నమ్మక సుగ్రీవుండు మీ చే దుందుభికళేబరంబు మీటించి సప్తతాళంబులు నొక్కకోలందునియలు జేయించియట మీఁద నాశ్రయించెఁగాదె। కావున మీరు నమ్మహా రూపంబు వీక్షించినం గాని సమ్మతింప రెల్లి మీపేరచంద్రతారాబలంబులు గలిగియున్నది నేనును నాయందుగల బలంబు గొల్వమంత్రులుచితంబునఁ జేరి భజింపనున్నచో నమ్మారుతాత్మజుండటకు నల్లన వచ్చె విశేషమే ర్పడన్॥ **156**

క॥ ఈ రీతి వచ్చి రాఘవు
భూరి జనంబుల కుమొక్కిపోల్పడు మూర్తిన్।
వారకచూపననజ్ఞులు.
ఘోరుకొని చెలంగి వాయు పుత్రుండచటన్॥ **157**

సీ। తనదువాలంబుమార్తాంధ ప్రచండమై
తతరథంబునకు కేతనముగాఁగ।
తన మోముసత్యలోక నివాస జలజాత
భవచతురాస్యచుంబనము సేయ।
తనవంటి దీర్ఘ దోర్దండ ప్రభావంబు
దిగ్గజంబులనెల్ల మొగ్గఁజేయ।
తన బర్బరస్థూల తనుమహాహిమంబు।
నీరజాండంబులు నిండుకొనఁగ।

గీ॥ తనదుభావంబునకు మహీతలము వణక
భూరి నక్షత్రములు మొల పూసలుగను।
బెరిగి లోకంబులకు నెల్ల భీతి గదుర।
విలయభైరవమూర్తి యై మలయు చుండె ॥ **158**

చ॥ మఱియును వక్షమందునను మాధవుడున్ ముఖమందు నగ్నియున్।
శిరమున నిర్జరేంద్రుడుఁను జెక్కుల నశ్వినులుం మహోజ్వలా
చరణతలోరు మధ్యముల సర్వ నిలింపులు సిద్ధసాధ్యకి
న్నరగరుడోరగాదులు ఘనంబుగఁగన్పడి రొక్కపెట్టున్॥ **159**

వ॥ ఇట్ల పార గంభీర విస్తారశరీరుండును। అ ప్రతిద్వంద్వకార్యుండును వాల ప్రచండభుజాదండ సత్వతృణీకృతాఖిలదిశారమణుండుదుర్నిరీక్షతేజస్సంభావిత బ్రహ్మాండ కోటరుండునుఁ చరణ పరాక్రమిత భుజంగవల్లభుండును ఁతీక్ష్ణరోమాగ్రచుంబిత సమస్త నక్షత్రనిచయుండును ఁ ఉచ్ఛ్వాస ప్రభంజనోద్ధూతవిపక్ష రక్షోమేఘ పటలుండును నగు నమ్మహామహుని నిరీక్షింప జాలకసుమంత్ర ప్రముఖమంత్రులును దక్కినదొరలును దలనెత్తవె ఱుచిఁభయంకంపితదేహులైయుండిరి। లక్ష్మణభరత శత్రుఘ్నులును। తదీయమహిమాతిశయంబుగాంచి। ఇట్టిట్ట ని వర్ణింపనే రక నిర్విణ్ణ మనస్కులై యూరకుండిరి॥ రామచంద్రుండును తదక్షుద్ర రౌద్రాతి రేకంబునకు పరమాశ్చర్యహృదయుండై యతనిసహాయంబున శతముఖునిందునుమవచ్చు. సందియంబులేదని నిశ్చయించి యభంగ కృపాపాంగముల నమృతంబు చిలుక సేసినమెల్లననిట్లనియె। **160**

ఉ॥ శాంతవిచారవాయు సుతశత్రుగుణాంతకమాయురేహనూఁ
మంత మహానుభావ యఘమర్దననీదగు రూపుజూడగా
నెంతటి వారు రాజులు గ పీశ్వరనాకును శంకబుట్టెనే।
డెంతయుఁజాలు చాలు కరుణాత్మకయెప్పటి రూపుజూపవే। **161**

ఉ॥ నా విని వాయుజుండు నరనాధునికెప్పటి రూపుతోడుతన్॥
వావిరివదనంబులిడివచ్చి విభీషణుదండనుండెన।
ద్దేవుడు రామచంద్రుఁడతని ప్రియ భాషలమాటి మాటికిం॥
సేవ దలిర్పసన్నుతులు సేయుచునుండె ననేక భంగులన్॥ **162**

గీ॥ పవననందనుఘోరరూపంబుజూచి।
మునుపు దనుమ్రింగి నందులఁదనివిలేక
నప్పటియునే డమ్రింగునోయనుచుఁబ్రీతి।
సేఁగుకైవడినపరాబ్ధినినుఁడుగ్రుంకె। 163

గీ॥ రాఘవుడు తొల్లిలవణవారాశి గట్టె
నిప్పుడిదియేడ గట్టు నోయిందునిలువి
బాగుగా దని చను మిన్నుబ్రాకు నట్టి
చటులబడబాగ్ని శిఖాపూవేఁ జెలఁగెతమము॥ 164

గీ॥ ప్రాగ్వధూమణి తననఖప్రకరములను
విప్పుకొప్పన చీఁకటి వెల్లివిరిసె
నవల వెండియు సవరించినట్టి సొబగు
చూచు దర్పణమని శశిదోచె నపుడు॥ 165

గీ॥ అంతకంటెను మున్నె భటాళిగొలువ
కొలువు సారించి యానృపకుంజరుండు।
వెలయు సంధ్యాద్యను ష్ఠాన విధులు దీర్చి।
యనిలజవిభీషణులబిల్చి యాక్షణంబ ॥ 166

వ॥ వారు దానును సహోదరత్రయంబును పంక్తి గలసి మ్రరకతపలాశపత్రంబుల షడ్రసోపేత రుచిరాన్నంబులును మృగపక్షి మాంసంబులును విచిత్ర శాకంబులును ఘృతాది ప్లుతంబులు గానానావిధంబులగు నూరుగాయల తోన రుచికపరిహారంబులుగా నారగించి కర్పూరతాంబూలంబులుగైకొని తదనంతరంబవిభీషణునవలోకించి మహాత్మా యిట్టి సమయంబున చతురంగ బలంబులతో మత్సహాయుండవై యేతెంచి దుష్కార్యంబు నెట్లైన తొలంగించి నిర్వహింపుమని యనర్ఘ్యమణిమయభూషణంబులు అపార దివ్యాంబరంబులు, సదృశసరిమళంబులును, దోర్ణత్తు గానిచ్చి పనిచిన నతండునుసమ్మతించి రామచంద్రునమస్కరించి లంకాపురంబునకుం జనియె పిదప రఘువరుండు హనుమంతు నవలోకించి యనేక ప్రకారంబులనాదరించి తనకంఠంబున మెఱయుదివ్య రత్న హారంబు కపివరుని గళంబున దవిలించి నీవు లక్ష్మణుండును కిష్కింధానగరంబున కరిగి యేతద్వృత్తాంతంబంతయును సుగ్రీవునకెఱింగించి సకల వానరసహితంబుగా దోడితెమ్మనుఁడు హర్షించి లక్ష్మణుండు వాయు జసహితుండైత త్పురంబున కరిగెఁమఱియు భరత శత్రుఘ్నులు వీక్షించి మీరు కాంభోజమళయాళలాటమరాట కోసల పాంచాల సౌరాష్ట్ర కుకురబర్బర దేశంబులకుంజని యాయా రాజుల బలంబుల తోడి తెండని పనిచి తానును సీతాసమేతుండై హంసతూలికాతల్పంబునత త్ప్రకారంబును వినుమనుచు సీతకుంజెప్పుచువిశ్రమించెనంత॥ 167

గీ॥ కాలమను సింహమాకాశగంధగజము।
చేరి తత్కుంభమధ్యంబు జేరినందు।
నమరఁగను పడు గొప్పముత్యమొయనగ
చొక్కమగునట్లవేగురుచుక్కబొడిచె॥ 168

గీ॥ దారకలు దారె కుక్కుట ధ్వనులు మీఱె।
కల్వగ మిజార మదను నిఘనతదీర।
కంజగములు గీరెచల్లనిగాడ్పుచేరె।
దీప్తితతు లూరెబలబల తెల్లవారె॥ 169

గీ॥ నెమ్మినంబరమనియెడుకమ్మ రీడు।
గరిమెదిక్ భాగ సంధ్యరాగంబుగొలిమి।
యందుఁగాగినయట్టి లోహంపు ముద్ద
నొందజేసెనొ యని రవిపొడి చెనపుడు॥ 170

సీ॥ ఆవేళరఘురాముఁడల్ల నవల్లకీ
మృదులస్వరంబుల మేలుకాంచి
కాలోచిత క్రియ ల్గ్రక్కున గావించి
మఱిగురువులకు నమస్కరించి
విప్రవర్గములకుఁగర్పూనతాంబూల।
తతులిచ్చిమది ప్రమోదంబు గదుర।
మణిభూషణంబులు మహిమాంబరంబులు
గైకొని సన్మంత్రిగణము జెలఁగ।

గీ॥ సకల రాక్షసవానరసైన్యచయము
వెప్పుడరు దెంచు శతముఖునెపుడుద్రుంతు।
ననుచు సింహాసనంబుననలరిరాము.
డుండెపే రోల గము న యనోత్సవముగ॥ 171

ఉ॥ దారుణశత్రుదుర్మదవదారుణ సత్కవిరక్షణప్రియా
కారణదానధర్మయుతగాఢ విహారణ కీర్తిసంచయా।
ధారణ నీకురంగ పదతామరహంతర నిత్యవిద్యసం।
చారణశాస్త్ర సమ్మతీవిచారణభోగయరాజ్యభూవరా॥ 172

మాలిని॥ శ్రితవదనసరోజసేవక స్వరభోజా।
సిత కరరుచిగాత్రా శిష్ట రక్షాచరిత్ర।
జితనిమితసమూహాక్షేమ వర్థిషుదేహా॥
ద్భుత విభవసురేంద్రా భోగమక్ష్మాతపేంద్రా॥ **173**

గద్య॥ ఇది శ్రీమద్వే దాద్రిపురని నాసశ్రీరంగసరసీరుహ
మధుర పౌబ్బాలగోత్ర పవిత్ర శ్రీరంగరాయ పుత్రభో
గయన్నృపాల నిజాశ్రితలింగసుకవి ప్రణీతంబైన సీతా
విజయంబునుమహా ప్రబంధంబు నందు బ్రథమాశ్వాసము॥ **174**



# సీతా విజయము

# రెండవ యాశ్వాసమూ

కll శ్రీకర సద్గుణగణర।
త్నాకరకమనీయతరకృపారసపూర్వా।
భీకరతనురుచివిజితసు।
ధా కరభోగయనృపాలధర్మవిశాలా॥ 1

వ॥ అవధరింపుమిత్తెఱంగున శాంకరీదేవికి మహాదేవుండు వెండియునిట్లనియె నట్లు సకల బాంధవామాత్యపురోహితసామంత సముద్భటవిద్వత్కవిగాయకనాయక సంఘంబులునుంగొలువ నఖిల నృపాల సార్వభౌముండుగు రాముండు వశిష్ఠనీతివచనంబులనితిహాసంబులు దెలుపపేరొలగం బుండి శతముఖ శతద్వయ దోర్దండఖండ నాఖిలాషుడై విభీషణసుగ్రీవముఖ్య సకలసేనాగమన కాంక్షతనుండైనంత॥ 2

సీ॥ ఆవిభీషణులంకాపురంబున కరిగి।
తమబంధుమిత్రులఁదవిలిపిలిచి।
యచటువృత్తాంతబు నెల్లనెఱింగించి
ఇట్టి వేళలమనమినకులేంద్రు
నకు దోడుగావలెనని జాగుసేయక।
యఖిల సాధనములు ననువుజేసి।
రథములు సవరించి ప్రథనభీకరకంద
సింధురంబుల నేర్చిచిత్తములకు।

గీ॥ మించువేగంబు గలిగిన మేటి హరులు।
పోటు గంటినిమీఱెఁడు నీటిభటులు।
నాయితంబులు సేయించి యతిరయమున
వరుస దెమ్మని పడవాలుబని చెనవుడు॥ 3

సీ॥ పనిచితోడ్తోన సంపాతి నలానిల।
సత్రాప్రధానుల నెల్లసరగఁబిలచి।
వేర్వేఱు మన్నించి దుర్వారబలువార
మీరు నాకొర్కెలింపార సల్పి।

ఒక్కరొక్కరి వెంటనొక్కకక్షోహిణి
కొలిచిరానరుదెండు బలిమి మెఱసి।
దారపుత్రభ్రాంతి దనరినదుర్మతుల్
రాకుడిచ్చుట నెపరాకుగాకుం॥
గీ॥ డనియెఱింగింప నమ్మంత్రులాహవమున
నుత్సవంబులుగైకొని మత్సరించి
పరంగహదమప్రాణములు దెగియరసి కొనుచు।
త్వరితయుద్ధ ప్రయత్నముల్ జేసిరపుడు॥ **4**

సీ॥ ఒనరనిత్తెఱంగునయుద్ధసన్నద్ధులై
కరిరధభటతురంగములు గొలువ।
నప్పుడే కైక మహాక్షోహిణులతోడ।
మలయుచుంబదువురుమంత్రివరులు।
భేరీమృదంగ గంభీరభాంకారముల్।
జగతీతలమునాకసమునిండ।
నాహవజయనిష్ఠురాలాపములుమీఱ।
జనుదెంచి యావిభీషణుని నెదుర।
గీ॥ గడల వెసంజూచి ముసలముల్ ఘనతంజూచి।
ప్రాసములు ద్రిప్పిపట్టి సప్రతతినొప్పి।
సాయకము చేర్చి సంగరాచరణనార్చి।
నేర్పుజూపిరిదోర్బల నియతిమెఱసి॥ **5**

వ॥ ఇట్లనేక ప్రకారంబుల నలుండును నీలుండునుహరుండును సంపాతియున వక్రుండును వక్రజిహ్వుండును శూలముఖుండును రక్తవదనుండునేకపదుండును కుటిలకేశుండును ఉలూఖలుండును। మహాగర్భుండును వికృత పార్శ్వుండును। నాది గాంగలమంత్రులందఱు పాడంజూపియుత్సహించి న నవ్విభీషణుండును వారలనాదరించి తానునిజాభ్యంతర మందిరంలునకు సకల బ్రహ్మరాక్షసభాషితానేకశ్రుతిస్మృతోతిహాసం బులువినుచున్న తల్లికి నమస్కరించి రణప్రయాణమంతయు వినుపింపకైకసివిజయుండవై మరచి రమ్మని దీవించుయక్షతలిచ్చినంగై కొనియచట వీడ్కొనియచట మహాపతివ్రతాశిరోమణియగు నరమమహాదేవికింజెప్పిన నప్పరమసుందరిమందహాసంబుగావించి దూర్వాక్షతతాంబూలనిచయంబు దోయిటం గొని వచ్చి యిచ్చియిట్లనియె॥ **6**

చ॥ రమణదయాత్మ నీతి గుణరత్నమఖండన భూమిలోనమీ।
రమణునకుంజయంబు గొని రమ్మని పంప విభీషణుండొగిన్।
సుమహిత రత్నవి స్ఫురిత షోడశచక్ర సహస్ర ఘోటికో।
త్తమ శత ఘంటికాయితరథంబు ముదంబున నెక్కి సారెకున్॥ 7

శా॥ శంఖారావము దంతిబృంహితములుం సర్వస్ఫుటోష్ఠ చ్ఛటా।
రింఖా ఘట్టన ఘోషణంబులను మౌర్వీనాదముల్ పేగవ।
త్కంఖాణోగ్ర విహేషులుంబణవఢంకో రధ్వనుల్ ఘోరద్రు
క్పుంభీభూతములై చెలంగెనదయం భూభాగమధ్యంబునన్। 8

వ॥ ఈక్రమంబున విక్రమ శీలుండై విభీషణుండు సకల సేనాసమేతుండై లంకానగరంబు వెలువడింది. నదిన క్రమంబున సముద్రంబును గటాంకంబులును మహావనంబులును పర్వతంబులు నుప్రవాహంబులను దేశంబులును ఘనతరగ్రామంబులునుఁగడనిసాకేతనగరంబు ప్రాంతంబున కుంజనితనరాక రామచంద్రునకెఱింగింపఁబంపెనంత॥ 9

మ॥ దనుజుండుంజని రాము గాంచికరుణందండంబులర్పించియో।
జననాథాగ్రణి రామచంద్ర భవ దాజ్ఞం మార్గమెల్లందగన్।
ఘనతన్ మోచి విభీషణుండు చతురంగబుల్ దశాక్షౌహిణుల్।
తను సేవింపఁగ వచ్చిన న్నుబని చెన్దద్వార్తవినుపింపఁగన్॥ 10

ఉ॥ నావిని రామచంద్రుఁడు రణప్రియమేర్పడ మిన్ను ముట్టిసం
భావన లిచ్చు మంత్రులును బాంధవులుందను గొల్చిరాగభూ।
దైవతులెల్ల సారెకు ముదంబున దీవన లియ్యచయ్యనన్।
రావణవైరి యొక్క గజరాజము నెక్కి పురంబువెల్వడెన్॥ 11

ఉ॥ ఆరథ ఘోషభీషణములామదదంతి మహోన్నతక్రమం।
బారయనిర్జితానలమహాశ్వసమూహజల ప్రభావిధం।
బారణధుర్యసద్భట మహార్భట వృత్తియునల్లనన్।
వారకజూచి మెచ్చి జయవర్ధనుండై ముదమందుచుండఁగన్॥ 12

ఉ॥ తోషణుడున్ మనోవిదిగతదూషణుడుజ్వల సూనృతోల్లస।
ద్భాషణుడాశ్రితాఘ హరాభావితభూషణుఁడుగ్రశత్రువా
ద్భీషణుఁడా ర్యవర్యుఁడు విభీషణుఁడల్లన వచ్చి మ్రొక్కెదు।
ర్దోషవనీకురారునకు దుష్టవిదారునకుందయాబ్ధికిన్॥ 13

వ॥ ఇట్లు పరమభక్తుండగు విభీషణుండు ప్రణమిల్లిన తన భద్రదం తావళకుంభీ మధ్యంబునకు రావించి మణిభూషణాంబర పరం పరలొసంగి గాఢాలింగనంబుగావించి బలంబులు విడియనొక్క బాహ్య రమ్య ప్రదేశంబు జూపించి విభీషణొక్కభర్మప్రదేశంబుననునిచి రాఘవుండా రాత్రి వాసవప్రముఖత్రిదశులం బ్రార్థింప బృందారకులందఱు బ్రసన్నులైమహోత్మాయేవరం బైన యడుగుమనిన ముదంబంది విజయంబొనరసురల గనుంగొనినేడాది గాశతముఖుండు మడియుదనుక సకలమను జదనజవన చరబలంబులకు దృష్టోహారవాంఛలు వొడమ కుండదయచేయుండనినట్లకాక యని యంతర్ధానంబునొందిరి రఘూద్వహుడును. సుగ్రీవప్రముఖనిఖిల శాఖామృగంబులురానెదురు జూచుచునుండె నాసమయంబున॥ 14

శా॥ దుష్కర్మక్షితి భృత్కఠోర పవిసంతుష్టుండు యెల్లప్పుడున్।
నిష్కాతిలన్ విచారుడుత్తమ గుణానీకుండు శత్రుచ్ఛటా।
దుష్కారుణ్యదవానలుండు కృతకస్తోముండు సౌమిత్రియా।
కిష్కింధానగరంబు చేరువనుసుక్షేమంబుమై నిల్చుచున్॥ 15

సీ॥ అనిలజనీ వేగి యర్కనందను గాంచి।
యటు బుట్టినట్టి వృత్తాం తమెల్ల।
చెప్పిన వచ్చుట చెప్పి రాముని యాజ్ఞ।
చెప్పియాడకునతి శ్రీరఘువృత్తి।
సకల శాఖామృగ సహితంబుగా యుద్ధ
సాధనములతోడ సరవితోడ।
తెమ్ము రా కుండిన దిగ్గున నరుదెమ్ము।
యటు మీదనాచేత నౌనుగాని।

గీ॥ యనిన పని బూని హనుమంతుడ తిముదమున।
నచట వీడ్కొని కిష్కింధ కరిగి యఖిల।
వానరులు దన్నెదుర్కొని వందనములు।
సేయపట్టణ మధ్యంబు జేరియచట॥ 16

శా॥ ఉగ్రోరాతిపయోధి బాడబుని విద్యుత్సన్ని భాశుంరణో
దగ్రున్ బాహుబల ప్రతాపఘనమార్తాండాత్మజుంభూరిహో।
మగ్రామప్రతిమాన ధైర్యునితరంబున్ రాము పాదాంబుజ।
భృంగధ్యానునిగాంచెన తడుంబ్రేమంమరున్నందనున్॥ 17

క॥ కనుగొని యెదురుగజనియా।
హనుమంతుని గౌగలించి యలరుచునర్థా।
సనమున నిడితత్కుశలం।
బనుపమకృపనడుగ నిష్టమంతయుఁ జెప్పెన్॥ 18

సీ॥ చెప్ప ఫాలము నంజలిపేడ్కగేలించి।
వెండియునిట్లనెవిమల మతిని।
నా తండ్రి దశరథనంద నుఁడోరామ।
భద్రుఁడున్నాడె సంభ్రమమెలర్ప।
భండనోదగ్రుఁడౌ ప్రభవుండా లక్షణుం।
డతని సేవించునే యనుదినంబు।
భరత శత్రుఘ్నులు ప్రమదులె మాతల్లి।
జానకి కుశలివియై సరవిగనునె।
గీ॥ విధవయైయున్న దశరథవిభునిసతులు
కొవమరులను జూచియైనను కొంత వగవు
మానియుందురె రాజ సన్మాన్యుడగుచు।
నావసిష్ఠుండు మెలఁగునే యచటునఘ॥ 19
గీ॥ చూచినాడవేఈలోన సొంపుగదుర
రఘువరేంద్రుని తద్ధరారణముసఫల।
సరవి బుట్టునే యవ్విభీషణుని వార్త
పేడ్కఁదలఁతురెయొక్కొక్క పేళమమ్ము॥ 20
సీ॥ నావినిచిరునవ్వు నవ్వి సుగ్రీవుతోఁ
నగ్గించి హనుమంతుఁదని యంబ్రీతి
రామాదిదశరథరాజనందనచతు
ష్టయముననున్నారు సంభ్రమముల।
సీతామహాదేవి చెన్నొందిపతిసేవ।
సేయు చునున్నది సేమమునను।
గరిమకౌసల్యాది కాంతలుగొడుకులు।
మన్నింపనున్నారుమానవతులు।
గీ॥ నవ్వసిష్ఠుండు నున్ననవాఁడతిముదమున
కడువిభీషణుడును రాముకడనెయున్న
వాడు సేనును నటనుండి వచ్చినాడ
నిన్ను నెప్పుడు రఘురాముఁడె న్నుచుండుఁ॥ 21

వ॥ అనిన విని యినసుతుండ నిలజునవలోకించి యిట్లనియె। మహాత్మవిభీషణుండును రామునికడనుండుటకు నాశ్చర్యంబునుం బుట్టెఁయెట్టి చందంబున నరుగుదెంచెఁనేమి కార్యమని యడిగియెఱింగింపు మన హనుంమతుడిట్లనియె॥ 22

సీ॥ రావణు కంటె పరాక్రమవంతుడు।
 శతముఖుండనెడు రాక్షసవరుండు।
గోవిప్రదేవతాక్షోభంబుగావింప।
 నందుకు రాఘువుండఖిలమునుల।
కభయహస్తము లిచ్చి యాహవంబునకు సహా।
 యంబుకు రమ్మని యడుగనవ్వి।
భీషణుంబొడఁబడిభీషణ శౌర్యుఁడై
 చనియెలంకకురివ్వ జలదరింప
గీ॥ నిన్ను రమ్మని నపుడంపనేను లక్ష్మ
ణుండు వచ్చితిమి టకునుద్దండగతుల।
నాఁడు సౌమిత్రి మనపురద్వార కుంభ।
దుపవనంబుననున్నాడు తపనతనయఁ॥

ఉ॥ నావినితల్లడించి దిననాయక నందునుఁడున్కిపాటునం।
పావనినుంచి పేచి తన భర్మగృహంబున కేఁగితారతో
నావిధమెల్ల జెప్పికనకాంబరభూషణ రత్న వస్తువుల్।
కానుకగొంచు వచ్చెనతి వేడ్కపురోవన భూమిచేరఁగన్॥ 24

చ॥ ఇటు వలె వాయుజప్రముఖు లేకముగా దనుగొల్చిరాగమి।
క్కుటమగు భక్తితోడనినుకూరి మిపట్టి రఘూద్వహానుజుం।
దటుకునగాంచివందన శతంబొనరించి యనేక భంగులన్
స్ఫుట మృద భాషణంబులను సన్నుతిఁ జేసి దయార్ద్రచిత్తుడై॥ 25

ఉ॥ కానుకలిచ్చి యోదనుజఖండన యోనరనాథచంద్ర
దీనశరణ్య యోవిమలతేజ రఘూత్తమభృత్యుడంగడున్।
సేనలతోడనెద్దియటుచెప్పుము వేగనొర్తుసన్నుత।
ద్భానుజుబిల్చి యట్లుబహుభంగుల నాదరణంబుసేయుచున్॥ 26

చ॥ వినుము కపీంద్ర యొక యవివేక పురాక్షసుండిప్పుడిట్టిసన్।
మునులను గోకదంబముల మూర్ఖతద్రుంపుచు దైవకోటినిన్।
ఘనముగ బాధబెట్టుటకు గర్వము సేయుదురెందువేకహా
చ్చిననివియెల్లతాపనులు చెప్పినవారినిగాచెవేఁడుకన్। 27

వ॥ ఇవ్విధంబునంగాచియమ్మహాదానవుంబరిమార్పుటకు బ్రతిజ్ఞసేయువాడె పరమ పురుష సాధ్యంబులగువరంబులు పరమేష్టియొసంగెనందుకునాల్గు సముద్రంబులు దాఁటవలయు. ననిచింతింప నేనల్ల డాసి నెపంబుననేనొక్కరుండనే చతుర్దశ భువనంబులును భస్మీకరింతు నొక్కరక్కసుని కైయింతవంత యేల నని పలికిన నలరి యిందుకు సందేహంబు లేదైనను పెక్కురక్కసులలో నొక్కరము మెలంగుట దగదని విభీషణుందలంపనతండును పదియక్షౌహిణులతో జనుదెంచెదనని చనియె। నింతకువచ్చునొరాగలండోయెఱుంగమునేను హనుమంతునితోడ తద్వృత్తాంతబు నీకునెఱింగించి సహాయంబు గొనవచ్చితిమి। ఇట మీద నీదిభారంబని యూరకుండె। సుగ్రీవుండును ముదంబున నందుకు సమ్మతించియిట్లనియె॥ **28**

శా॥ దేవావాఁడననెంతవారికి చమూదీప్తప్రతాపాగ్నికీ
లావర్గంబెసగించిదానవసముల్లాస సాటువింగాల్చి భూ।
దేవాలింగరుణించెదంమదినిజింతింపంగ నేలయ్యా ము।
న్నావంతిబ్రియభృత్యుండండగ ధరానాథాగ్ర చూడామణీ॥ **29**

సీ॥ మలమాచలంబున మాల్యవంతంబున
హిమవంతముననుమహేంద్రముననుు
కన కాచలంబున గంధమాదనమున
నీలాద్రినలమళయాళగిరిని
శేషాచలంబున సింధుపర్వతమున
మును మిడినల ఋష్యమూకముననను
వనచరవర్గముల్ ఘనతతోనున్నారు.
వారిరాబనిచెద వచ్చుదనుక

గీ॥ పంచరాత్రంబులిచట సంభ్రమ తనుండు
డనుచు బ్రార్థింప లక్ష్మణుడనుమతింప
పంపకడనుండె పవన జప్రముఖులలర
భానుజుండను రాబంపెబలమునెల్ల॥ **30**

వ॥ ఇట్లుసుగ్రీవుండు సకల కుధరగహన తటాకంబుల కడకు తనభృత్యులంబనిచినవారును తత్తత్ప్రదేశంబులకు జనిరాము పాదంబులమీఁద నానపెట్టి యఖిల భల్లూకవానర నివహంబులంబిలిచిచనుదెంచిరంత **31**

చ॥ మలమనగరంబునుండి బలు మాఱును రాముని చేరుగొంచువెల్
వలుదళ సంఖ్య దన్నుగొలువంగరణోచిత ఘోరవాక్యముల్
సలుపుచునార్భటంబులదిశావలయంబులు దల్లడింపఁగా।
చెలఁగుచు వచ్చెనప్పుడు సుషేణుంబు భానుసుతుండు మెచ్చఁగన్॥ **32**

ఉ॥ వాలములన్ మహాకుధర వర్గములంబెకలించి మింటికా
ఖీలత వైచి మళ్ల నవిబెట్టుచు బెట్టినహుంకరింపుచున్
హేలిపదాఱువెల్వ కపులింమెయిగొల్వఁ గోముఖుండున
న్నీలుఁడు గూడివచ్చి రాలనీలనగంబుననుండి చెచ్చెఱన్॥
ఉ॥ ధర్మనగంబు నుండి వల పాటికపుల్ నవలక్షగొల్వఁగా।
నర్మిలి వెల్వవైచనుచున ప్రతిమానభుజాబలంబులన్।
దుర్మదవృత్తి నారుచునుతోయధులెల్లఁగ లంగిపొంగజ్యో।
తిర్ముఖుఁడే గుదెంచెనతితీవ్రరయంబున రాముదల్పుచున్॥
చ॥ వివిధ పరాక్రమస్థితులు వెల్వలు తొమ్మిది గొల్వ నభ్రభూ
భువియును నిండ నార్చుచును బొంగుచుగంతులు వేయుచుంమహా।
జవములనిర్ఝరావలులు సన్నుతిసేయ విరోధిభూములై ।
గవయుడు గంధమాదనుడు గ్రక్కునఁ జేరియుక్కు మీఱగన్॥
చ॥ శతబలియుగవాక్షుఁడును శౌర్యధురంధరుడైన మైందుఁడన్।
జతనముతోడఁ గూడిన దశసంఖ్యలు వెల్వలు దమ్ముగొల్వనీఁ
క్షితిజములొక్కటంబెరికి చేకొని త్రిప్పుచుగంతులీడుచున్।
మదమున జేరిరయ్యెడగు మాద్రిగిరీంద్రము నుండి యత్తఱిన్॥
వ॥ మఱియు నదియునుంగాక మూఁడు కోట్లతో ద్వివిదుంమును ‹రెండర్బుదంః పనసుండును। యేబది సహస్రంబులతో భల్లూకనాధుండును। యేడక్షౌహిణీలతో వృషభు‹ పదునొకండు పద్మంబులతో వేగదర్శియును. తారకాకుముదులుంగూడి నానా పర్వతములలో చనుదెంచెనవి యెల్లను. పండ్రెండు వెల్వలయ్యె కిష్కింధను ఋష్యమూకంబున గల వానరునెల్లయె వెల్వలయ్యె నానాముఖంబులంగలసిన కపిబలంబులన్నియు నొక్కనెల్వయననొప్ప నన్నియు రెండువెల్వలైప్రవర్తిల్లెనంత॥
సీ॥ శతలక్షకోటెలుశైలచరావళుల్।
గదసినమొనలుయనగఁబరఁగు।
మొనలఱువదిలక్షలనువుగాగూడిన
నదిలోకమునఁ బారువనఁగ నొప్పు
నట్టి బారువులు సహస్రంబు మూఁగిన
నదిమహాదళమననవనిజెల్లు।
దళములర్బుదమైనదానిపేరంబర।
సంఖ్యయందురు మంత్రి జనమువెల్ల।

గీ॥ అట్టి యంబరములును కోటియైన, నొక్క
వెల్వయనదగు నటువంటి నెల్వలేఁడు।
పదులు రెండును సేవించి భానుసుతుని।
యట్టివెల్లను జేకూరెనద్భుతముగ॥

సీ॥ ఎచ్చోటఁజూచి నచ్చోటనేలయిా
నినభంగిగన్పట్టి నిల్చువారు।
తతఘోరసింహనాదముల నక్షత్రముల్
దొరగుమిన్నులుముట్టెబెరుగువారు।
కాలురెపిసేనువాలంబులంకించి।
యాలంబులకునసియాడువారు।
పర్వతంబులు నిమ్మపళ్లచందంబున।
యరచేతులను నిల్పితురుగువారు।

గీ॥ పురికి సాలమహీజముల్ పెరికితెచ్చి।
తివిరిపలు మాఱుజిరజి రాత్రిప్పువారు।
నగుచుభూభాగభూనినంభోంతరాళ।
మందు కపిమయమైయుండేనట్టియెడను॥

సీ॥ సౌమిత్రి యపుడు తచ్ఛాఖామృగా ఖీల।
సైన్యంబుగలసిమహాశ్చర్యమంది।
పావనిజూచి యో పరమపుణ్యాత్మక
ధరణిలో నీకసాధ్యంబు గలదెఁ
ఇన్నియు నొక యెత్తుయింతటి కంటెనెల॥
క్కుడునీవు గావునఁదొడరవలసె।
యెల్లిఋష్యమూకయాత్ర కిదివెస్సుసుగ్రీవ।
పయనంబుజేయించు రయముజారఁ।

గీ॥ ననుఁడు సుగ్రీవుఁడే తెంచెననిలజుండు।
నతఁడు మరునాటి యాత్రకు ననుమితించె।
రాఘవానుజుఁడును మదిప్రమోదమందఁ
కపులునాడాడ విడిసిరి విపులముగను॥

ు॥ అంతసూర్యుడు గ్రుంకెనపరాచలంబున।
నారేయి లక్ష్మణుంబరసిజాంబ।
వంతుని రప్పించి వింతఁగానాతని
వలనన దీప్రవాహములుగిరులు।
మహిమంబులును వినిర్మితతరుఘనతలు।
దేవదైత్యమహానుభావములును
కపులు పుట్టువులును కఠిన సంగరవర్త।
నములును గడుసముద్రముల తెరంగు।
ు॥ ముష్టియుద్ధప్రకారంబుమొనసిపెనగు।
లాడువిధమును పిదపశతాస్యుగతులు।
వాని మంత్రుల తెఱుఁగును పూనికలును।
తెలుసు కొనుచుండెనంతటఁ దెల్లవారె॥ 41

ు॥ భానూదయకాలంబున।
భానుజుఁడు పొంగి రామభద్రానుజునిం।
కానంగవచ్చి యిచ్చెను।
దానగజశ్రేష్ఠ మొకటి తగునటులలరన్॥ 42

ు॥ ఇచ్చితానునుతారాప్రముఖనిఖిల యువతిచయంబునకె ఆరింగించి వారిచేననుజ్ఞలు గొని యుంగదముఖానేకపుత్రపౌత్ర మిత్రామాత్యావర్గంబులతో పురంబువెలువడి వచ్చె లక్ష్మణుండును. ానుజుండంతమత్తకరిఘటస్ఫాలన కరుండై జాంబవంతసుషేణకు ముదనీలగోముఖజ్యోతిర్ముఖ రభరిషభగంధమాదనమైందద్వివిదపనసశత బలిగవయాంగదహనుమంతభృత్యు లుగొలువన ఉఁగచుండి కల దళంబులును భూచచరఖేచురువైరాఁదొణంగెనంత॥ 43

ు॥ ధరణిదిర్ధిరఁది రిగెభూధరములదరెఁ।
గలగెసప్తాంబురాశులు తలఁకెబ్రహ్మా।
యగణితాఖిల సకల శాఖామృగప్ర।
చండదోర్దండ ఖండనూద్దండగతులు॥ 44

ు॥ అమ్మహోత్సవమరసిరామాను జుండు।
గలిగెవిభవంబు మాకునీకతరఁగాదె।
యనినబ్రణమిల్లి నీబంటునంతఁబలుక।
నేలయనిరవితనయుండు నేగుచుండె॥ 45

ఉ॥ ఏపుననిట్లు భాను సుతుఁడేగిబలంబులతో డదానయో।
ధ్యాపుర వేష్టి తాక్షితిధరాఘువనంబుల జేరరామధాఁ
త్రీపతితత్తదాగమన రీతులు చారుల చేనెఱింగియు।
ద్దపితచిత్తుఁడై పనిచెతీవ్రతమత్పలదానెదుర్కొనన్॥ 46

ఉ॥ ఈగతిరామచంద్రుడు దినేశ్వరపుత్రునెదుర్కొనంగదా।
వేగనమంత్రులన్ హితులవృద్ధులరాజు లఁబపనుర్వితా।
రాగురుభోగ వైభవధురంధరుఁడో రవిపుత్రుఁడందరిం।
బాగుగనాదరించిపతిపజ్జనులక్ష్మణు గొల్చివచ్చుచున్ 47

ఉ॥ రాముని పంక్తి కంధరవిరాముని నీలపయెద కోమల।
శ్యాముని శీతహృత్కుముది సంచయ సోముని సత్యభాషణ।
స్తోముని సార్వభౌముని విశుద్ధ సుకీర్తి గుణాభిరామునిన్।
ధీమణియైన భానుజుఁడు దిగ్గన గాంచెముదంబు నెక్కొనన్। 48

ఉ॥ కాంచిత దీయ దివ్యపదకంజయుగంబుల మీఁద వ్రాలితా।
నంచిత భక్తి పేచిదనుజానుజుఁడైన విభీషణుండు భూ।
సంచిత వృత్తి ఁగౌఁగిటను జక్కఁగబెట్టి సుమంత ముఖ్యులన్।
మించుగ నాదరించి మఱిమెల్లనె రాముని జేరియిట్లనెన్। 49

సీ॥ ఇనకులోద్ధరణాయదనుజ సంహరణాయ।
రామాయతేనమోరాఘువాయ।
ప్రవిమలసుగు ణాయప్రణుత మౌనిగణాయ।
రామాయతేనమోరాఘువాయ।
భువన ప్రశస్తాయభవభయత్రస్తాయ।
రామాయతే నమో రాఘువాయ।
భండ నోద్దం డాయ, దండిత వ్యజనాయ
రామాయతేనమోరాఘువాయ।

గీ॥ రసికజన సార్వభౌమాయ రాఘువాయ
రావణాటవిదహనాయ రాఘువాయ।
రావణీయకృపాత్మ నేరాఘువాయ।
రామచంద్రా యతేనమోరాఘువాయ। 50

వ॥ అని మఱియును బహు తెఱుంగులవినుతింప సుగ్రీవునిన్గుచ్చి యాలింగనంబు జేసెనంతయతండు నుదానును లక్ష్మణుండును సుమంతుడును వశిష్ఠుండును వానరబలావలోకనాభిలాషులై భేరి మృదంగవైణికాహళపణవశంఖ నిస్సాంబులును వీణావాదంబులునుఁ జెలంగ రథంబువెక్కి వచ్చి దక్షిణగోపురంబు నెక్కి రప్పుడు॥ 51

సీ॥ ఒక కపినింగికి నూకించిగిరిపైవ
నెగసినెక్కఁడు దానుబగులదన్ను।
ఒక వానరుఁడు రవినొడయనూకించిన
నొక్కడు వానిపైనుమిసినవ్వు।
ఒక వానరుండు తరువ్వులు పెరికి తెచ్చిన।
నవి పుచ్చు కొనిపీకులాడు నొకఁడు।
ఒక కోతియు కిలించి యొగిపళ్ళు సూపిన
గఱచు నొక్కఁడు వాని వెఱచుదనుక।
గీ॥ ఒకఁడు రాఘవననుజూడు నొక్కరుఁడనే।
శతముఖుని ద్రుంతునని వెల్లుచౌకళించు।
ఓరి సేనైనని క్కడనుండి వాని
వాలము నంఁదె త్తునని కూయ వచ్చియొకఁడు॥ 52

సీ॥ అక్క పిచుబుకదీర్ఘాఖీల రోమముల్
నారిమీఱగను పట్టినాచుగాగ
వనచరపారదుర్వారశౌర్యంబులు।
ప్రీతిగాఁగన రాని లోతుగాఁగఁ
నొగివాన రోద్దండ హుంకృతి ధ్వానముల్
క్రూరాంబు చరఘోరఘోషంగాఁగఁ
పద్మాప్తపనందన ప్రాకటాజ్ఞాదికల్
ఘనమదిచెలియలి కట్టఁగాగఁ।
గీ॥ అగచరాటోపములు బడబాగ్నిగాఁగ।
నవ్వుదెలు పదివీచుల ఫేనములు గాఁగ
భాసురంబుగ సకల సేనానముద్ర
మపుడు వీక్షించెరఘురాముఁడద్భుతముగ॥ 53

గీ॥ తనమనంబున వీక్షించి యినజుఁజూచి।
కడిమిమీఱంగ వెండి యుఁగౌఁగ లించి।
మెచ్చి యతనికినిప్పించె మించి యొకయ।
మూల్య మాణిక్యహారమ్ము మోహనమునను॥ **54**

గీ॥ ఇట్లు మన్నించి వెండియునినజుగ నియె।
ఏడి జ్యోతిర్ముఖుండును యేడినీలు॥
డేడికుముదుండువ యుంబు(యేడి మి(త।
పు(త వేర్వేఱ నెఱిఁగింపుచి(తముగను। **55**

వ॥ అనిన నొయ్యనఁదప కేల నమ్మహీపాల తనయునకుఁ గపులం జూపి సు(గీవుండిట్లనియె. **56**

క॥ బహుకపిబలములుచుట్టును
రహిమీఱగఁదన్ను గొల్వ రాఘవమిమ్మొ।
మహితముగఁ జూచుచుండెడి
మహనీయులలుండు గంధమాదనుండధిపా। **57**

క॥ తరుచరులు గంతులిడగన్।
మురియుచు వాలంబు పీఠముగఁ జేసిమహా।
గిరివోలెచెలన మొందెడు।
గురు తరబలుఁడైన వాఁడుగోముఖుఁడధిపా॥ **58**

క॥ అర్చుచుకపులాహవములు
పేర్చుచు న(భమములు ముట్టబెఱుఁగుచుగొలువన్।
కార్చిచ్చు వూలె నడుమను
కూర్చిండినవాఁడు దేవ కుముదుఁడు సుమ్మీ॥ **59**

క॥ భీమారి శుష్కతరువన
ధూమధ్వజుల(ది చెరపతులు గొలువంగా।
(పేమతొనున్నాఁడురుసం
(గామధురంధరుఁడు వాఁడుగవయుఁడు నాథా। **60**

క॥ భూతలమువణక తనయర
చేత గిరి (తయమునేర్పుచేనునిచిరణ
ఖ్యాతివహించెకణకన్
జ్యోతిర్ముఖుఁడల్ల వాఁడె చూడుమురమణా॥ **61**

క॥ వాలము రవిగదియఁగనా
ఖీలంబు గcజూచి కపుల భేద్యులు గొలువన్।
ఆలంబునకఱ్ఱాడె
నీలుని గనుగొంటే సకల నృపలోకమణీ। 62

క॥ తను సహాయంబు గనుపడ
ఘనసాలయుగంబు చేత గదియించిశతా।
స్యునిజంపcబోని నిలిచెన్
పన సుండడెచూడు ధరణి పాలవ రేణ్యా॥ 63

గీ॥ విపుల దోర్బల శౌర్యుల గపులు గదసి
నేలయీనిన విధముననిండి కొలువ
నాహవంబుననఱ్ఱాడు నమితబలుని।
నాగవాక్షుని జూచి తేయసురమధన॥ 64

గీ॥ ఎపుడు సంగరమబ్బునా కెపుడు బాహు।
దండకండూతి మానుద్దండ భండ।
నముననెప్పుడు రిపుదళనంబొనర్తు।
ననుచుcబలికెడు వాcబు గజాఖ్యుcడధిప॥ 65

గీ॥ మును పెరుంగవె పింగళాక్షుని నిమిష
మాత్రమును గూల్చిన ప్రతిమానబలుcడు।
ఎసcగమిము జూచి దండంబు లిడగజొచ్చె।
శరభుcడదె చూడు రఘురామసార్వభౌమ॥ 66

గీ॥ వితతముగ కవులు సేనూ ఱువేలుబలసి।
జతనముగcగొల్వ హేమాద్రి చందముననుు।
మదిని బొదలుచునున్నాడు మానవేంద్ర।
శతబలిని జూడు మద్దివృక్షంబు క్రింద॥ 67

గీ॥ ఒక్కరుండనె శతముఖునుక్కణించి।
రామభద్రుని మెప్పింతు రణములోన
ననుచునాఖీలవాల మల్లార్చ cదొణcగె॥
వాcడు వృషభుంబు చూచి తెవరగుణాఢ్య ॥ 68

వ॥ అనిమతియును సుగ్రీవుండందఱిని వేఱువేఱనెఱింగిపుచు నుండ రామచంద్ర చరణారవి సందర్శన కుతూహలాయత్త చిత్తులై తమతమ బలంబులం నిలిపియాసమయంబున॥

శా॥ అభ్రశ్యామ సమాన దేహుడు సముద్యత్కుందమందారస
చ్ఛుభ్రాషోగ్రుడు విక్రమ ప్రకటు రక్షోగర్వ విచ్ఛేదనో।
గ్రభూమండలు దాహవాహిత భు జాగర్వ ప్రహారాతిశౌ।
ర్యభ్రా జిష్ణుడు జాంబవంతుఁడటమోహంబొప్ప వచ్చెన్ వెసన్॥

శా॥ భూషాలంక రణస్ఫుటాంగుఁడు దయాంభో రాశిషట్పాత్రస।
ద్భాషార్థజ్ఞుంబు శత్రుదానవమహాజీమూత వాతూలుడా।
యుష్యాతావాసి తాబ్జసంభవుఁడు శౌర్యోగ్రుండు రామాయణ
ప్రేష్యాత్ముండును మరుత్సుతుండ తగనర్థన్ వచ్చె నచ్చోటికిన్॥ 7

శా॥ చండార్క ప్రతిమానతేజుఁడు మహోత్సాహుండు యుద్ధక్రియా
పాండిత్యుండ సమాన విక్రముడు శుంభద్వాలఁగండూషితా
ఖండాకాశ విమలుండు ప్రతిపక్ష ప్రాకటోద్య ద్భుజా
దండచ్ఛేదన సత్వుఁడాగవయుడంత న్వచ్చె మోదాత్ముడై॥ 7

శా॥ ధూర్తారాతివిశాల వక్షతనవాతూల ప్రయుక్తోగ్రసం।
వర్తాభీలదవానలుండు గరివద్వక్షుండుఖండచ్ఛటా।
మార్తాండుండు ఘనుండు నీలుఁడును ప్రేమన్వచ్చెనందందనో।
యార్తత్రాణపరాయణా రఘుపతీయంచున్ మహోత్సాహుడై॥ 7

శా॥ ఉద్యత్సత్వతృణీకృతాధిక సమస్తోమాగ్రయ గ్రేసరుం
విద్యుత్సన్ని భలోచనుండు త్రిజగద్వి ఖ్యాతశీలుంబుదో।
స్సద్యస్సంజనితప్రతాపుండు శతాస్యచ్ఛేదనాభీలుయు।
ద్యుద్యోగంబుగ వచ్చె మైందుఁడు ముదం బొప్పందొరల్ మెచ్చఁగన్॥ 74

శా॥ గంధర్వామరకిన్నరాదులితఁడు ద్గాఢాహవోద్యద్గదా.
సంధానప్రబల ప్రవీణుండని యిచ్చున్ మెచ్చనుప్పొండిగ।
ర్వాంధుంబడ చ్ఛుతకంఠుజంపుటకు రౌద్రా రంభుడైవచ్చెస
ద్గంధాంగుండగుగంధమాదనుడు పేడ్కన్ రాఘువుంజూడఁగన్ 75

శా॥ వత్సారమ్మని నన్ను బిల్చి త్రిజగద్విఖ్యాత కల్పు నారక్షసుల్।
మాత్సర్యంబున గూల్చిరమ్మను రమానాధుండనట్లైనసే।
నుత్సాహంబునఁబోయి మెల్లన శతాస్యుంజంపి మెప్పింతునా।
హృత్సాకల్యతనంచు వచ్చెనటకున్ హేలన్ సుషేణుండొగిన్॥ 76

వ॥ మఱియునదియునుంగాక పేరెన్నికైనమహావానరులచటికి నరుగుదెంచినంగాంచి హర్షించి రాఘవుండును వారివారికిందగిన తెలుగుల భూషణంబులును కట్నంబులును. దోరహత్తుగానిచ్చి జాంబవంతాదుల కరుణా సముద్రంబున నొలలాడించి బహు విధంబుల నొక్క విశ్రమ స్థలంబుల విడి యనియమించి సుగ్రీవాంగదాదుల సాకేతపురంబుననుని చెఁరాక్షసవానరుబలంబులునురామునకు దేవతులొసంగిన వరంబునఁజేసియుండి తృష్ణాశనంబుల వలననిరపేక్షులైయుండిరి। అంత భరతశత్రుఘ్నులు గొల్చి కాంభోజాధీశుండగు నీలుండును కోసలాధీశ్వరుండగు భీముండు పాంచాల వరుండగు నీలకేశుండును ద్రవిణకర్తయగుసుధేష్ణుండును విదర్భపాలుండగు స్మితాస్యుండును। గౌళకర్ణాటవుళిందలాట కొంకణ టెంకణ మత్స్యగాంధారరాజులును ఁచ తురంగబలంబులు గొల్వ ద్వాదశాక్షౌహిణులతోనయోధ్యానగర ంబుడాసిన వారిని వేఱువేఱా దరించితగినవిడుదులనుండ నియమించి తానునుమరు వాఁడు విద్వత్క వివసిష్ఠ సకల పురోహితాశీర్వాదంబు వెసంగనుత్సవ బంది సూర్య సిద్ధాంతుల శుభముహూర్తంబులుతెలసి భేరి మృదంగఢం కాపణవశంఖనాదంబుల భోరుకలంగ భర తాది సోదరులును కుశలవాదిపుత్రులును విజయాది పౌత్రులును సుమంతాది మంత్రులును, విభీషణాది రాక్షసులును। హనుమంత సుగ్రీవజాంబవంతాది వానరభల్లూక ప్రభృతులును। సకల మనుజదను జవన చర సేనామధ్యంమున కరుగుదెంచియఖిలశాఖామృగంబులగావించి అయిదేసి వెల్వలకు నొక్కొక్క రాజునేర్పరింపవ లెనని కుముదగవాక్షనీలగవయ గంధమాదన గోముఖజ్యోతిర్ముఖమైందద్వివిదపన సరిషభశరభులను పన్నిద్దర పట్నంబు గట్టి దానికి నెల్ల యుద్ధసమయంము దెలుప జాంబవంతునిని యోగించియిందఱినింగాపాడు మని హనుమంతుని బ్రతిష్ఠించి తద్దినంబుగా కొండొకవెల్వ్యలంబురి గొల్వియమ్మహాపౌజులకు దండనాయకులకు సుగ్రీవునభిషిక్తుంచేసి పట్టంబుగట్టి యువరాజ్య పట్టంబునకం గదుం బాటించి యందఱునొక్క పౌజుగాఁ జేసియమ్మహామునులకు జుట్టును రాక్షసదశాక్షౌహిణులనాజ్ఞానించి సకల దేశాధిపచమూసముదయంబులనవలో కించి తద్బలంబుల మూఁడు బలంబులు గానేర్పరించి యమ్మూటికి భరత శత్రుఘ్నలక్ష్మణుల నధిపతులుగా సమకట్టి బాసటగా బుత్రపౌత్రాదులనిలిపి వారికిందోడుగా నుత్తమతురం గసహస్రంబుల నేర్చి దానికి ప్రాపుగాగంధదంతావళ సంఘంబులంబూన్చి వానికి సహాయము గారథసముదయంబులను నిలిపి వానికి గా వలిగాభటక దంబములనియమించి మఱియును. **77**

క॥ మానవవానరదానవ
సేనల నడిపింపనా సుషేణునికైజం
భానునిధైర్యస్థైర్యం
బానుని జాలించియతని తగమన్నించెన్॥ **78**

క॥ మన్నించి రాఘవేశ్వరు
డీన్నిదళంబులకు తత్తదధినాథులకున్
యెన్నబతిత్వము మీఱఁగ
పన్నుగ సురలలర పట్టభద్రుండయ్యెన్॥ 79

సీ॥ అమ్మ హారవలికి నాకాశమల్లాడె
బ్రహ్మాండ భాండంబు బ్రద్దలయ్యె
నమ్మహాభారమునహిరాజు నోర్వక
తలవంచు కొనెరసాతలమునందు।
నమ్మహాభీషణంబరసి మైనగముగో।
శివుఁడును జాలిగృశింపఁ దొణఁగె
నమ్మహాధాటికి నఖిలదిగ్గజములు
మొనదప్పి యొక్కొక్కమూల దాగె।

గీ॥ కాలమరయుచునుండె పంకజభవుండు।
తలఁకియప్పుడు మృత్యువు తల్లడిల్లె
వారినిధువెల్లపిండివిపండులయ్యె
నస్తగిరిశృంగమునవ్రాలెనణఁగి యినుఁడు॥ 80

సీ॥ ఉర్వీశ్వరుఁడుకా లోచితకృత్యముల్
సవిపిసంగరమహోత్సాహమునను।
పంతంబు తోజాంబవంతుని రప్పించి
యాతనివలన ప్రతాపలంక
కరిగెడు మార్గంబును, నమ్మార్గనగల।
మహిమంబులును హనుమంతు తెఱఁగు
నతనిలావున చతురబ్ధిలంఘనమొన
రింపవచ్చుటయును సొంపుమీఱ।

గీ॥ తెలసి యమ్మగడువిడిదికి నిబనిచి।
తానునంతట సీతాగృహానకేఁగి।
యచటఁదమ్ములు దానును నారగించి
విడియములు జేసెయ సదృశ విభవముగను 81

వ॥ తదనంతరంబున తనగురుండగు వసిష్ఠునికావించియతండును దానును సహోదరులను శతకంఠుని ద్భణీకరించివన చరవ్యూహమహిమ సామగ్రియు రాక్షసబల పరాక్రమంబులును పంచదశదేశాధీశ ప్రతాపంబులు నెలరాణింపుచునుండు సమయంబున సీతామహాదేవి తన జీవితేశ్వరుండ గురఘునాయకుల కరుణారసంబులుజిల్క కడకంటనవలోకించి మృదుమధుర వచనముల నిట్లనియె। **82**

సీ॥ ప్రాణవల్లభమున్ను పంక్తికంధరుతోడ
బోరునప్పటి భవద్భూరి బాహు।
బలపరాక్రమమును బాణసంధానచా।
తురియును తదుపసంహారణములును
రధగతిక్రమము సారధి చమత్కృతియును।
ఉత్తర ప్రత్యుత్తరోన్నతియును।
కడువిచిత్రముగాను కపులు చెప్పఁగవిని।
నరనాథచంద్రనే నాఁటగోలె।

గీ॥ చూడఁగాఁగోరి మఱొక రక్షోగణేంద్రు॥
డెప్పుడు దయించు నోయని యెదురు జూతు।
కామ్యమెల్లను ఫలియించె కలిగె నేఁడు।
మీజయముగాంతునను కొని యాజికరుగు॥ **83**

ఉ॥ పూని శతాస్యునిన్ యముని పోలికమీఱును సంగరంబులో।
నేనుఁగుతోడనే నుఁగు మృగేంద్రముతోడ మృగేంద్ర ముందవో।
గ్రానలుతోడనుగ్ర నలునద్రియునద్రియు డోయుకైవడిన్।
సేనలతోడఁ బోరెడి విశేషము జూచెదచిత్తగింపవే॥ **84**

చ॥ అనవరతంబుశోభనగృహంబునకుం మఘమాచరించుతా।
వునకును సద్వ్రతంబులను పొందుగసల్పెడి సీమకున్ శ్రుతుల్।
వినఁజను చోటి కింసకల విశ్వభయప్రదయుద్ధభూమికిన్।
వనితలతోడఁగూడి చనెవచ్చుటెఱుంగ వెప్రాణనాయకా। **85**

చ॥ అనవిని రాఘవుండు హృదయంబున నద్భుతమంది చూచియీ
వనజదళాక్షికీకలహవాంఛజనించుట కేమి హేతువో।
వినుమును యెన్న డిట్టి యవివేకపు యాత్రకు సమ్మతింపది
ట్లను కొననేలదైవ కృతమంతయుఁ దప్పు నెయన్నిభంగులన్॥ **86**

వ॥ అనియిట్లు డోలాయమానమానసుండై నిజాంగనంగాంచినత దీయశరీరజని తతేజోవి శేషంము మధ్యాహ్నమార్తాండమండలంబు ధిక్కరించి సకల బ్రహ్మాండంబులు బిక్కటిల్ల తనకన్ను గవలకు మిరుమిట్లు గొలుపఁదలయూచియిట్టి సహాయమున శతకంఠునిందృణలీల సాధింపవచ్చు నని వెండియు జానకి నిజాకారంబు వీక్షించి లోకంబునంగల్గరా జకుమారికాజనంబులట్లు గాభావింపుచుమనుజ వేషుండుగావున నమ్మహామహిమంబుదె లియనల విగాక భరతశత్రు ఘ్నులక్ష్మణుల మొగంబుజూచి।వారునవ్వ సిష్టుండును వినుచుండ సీతామహాదేవికిట్లనియె॥ **87**

సీ॥ చిలుకపలుకులకు బిట్టులుకు కోమవిదు।
   ర్వీధరణార్భటములు వినఁగఁగలవె।
 యెదురెవ్వరాడిన మదిగుందు సుగుణవు।
   ప్రత్యర్థి భాషలుపడగఁగలవె।
 వెన్నెల కాకవెఱచెటియబలవు।
   త్యుగ్రబాణాగ్ని కోర్వఁగలవె।
 స్ఫటికపు సోపానపంక్తులనొంటిమై
   నిల్వగు రథముపై నిల్వఁగలవె

గీ॥ ఏలపలికి తివీబుద్ధియెట్లు బుట్టె
 కలహగతులేల నీవేడగమనమేడ
 శతుముఖుని జంపివాని దేశమునగల్గు।
 వస్తువులు నీకుగొనివత్తు వలవదుడుగు॥ **88**

సీ॥ ఆరూఢమధురవీణారవంబులుగావు
   ప్రతిభటాఖిలహుంకృతులు గాని।
 కల్యాణ సమయసత్కార వ్రజముగాదు
   భయద రాక్షస కదంబములు గాని
 కొలఁది వాసించుఁగుంకుమగంధములు గావు
   మఱి రక్త జంబాలమయముగాని।
 పర్యంక మల్లి కా ప్రసవమార్గముగాదు।
   చండభల్ల ప్రపంచంబుగాని।

తలఁపసుఖ కేళిగాదుయుద్ధంబుగాని
మఱియుటలు గావు ఘనరణమృత్యుగాని
నాదిమున్నిట్లు జనిమోసఁబోతిగాదె
రావే కూడదు వికచనాళీకనయన॥ 89

నావిని తనమాట నాథుఁడను గ్రహిం
చుటలేకయున్ననించు కతలంకి
బాష్పారుణితనేత్ర పద్మియైయెట్లన
పాదాగ్రమునునేల వ్రాయు కొనుచు
పతిమోముజూచుచు పలుక చొప్పరి దివ్య
చేలాంచలముగండసీమ నొత్తి।
పలుకు దునోయని పలికిన దనుమళ్ళ
పలుకు నోపలుకఁడోయలు కననుచు
భయము భక్తియు నుద్దండ భండనప్ర
వాంఛయుఁదన హృదయమున cబెనఁగి
యా వశిష్ఠుడు మరుదులు నతిముదమున
వినగ గ్రమ్మఱc బలికె నవ్విభుని తోడ 90

ధరణి నాయక వినవయ్యతావకీయ।
మహితభుజ పర్వతంబుల మరువునందు।
నిలచిచూచెద పోరమీనేర్పునేను
సమరయాత్రకు భంగంబు సలుపఁదగునె॥ 91

అనిమఱియు ననేక ప్రకారంబు జనవరుని మనస్సురం జిల్లంజేసిపదంబులంబడిన లేవంబట్టి
ువరుండు నిజగురు ముఖోవలోకనంబు గావించి యిందులకెయ్యది తెలుంగన్న తత్సకల విద్యాగరిష్ఠుండగు
ష్ఠుండు నిజ తపోమహిమంబు వలనన నాగత భవిష్యద్వర్తమానంబులెఱుంగు గావున। జానకీ ప్రభావంబు
ుసి యమ్మహాశక్తివలన శతకంఠువురణంబును రాముని జయంబును నిశ్చయంబు జేసి
కాతంబుననిట్లనియె। 92

రామ మీరామగోరెడి రాకకనుమ।
తించనుమావధూటి యేతెంచినపుడె
యమ్మహామూర్తి వలన శతాస్యుండీల్గు।
జయము చేకూరు మీకును సత్యముగను।

మ॥ అదియెట్లన్నత దీయ దైత్య వరుఁగో యబ్జాసనుంగూర్చిసొం।
పొదవం ఘోర తపంబుజేసి మఱిబాగొప్పంగ మేప్పించిసా।
రదయాశాంత విచారనాకుపురుషప్రాయంబు చేజావులే।
కదనౌ సత్కృ పనిమ్మటంచు వరముల్ ఆలతంగై కొనెన్॥ **94**

ఉ॥ కాననభేద్యుఁడైన శతకంఠుడు జానకి చేనణుంగునౌ।
గాని మఱొక్క రార్యులను గైకొనబంగన చేతఁజర్చుటన్।
మానవనాధ సిద్ధమదిమావచనంబులు గల్లఁగావు మీ।
రానలినాక్షిదోడు కొని యాహవభూమికిc బోవుటొప్పగున్॥ **95**

సీ॥ ఏదేవి దాస దాసీజనుల్పరికింప
వేధసదాశివవిష్ణుసతులు।
అవనియేతరుణిని వాశిపల్లెరములు।
బంధురకై రవపద్మహితులు
ఏయమ్మ బోనపుటిళ్లనc జెలువందు।
దలఁపోయఁగాసప్త జలనిధులును।
ఏమహాశక్తికి నెల్లపంకేజభ
వాండభాండంబులు నాటుపట్టు।

గీ॥ ఒనరసేయింతి యూర్పులను దయమ్మైం।
మూఁడు మూర్తులకును జగన్మాలమెద్ది।
యప్పరంజ్యోతి సీతగానా త్మఁదలఁచి।
కేవలాంగనఁగాఁజూడ కీవున్నృపతి॥ **96**

వ॥ ఈపరమ రహస్యము బాహ్యంబుగాకుండ నీచిత్తమందు నునిచి సీతాసమేతుండవై యుద్ధంబున కరుగు శతకంఠునిం బరిమార్చి గొబ్బున మరలి రమ్మని దీవించి వెండియునిట్లనియె॥ **97**

గీ॥ అంత భగిని యెల్లిదినాంతమైన
దనకుమిత్రుంబు భితలమధ్యమున గదియు।
శత్రుయాత్ర కునప్పుడె చనఁగవలయు।
మనసురంజిల్లు మాకును జనవరేణ్య॥ **98**

గీ॥ ఆర్తరక్షకయిట్టి ముహూర్తమందు।
గదివిశతకంఠుఁబరి మార్పకదనమునను।
అస్త్ర శస్త్రాదిపతుల నీయాత్మఁ దలంపు।
సేనలెల్లను బురి గొల్పు మానవేంద్ర॥ 99

వ॥ అనినవిని రామచంద్రుండును సాంద్రత రాశ్చర్యమానసుండై జానకీ ప్రయాణంబునకు సమ్మతించి సంభ్రమింపుచుండెరి వసిష్ఠుండును గృహంబున కరిగె। తమ్ములును మిత్రులును దమదమ విడుదులకుంజని। రఘునాయకుండును సుఖనిద్రం జెందెనంతనుషః కాలంబునమంగళ పాఠకులేగు దెంచివీణానాదంబుల నింపు సొంపుగా భూపాళిదేశాక్షి దేవగాంధారి నారాయణివసంతాదిరాగంబుల నను రాగంబులు గావించివాని మిత్రులునయంబులు కాలంబులును. అలఘుమఘుడోలాది తానంబులును అపురవళారవసంపూర్ణంబులును తెలిపియి ట్లనిరి॥ 100

సీ॥ సమరత లోత్సాహజయగుణసందోహ।
మేఘకోమల దేహమేలుకొనుము।
మునిజనవన చైత్ర వనరుహదళనేత్ర
మిత్ర వంశపవిత్రమేలు కొనుము।
దళిత శంకర చాపకాలిత జయాటోప।
మృదు భాషణకలాప మేలు కొనుము।
వితత శుభాచారమను తారాడ్గజవార।
మృగనాయకీశోరమేలు కొనుము।

గీ॥ యనుచురావణ కుంభకర్ణాది దైత్య
సంహారస్తవగీతముల్ సలుపనలరి।
భానువంశుండు తమ ముఖపద్మమలర।
మేలు దెఱుంగుల మెల్లన మేలుకొనియె॥ 101

శా॥ ఈరీతిందగమేలు గాంచివసుధాదీశుంబుగా లోచితా।
చారంబుల్గడ తేర్చి భూసురనమస్కారంబుల జేసిత్ర
త్కారుణ్యంబున దీవనల్ గొనుచుసంగ్రామ ప్రయత్నంబునన్।
భూరి ప్రస్ఫురితత్కిరీటమచటుంబూనెంముదంబొప్పఁగన్॥ 102

చెన్నల రకిరీటమపుడు జిగిమించుచుశుం।
భన్నిలపర్వత శిఖర।
సన్నిహితమహార్కు-బోలె చర్చింపంగన్॥

వ॥ అదియునుంగా కమఱియుననేక విచిత్రమణి భూషణపరం పరలు ధరించినంగనుంగొని సీతామః తనపతివ్రతా ధర్మంబు భూషణంములు గాని కొండలంకారంబులుంగల వేయని సమరప్రఁ ప్రయత్నంబుననుండెనంత॥

గీ॥ గరిమతోదేవ భూదేవగమినుతింప।
యవ్వసిష్ఠుంబు నిదిసమయంబనంగ।
పరఁగ రాక్షసలోక గర్భములు పగల।
నపుడు పరిపించె జైత్ర ప్రయాణభేరి॥

## మహాస్రగ్ధర

అదరెన్ బ్రహ్మాంబ భాండం బరుదుగకలకంబయ్యె సప్తాంబురాశుల్।
చెదరన్ నక్షత్ర పంక్తుల్ జిగిబిగి పరమేష్ఠింభయంబదెనాత్మన్।
బెదరెన్ దిగ్దోనదంతుల్ బిరబిరదిరిగెన్భీషణం బైకులాద్రుల్।
వదవెన్ కాలుండు జీవ వ్రజముల గెడవన్ వాటమ్మైదో చెనంచున్। 1

క॥ తదనంతరమున రాఘువు
డొదవినమోహమున శుభముహూర్తముతోడన్।
సుదతియుఁదానునుగడునె।
మ్మదిజేసిరితల్లులకును సంస్మరణంబుల్॥ 1

క॥ చేసిన కొడుకును కోడలి।
కోసల రాజేంద్రసతుల కుశలతమెఱుగన్।
భాసిల్లుచుదీవింపఁగ
నాసుదతుల వీడుకొని గయంబున వెడలెన్॥ 1

క॥ భరత శత్రుఘ్ను లక్ష్మణు
లరుదు గ దీవింప వెడలి రగ్రజుతోడన్।
కరమొప్పపుత్రపౌత్రులు।
నరిగిరిమఱి యధికసత్సురాధిపులనఁగన్। 1

వ॥ ఇవ్విధంబున బుత్రపౌత్ర నివహంబును సకల బంధుని వహంబును తనతోడన డవసంత్తఃపురం బుదానభి జిత్తు లగ్నంబునందు వెడలి సువుంతాదివుంత్రుల యోధ్యానగరంబు పరిపాలనంబు సేయనియోగించి పురమధ్యంబున॥ **110**

సీ॥ శ్రీరస్తు! భూపాలశేఖరాయని సర్వ
 గీర్వాణంగణములా శీర్వదింప।
శుభమస్తు! సౌజన్య చూడామణియటంచు।
 విప్రవర్గంబులు దీవింపు చుండు।
నెలమి సమస్త గ్రహైకాదశస్థాన
 ఫలదశస్తని జ్యోతిషులు జెలఁగ।
నభ్యుదయ పరం పరాభివృద్ధి గవీశ్వ
 రులుగవిత్వ లక్షణములు దెలుప।

గీ॥ కాంతలభ్రంక షోజ్వల కలిత భర్మ
హర్మ్యరమ్యాగ్రములనెక్కి యలరుకొనుచు
నగుచు దూర్వాక్షత ప్రసూనములు చల్ల
పూర్ణ కుంభ ద్వయములు బొగడ గనుచు **111**

ఉ॥ హాటక కేతనంబులు, జయప్రద షోడశరత్నచక్రముల్,
కోటి మహోగ్రఘంటలును ఘోరశరాసన బాణతూణముల్
హాటకమైన సారధియు, నద్భుత వర్మభయంకరస్ఫుర
ద్ఫోట సహస్రముల్ గలయ కుంఠిత దివ్యరథంబుగన్గొనెన్ **112**

చ॥ కనుగొని ఘంటి కావణవకాహళ భేరిమృదంగ నాదముల్
వనధిపరీతభూస్థలి నవక్రత నిండుచు భోరుగొల్పగాఁ
తనగురుఁడా వశిష్ఠుఁడు ముదంబున మున్నెయను గ్రహింపగా
యినకులనాథుఁడెక్కె తనయింతియు దాను సురాలి మెచ్చగన్ **113**

గీ॥ రాజదేవేంద్రుఁడైన యారాఘవుండు
రథము మీహదను జూపట్టెరమణితోడ।
త్రిపురములు గూల్చిన సదృశ తేజముననుం।
గౌరితోఁగూడి చ నెడి శ్రీకంఠుకరణి॥ ఆ సమయంబున॥ **114**

శా॥ మేఘాభాంగుఁడుకార్యవేది దళితామిత్రుండు యుద్ధక్రియా।
శ్లాఘా యుక్తుఁడు సత్కృపాకరుఁడు సౌజన్యుండు బ్రహ్మాండభాం।
డాఘాత ప్రతి మాన తీక్ష్ణత రోద్యద్బాణుండాఘోషుడా।
మోఘావిష్టుండు భరతుదాను వెడలెన్ మెహాముదంబొప్పగన్॥ 115

శా॥ సుత్రామప్రతిమానవైభవ సుఖస్తోముండు భాస్వన్మహా।
గాత్రుండాశుగ పూర్ణతూరణధరుఁడుగ్ర ద్వేషి సంహారుఁడా।
క్షాత్రప్రాభవుండ ప్రతిద్వయుడు సంగ్రామ ప్రచండుండుతఁ
చ్ఛత్రు ఘ్నుండును వేఁడుకన్ వెడలెనిచ్చన్ రాముఁడు పొంగఁగన్॥ 116

మ॥ పుడమిట్టట్టు చలింప దిక్కరిజయంబుల్ మొగ్గ నొక్కుమ్మడిన్।
జలధివ్రాతము లింకభీషణధనుర్జా ఘోషగావింపుచున్।
పిడుగుల్ వోలిన బాణముల్ గల్గియాభీల ప్రతాపంబుతో।
వెడలెన్ లక్ష్మణుఁడల్లనల్లన సురల్ వేఁడ్కన్ దనుంజూడఁగన్॥ 117

సీ॥ తమతండ్రుల ట్టుల తమకంబు శౌర్యంబు
గలిగి వర్థిల్లిన ఘనులువీరు।
వాల్మీకి దత్తదుర్వార బాణక్షయా।
శరములు గలిగిన జయులు వీరు ।
సీతావధూగర్భ స్థిరతరజాతమై
మహిమీఁదఁగను పట్టుమణులు వీరు।
శతకంఠవరచ మూసముదయంబుల జంప।
దొణఁగిన యట్టి మృత్యువులు వీరు।

గీ॥ జూడుఁడని నిర్జరులుగడుచోద్యమంది।
తల్లిదండ్రులు ముగమొందదానదంతి ।
యుగముపై నెక్కి వెడలి రత్యుగ్రులగుచు।
కుశుఁడు లవుఁడును రిపుగజాం కుశములనఁగ॥ 118

గీ॥ తాతరాముండుముదమంద దండ్రి కుశుడు।
గారవంబున శలవుల గారనవ్వ।
డంబు గలయట్టి యుత్తమాశ్వంబునెక్కి।
వెడలెవిజయుంబు రౌద్రుడై మృడునికరణి॥ 119

వ॥ ఇవ్విధంబున రాజ పరమేశ్వరుండును పరమేశ్వరకాంతాస్మరణ కారణశరీరప్రకాశుండును ప్రకాశిత నిర్జితకోటి సూర్యుడును సూర్యస్తవ భుజగపరాక్రముండును నగురామచంద్రుండును సాంద్రకళామహింబున పూర్ణమా చంద్రుని ధిక్కరింపుచు। సకల సన్నాహంబున పట్టణ మధ్యంబున గదులు నడుపుకో మల నీలమేఘంబుముందట నొడుపు భాస్వత్తటిల్లతయునుంబోలెచెలంగు చున్నజాన కీదేవినిరీక్షించి మించినమోదంబులనప్పురంధ్రీజనంబులు గుంపులు గూడియొండొరుల మొగంబులుంగనుంగొనుచునిట్లనిరి॥ **120**

గీ॥ మధ్యమము గేసరికి నందెమధ్యమంబు
పిరుదుపులినంబునకు గట్టు బిరదు చూడ।
పదములంబుజములకు నాస్పదములయ్యె।
రామసౌందర్యవిభవాభిరామగాదె॥ **121**

గీ॥ లోచనాభ్యస్తనద్వయాలోలమధ్య
కైతవంబు వశింపుచుగవిత సింహ।
కుంభయుగ్మధనుర్మీనకులము లిపుడు।
కన్యయందుండు టాశ్చర్యకరముగాదె॥ **122**

వ॥ ఇట్లు పురసతులభినుతింప రామచంద్రుండు నిద్ర సంభ్రమంబునకు బ్రొద్దుగ్రుంకునంతకు సాకేత పట్టణ ప్రాకారద్వారంబులు గడచి కరదీపికా సహస్రంబులతో రాక్షసవనచరమనుజ సేనా మధ్యమున విడిసె భరత శత్రుఘ్నులక్ష్మణుకుశలవా ధ్యనుజతనయులును । విజయాది పౌత్రులను ౘతన చుట్టు రావిడిసి వారిచుట్టుగోద్వా శీక్షాహిణులలో దేశాధిపులుడిరి। వారికి రక్షకుండైన సుగ్రీవుండు డెబ్బది రెండు వెల్వతోఁబరివేష్టించియుండె తద్బలంబులకు వలయాకారంబుగా విభీషణుండు దన సేనలతో ద్వార ప్రదేశంబున మృత్యువునుంబోలి కణంగి యుండె సఖిల జనంబులును తమ తమనెలవులకుంజనిరి। అవ్వేళభేరి మృదంగాది తూర్యఘోషంబులును। ఉభయ బలసింహనాదంబులును। సమస్తహయహేషారవంబులును। గంధసింధుర బృంహితధ్వానంబులును రథనేమి నిష్ఠురస్వానంబులును । భల్లూకఘుర్ఘురధ్వనులును। కార్ముకగుణటంకారంబులును। పుంఖానుపుంఖంబులై యెక్కు పెట్టున నఖిల బ్రహ్మాండ కోటరంబులు ఘుమఘుమాయమానంబులుగా నిండి నిలయకాలంబుననబడ బానలముఖంబు నమలికి మొరబెట్టు సప్తార్ణవంబుల ననుకరించె నదిప్రళయసమయంబున బోలెవిభీషణప్రగల్భంబై। అంజనవర్తనంబున న్సోలెశత్రుఘ్నుప్రశస్తంబై। రథనాట్యంబునుంబోలెభరతకలింతబై। పవిత్ర స్థలంబును బోలె కుశాభిరామంబై। భారతరణంబునుబోలె విజయాకరప్రసిద్ధంబైసరోవరంబునుం బోలెనీలకుముద సంశోభితంబై। శృంగారవినంబునుంబోలె సకల రాజ్యకరంబై। సంచయంబైతదనందరంబ॥ **123**

సీ॥ పలువిడి దమ్ములనలరింపరసికుండు।
మూఁడు మూర్తుల కునుమూలదుంప।
ఘనుచేన ర్ఘ్యముల్ గొనెడె మహాత్ముండు
నెట్టు గోదీప్తుల పుట్టినిల్లు
యెన్నంగ సమవర్తి కన్నజగత్కర్త।
చక్ర రక్షణములుసల్పురాజు।
సతతప్రసన్న దీక్షాగుణోధ్యక్షుండు।
విప్రనమస్కరణ ప్రియుండు।

గీ॥ శ్రీరఘూద్వాహు నిజవంశకారణుండు।
భూజనంబులమనఁ జేయు పుణ్యమూర్తి
నిరుపమధ్వాంత శుష్కవనీదవాగ్ని।
యర్కుఁడు దయించెనరుణ సంపర్కుడగుచు॥ **124**

వ॥ అంతకుమున్నె రామభద్రుండు సంధ్యాదిక్రియలు దీర్చి గంధమాల్యా భరణ దివ్యాంబరంబులు ధరియించి విభీషణసుగ్రీవాంగ దీహనుమత్ప్రభృతులరావించిఁ వారివారికిందగినకట్నంబులును భూషణంబులును ముదంబుననొసంగి యిగ్గార్గేయ ముహూర్తంబున సేనల నియోగింపుఁడనిసుషేణుంబిలిచి మన్నించి మార్గంబును పనియమించి తనతమ్ముల నవలోకించి కుశలనవిజయులును మీరును సకలనృపులును గదలింపు డనిన నమస్కరించి తమతమబలంబులకు జాటింపవారును కరవాలవుసలముద్గర ప్రాసత్రిశూలగండ గదా పరిఘచిండి వాలకఠోర కుఠార బాణంబులగైకొని నీలనలహరి సంపాతియవక్ర జిహ్వాశూలముఖరక్తవదనల్ కపాదకుటిల కేశులఖిల మహాగర్వవికృత పార్శ్వాదుల గు రాక్షసులునుగ వయ గంధమాదన గోముఖ పనసనీలాం గద వేగదర్శిగవాక్షమైందద్వివి దజాంబవంతాదికపినాయకులును నీల యవనపృధు. సంహారణప్రదీప్తభరతత్రిభంగభీమనీలకేశసుధీష్టస్మితాస్య ప్రముఖనిఖిల దేశాధీశ్వరులును గజహయాందోళికస్యందన బృదంబులనెక్కి తమవెంట చతురంగ బలంబులు గొలువఛత్ర చామరాదినానాలాంఛనంబులు మెఱయ భేరీ మృదంగ శంఖ పటహవాద్యానేకంబులు మెఱయనేలయినిన నతెరంగున భూమియందును వియత్తలంబునందును పర్వతంబులయందును తటాకంబులయందును దిక్కులయందునుబట్టజాలక యేబదియోజనంబులపొడవుననిరంతరంబు గోనఖల దళంబులునడవజొచ్చె భరతశత్రుఘ్నులక్ష్మణ కుశలవవిజయాదులును సుగ్రీవ విభీషణాదులును అరువది సహస్రంబులతో రామ భద్రుని బరి వేష్టించి యుండి రంత. **125**

సీ॥ ముఖమూర్ధ్వలోకాంతమునఁగలయజువక్ర।
మునను న్నచెవియతోముచ్చటాడు।
హస్తములో ప్రాకృశ్చినమాచలంబులతోడ
నెయ్యంబుమీఱంగ వియ్య మొంద।
నాభీల వాలాగ్ర ధ్రువమండలసీమ।
తోడ నందంద చెల్మిసేయ।
శాతరోమావళుల్ సరభసలీలన।
క్షత్రపంక్తు లకు బెజ్జములు సేయ।

గీ॥ పృథుశరీరంబు జగములు పిక్కటిల్ల
తనదుతేజము నకుమృత్యువ తల్లడిల్ల।
హుంకరించిన కులగిరులులికి పడగ।
పొంచి హనుమంతుఁడప్పుడే తెంచినిలచె॥ 126

గీ॥ ఘోరవాలంబుదలఁ పోయమేరువయ్యె।
భూరి తారావళుల్ మొలపూసలయ్యె।
కమలినీనాయకుఁడు బొడ్డుఘంటయయ్యె।
ననుచు రాఘవునకుఁదోచెనట్టి వేళ॥

గీ॥ తోచిన తన చిత్తంబు దొంగలింప
గాడ్పుపట్టిని నిండారగౌఁగలించి
చెలఁగి సేనలనొ కదరి జేర్పనీవె।
యనుచునమ్మిన వాఁడను ననిలతనయ। 128

గీ॥ అనుచుసీతయు దాను నొయ్యానరథంబు।
కరుణనెక్కిన గనితురంగములవిడిచి।
దేవతలు పుష్పముల్ తినిరికురియ।
తనశిరోమధ్యమున దాల్చె తద్రథంబు॥ 129

వ॥ మఱియు భరత లక్ష్మణశత్రుఘ్నకుశలవాది పుత్రులును పౌత్రులును కర్ణసుతుండును। మిత్రులతని భుజములందునువీపునందుండిరి యందందనిలచి॥ 130

ఉ॥ డంబుగసేనలందఱువిడంబము మీఱఁగ రోమరోమకూ।
పంబుననెక్కి నిల్చి యును మగ్గమిచాడ్పుననెక్కి నిక్కుచుం।
బంపిన వేడ్కనుండిరి శుభస్ఫుట భాషల సన్నుతింపుచుం
నంబరచారునెల్లను జయంబుగనిచ్చిరి దీవనల్ వెసన్ 131

వ॥ ఇట్లు భీలవాలగంభీరదోస్తంభవిజృంభమాణమానసుండైహనుమంతుండు గొనిజనియె। భేరిమృదంగ కాహళంబులు మొరసి రాముండు గ్రహంబులలోఁ బ్రకాశించు భాస్కరబింబమును బోలె సకల సేనలతోఁదేజరిల్లుచు। రవిప్రవాకునంతకు తమసానదీతీరంబు విడిసిమరు నాఁడచ్చట విడిసి మరునాఁడచ్చటవీడ్కొని సుషేణుంబు ముందరనతడు వక్రమ క్రమంబున మహావనంబులును వనతటాకంబులును బర్వతంబులును దేశంబులును గడచిత్రిజగద్భయంకరంబుగాలవణ సముద్రాభిముఖుండై రాఁదొణంగెనంతనక్కడ ప్రతాపలంకేశ్వరుండగు శతకంఠుండు మఱియు సకలపురోహితామాత్యబాంధవ లోకంబులు గొలువనిఖిలా మరదిశారమణ సముదయంబులు గొలువ నభ్రంకష సింహాసనంబునం బేరోలగంబుండు సమయంబున॥ 132

క॥ చారులుదిగనర్గళసం।
చారులునిజనాథహితవిచారులు స్వకులో।
చారులు రయములుమీఱఁగ
నారయఁగానే గుదెంచి రపుడయ్యెడకున్॥ 133

క॥ అరుదెంచి రాక్షసేంద్రుని
చరణంబులు గాంచి మ్రొక్కి సయ్యనుచితం।
బెఱిఁగి సభయెల్లవినఁగను
సరగునదానిట్లులనిరిశతముఖుతోడన్॥ 134

క॥ అయ్యా మీపంపునమే।
మయ్యాతావులకు నేగియచ్చటి వార్తల్
నెయ్యమున నరయు చుండఁగ।
నయ్యనవిపరీత మైన చందముబొడమెన్॥ 135

క॥ రావణునిదునిమినట్టిమ।
హావీరుండగణితంబులగు బలములతో।
దేవతలు సంత సిల్లఁగ
మీవలనందాడి వెడలెమేదిని యదరన్॥ 136

క॥ మున్నిటి కవులును జెప్పఁగ
విన్నారము వాటికన్న విస్తారముగా।
నున్నవిబలములు నొకఁడొక ॥
డన్నిజగంబులను మ్రింగున లిగిన కణంకన్। 137

క॥ పేరుగొనియిస్కనైనను
తారావలినైనను పరుషధారలనైన్।
తోరమునసెన్నఁదగుగో
కారాముని బలమ లెన్న నవిదుర్లభముల్। 138

క॥ అందుల బొదలుచు మారుత
నందనుఁడనువాఁడు మేరునగమును బోలెన్।
సందడిగఁబెఱింగి సేనల।
నందరినిటయెత్తు కొనిమృత్యువైయదెవచ్చెన్॥ 139

క॥ చెప్పిన దేవరమనసున
యప్పలుకులు కోపమొదవుననిమఱియైనన్।
చెప్పకయుండక ఁదగదిక
నప్పవనజునెదుర నోపరమరులుసహగన్॥ 140

క॥ అటువంటి వారుమీపై
నిటువచ్చెటిశూరునెల్లనెవ్వరితోడన్।
కటుకటుఁబోరఁగఁదగుమీ
కెటువలెమఱి దోచెనొక్కొ యెఱుఁగముదేవా॥ 141

క॥ ఎవ్వరికిని కనుపడవేను
నవ్వీరులన రయుచుండ నపుడొక కపితా।
క్రొవ్వున నార్చుచు నొకగిరి
చవ్వున పెకలించి యొడిచే చూర్ణముగాఁగన్। 142

క॥ వానికి నీ కోటులునీ
దానవులును తృణముగా ఁగఁదలచితిమెట్లో।
కాని యశక్యపుకార్యము
గానంబడెనదివరింపఁగా నెత్తెఱగో॥ 143

క॥ యుదగ్రుడై యాసేనకు
సుగ్రీవుండనెడువాఁడు సొరదిగమీతో।
విగ్రహము సేయ బొదలుచు
నుగ్రునికై వడిపతిత్వమొప్పుగఁ బూనెన్। 144

ఉ॥ ఇట్టి బలంబుతోడఁబర మేశ్వరునైనను ధిక్కరింపుచున్।
నెట్టన రాఘుండనెడు నిష్ఠురవిక్రము డెన్నిరీతులన్।
గట్టుతుదంజెలంగు హరికైవడినాహనుమంత మీఁదటన్।
ఘట్టి గనెక్కి వచ్చెనవకంబుక తమ్ములు దన్నుగొల్వఁగన్॥ 145

ఉ॥ వారి లో లక్ష్మణుండనెడు వాఁడు ధనుర్గుణనై పుణిన్ మహో।
దారత మినున్నముట్టి వివిధస్ఫుట భల్లన పరంబుతో।
ఘోరతరాహవంబునను గూల్తు శతాస్యునటంచు నన్నతో।
సారెకుఁ జెప్పుచున్ యముని చందమునంగను పట్టెనయ్యెడన్॥ 146

శా॥ శౌర్య ప్రాభవమేర్పడంభరతుఁడున్ శత్రుఘ్నుడున్ మిమ్ములన్।
ధైర్యంబొప్పఁగ దల్చిమండుచు వివాద ప్రౌఢి బాణాసనా।
చార్యుల్ వీరని దేవతల్ పొగడఁగా సంభ్రమ్ములుంజేయదా।
మార్యత్వమ్ములు బూని రాఁదొణఁగి రత్యంత ప్రతాపంబునన్॥ 147

ఉ॥ రాముని నందనుల్పటు పరాక్రమవంతులు దైవవంతుసం।
గ్రామజయజ్ఞులు గ్రరి పుఖండన శీలురసేక సాయక।
స్తోమవిశాల తూణగణశోభిత బాహులు తండ్రి గొల్చుచో।
నాము కవచ్చి రక్కు శలవాఖ్యులు దానవవంశవర్ధనా। 148

ఉ॥ భీషణ శౌర్యుఁడైనునవిభీషణఁడు నృపు గొల్చిమిమ్ములం।
దూషణ సేయుచుంగణఁకతో నసురావలిదన్ను గొల్వదు।
ర్భాషలమర్మకర్మములు పాయక దెల్పుచునంత కంతకుం।
రోష మువీర్చుచుం విలయరుద్రునికూ వడి వచ్చెనందులన్॥ 149

చ॥ అదియటునుండనిమ్మొక మహాద్భుతమౌ రఘురాముముందటన్।
నవజలదంబు చెంగట కనంబడుతీఁగె మెఱుంగురంగునన్।
సవివయలీల నెన్న దగిజానకీ పేరటు నొప్పుకాంతదా।
దివిరిని జేశు తోడ నరుదెంచుచునున్నది రాక్షసేశ్వరా॥ 150

ఉ॥ అనును గొప్పునాసుమహితాస్య ధగద్ధగలాశ్రుతి ద్వయం।
బానగవాపెడందనయనాబ్జ ధళద్ధళ వాసునాసికం।
బానడు మావళిత్రయము నక్కుశదేశనిగన్నిగక్రమం।
బానడలాలల్గాటు చయమౌర సదాశివదానికే తగున్॥ 151

వ॥ అని మఱియుననేక ప్రకారంబులనెఱింగించిన శతకంఠుడున్ కోపారుణితలోచనుఁడైకను సన్నయెఱింగించిన పనులు సలుపు దిశారమణులనవలోకంచి ॥ 152

సీ॥ పని చెదరంభమీ పావికిననవిని।
బలభేది బొమ్మని శలవుజేసె।
పచనంబు చేసితి బాకయత్నములెల్ల
ననన‌గ్ని కను సన్ననపుడు వీచె।
రావదేమిటికింత కావరమాయని।
మొగిదిట్టియ మునికి మొక్కలిచ్చి।
సొంపార తన మనస్సుకు వచ్చినైరృతి
వరుణుని బొమ్మని కరుణబుచ్చి।

గీ। కొలువు కుటంబులూడ్చితి కోరిచూడు।
బంపుదన విని పవనునిబనిచి రత్న।
రాసులంపిన నరకాధి రాజుమెచ్చి।
ఒనర నీ శాను నొక మూల నొదఁగఁజేసె॥ 153

గీ॥ కొలువు చాలించి రాక్షసకుల వరేణ్యు।
డందఱిని వారిదిశుల కనిచిపేచి।
యంతిపుర సౌధమధ్య సింహాసనమున।
సరగ గూర్చుండి పడవాళ్లఁబని చెనపుడు॥ 154

వ॥ తన ప్రధానులఁబిలువబంపవారలును దగినవాహనంబులనెక్కి వచ్చి ద్వార ప్రదేశంబునడిగ్గి దనుజలవల్లభునకు వేఱువే ప్రణమిల్లి యుచితసింహాసనంబులం గూర్చుండినం గనియిట్లనియె ॥ **155**

సీ॥ రాఘవుండును మహిరమణుండు నాతోడ
నాహారంబొనరింతున నుచు ననుజ।
దనుజ బాంధవులును తరుచరని చయంబు।
మీఱి యింతింతను మేర లేక।
వచ్చు చున్నాఁడటు వారినందఱి దానె।
హనుమంతుఁడను ధీరుఁడచటుఁదాల్చి।
యరుదెంచు చున్నవాఁడటు విభీషణుడును।
తెలియ మనమర్మముల్ దెలుపు కొనుచు।

గీ॥ వెలయున్నృప కపిరాక్షస బలముతోడ।
పూనియరుదెంచెనటుయేమి బుద్ధిమనకు।
చెపుదుమీ చెప్పినట్లనెనే యుఁవాఁడ।
ముట్ట వచ్చిన కార్యంబు మట్టుబడునె ॥ **156**

సీ॥ నావిని చిరునవ్వునవ్వుచు మంత్రులు
బలికిరి దానవ భర్తతోడ।
యుద్ధమెవ్వరితోడ నొదపునో యనుచుమా।
మనసు ననెప్పుడు మలయుచుండు।
కానిమ్ము జాపంబుకై కొనిపట్టుక
నరవానరాదుల నలిచివైచి
మీ వంశహీనుని మిత్రవాదిని నవ్వి
భీషణు మర్ధించి ప్రియమెలర్ప।

గీ॥ రాఘవుని దేవి జానకీ రమణిదెచ్చి।
కానుకిత్తు మునీకునక్క జముగాను।
మమ్మెఱుంగవె మృత్యువు గమ్మగలము।
సంగ రమ్మున కింత విచారమేల ॥ **157**

సీ॥ పెరికి తెత్తుమె శేషభీకర దంష్ట్రలు ।
పుడిసిలింతు మెమహాంబోధులెల్ల ।
పెడచేత నాక సంబెడ లించివైతుమె
పొడి పొడి యగుచును భూమిప్రాల ।
మ్రింగివత్తుమె పోయిమృత్యువునైన ।
కూలద్రోయుదుమె దిక్కుంభితతుల ।
బంధించి వత్తుమె పవనుని చలమున ।
పగలసేతు మెకల బపర్వతములు ।

గీ॥ తృణము మాత్రము రాముని తేజమెంత
వారి సైన్యంబు లనసెంత వారిదెచ్చు ।
మారుతన సెంత నందఱిబోరి గూల్ప ।
తమకు నిమిషముపట్టుదు దానవేంద్ర ॥ 158

వ॥ అనియిత్తెఱంగుల బ్రగల్భ వచనంబుల దనుజేంద్రుని మనసురింజిలజేసి మఱియును బెక్కు చందంబుల గదలుసా చుచు పరిఘంబులు ద్రిప్పుచు । ముసలంబు లూపుచుపరశువులెత్తుచు। తోమరంబులు జూపుచుఁ చాపంబులుంచుచు । గుణధ్వనిగా వింపుచు। శరంబువేర్చుచుఁ మిన్ను పగుల నార్చుచు ।నసేకరాక్షసులు సమరంబునకు నఱ్ఱోడుచు నిలచిన నచ్చెరు వంది తొమ్మిదియగడ్తలు చక్కంజేయించి రసాతలంబు ముట్టజలంబులు నిప్పించి ప్రాకారంబులు సవరించని యమించి సకల ద్వారంబులుఁగార్చిచ్చుబోలు దానవుల పదికోట్లునిచి మొగసాలనఱువదిలక్షల తోనుండుమని నీల కంతునినియోగించి కిన్నెరగంధర్వ సిద్ధ విద్యాధరగరుడ నిర్జరపన్నగాదులకే నభేద్యంబుగావించి కొలువు చాలించిప్రధానులనందఱినింబనిచితా నును తన తల్లియగు చిత్రగంధపాలికింజని తద్వృత్తాంతంబం తయుని యోగించి యిట్లనియె ॥ 159

ఉ॥ వచ్చెడి వాఁడుమర్త్యుఁడటవాని కిందోడటఁ కోతి వారొగిన్ ।
వచ్చిచతుస్సముద్రముల వార్యతదారట దాటియీడకుం ।
చెచ్చెరసే గుదెంతురట సేనలు దామును ఘోరమైనకా ।
ర్చిచ్చు పయింబడన్ శలభ సేనగణంగిన యట్లు కాదటే ॥ 160

చ॥ అదియునుగాక పంక్తిగళుఁడో రఘురాముని దేవిదెచ్చియు ।
తుదిసుఖవృత్తి లేకమఱిద్రుంగెరఘూద్వహుఁడిప్పుడుందగన్ ।
సుదతిని గూడివచ్చెనట చోద్యముగాననటు గానవానిపె ।
ల్లదరఁగఁబట్టి జంపి సీతను గొందుచు శాశ్వతంబుగన్ ॥ 161

చ॥ అన వినిభీతినొంది తన యాత్మజుగన్గొని చిత్రగంధియి।
ట్లను నకటా తనూభవదురాత్ములకై వడినిట్టి వాక్యముల్।
కాని కరమింత లేకపలుకందగునా రఘురాముభార్యనీ।
జనని సుమయ్యు యన్యసతి చాడ్పునఁజూడకు నెన్నిభంగులన్॥ **162**

ఉ॥ రాముఁడుమోక్ష కర్తయట రాముని దేవిరమా వధూటియా।
రాముజె నంకగాదెమన రావణముఖ్య నిశాటు లెల్లసం।
గ్రామమునందుఁగూలు టపరామర్శింపుము మర్త్యమాత్రుఁడై।
భూమిని బుట్టెగాని రఘుపుంగవుడాదిని విష్ణుఁడేసుమీ॥ **163**

వ॥ అని మఱియు ననేక విధంబులనతండవ తారంబులు సల్పమహిమంబులును తక్కిన పరాక్రమంబులును సీతయాది పరాజ్యోతి యగుటయును తదీయసామర్థ్యంబును ఎఱింగించి వెండియునిట్లనియె॥ **164**

గీ॥ ఘనుని రాముని మానవుగా దలంప।
వల పదాతఁడు పూనినవార్థులెంత।
కోటుల ననెంత నీవను మాటలెంత।
నతనికి దియెల్ల నడ్డ మేయకటయకట॥ **165**

గీ॥ వెలయునజు వరములకు గర్వింపవలదు।
నట్టి బ్రహ్మనుబుట్టించెన తఁడెయితఁడు।
నట్లుగావున నిమ్మహుండ లిగెసేని।
పద్మజుని వరములెందుకు పనికిరావు॥ **166**

వ॥ అదియు నుంగాక వరంబులను కూలంబైనను నీవు విరించిగోరు నప్పుడు పురుషలచే చావులేకుండ నడిగిలెవి గాని సతులదలంపనే రవైతియదియెప్పుడు నా హృదయంబున దవివియుండు రాముండు సీతాసమేతుండై రుగుదెంచు కారణంబే మకోయెఱుంగ రాదా యమ్మహామాయగాని సామాన్య మానవకామిని గాదీకలహంబుమాని యప్పురాణ పరుషుండగు రామచంద్రునకెదురు గాఁజనిశరణు జొచ్చిబ్రతుకుట మహాకర్తవ్యంబుని బెక్కుదెరంబగులందెలు పరొగికి పథ్యంబు రుచియింపని తెఱంగున నమ్మాటలుచెవిని సోకక చూ తమెట్టైననేమి భయంబున దిగ్గన లేచి సమర ప్రయత్నంబున నుండె। రామభద్రుండును నక్షత్ర నిచయంబునడుమల చెలు వారు పూర్ణిమ చంద్రుని ధిక్కరింపుచు సకల సేనామధ్యంబున రాదాణంగెనని వినుపింప పార్వతీ దేవి మహాద్భుతంబునుంబొంది యట మీఁది వృత్తాంతచేమయ్యెనని తననిజేశుండగు మహాదేవునిం బ్రార్థించుచుండెనంత॥ **167**

ఉ॥ శ్రీసితికంఠ పాదసర సీరుహషట్పద దీన రక్షణా
భ్యాసమహానుభావదరహాసము ఖాంబుజ సత్య భాషణో।
ల్లాస కవీంద్ర సన్నుతి విలాస సమంచిత కీర్తివాస నా
వాసితదివ్యదేహ గుణవర్ధన భోగయ రాజ్య భూవరా ॥ **168**

తోటకవృత్తము
జయ భూ సుర సన్నుత సత్కరుణా
జయ శాత్రవసంచయసంహరణా।
జయ బంధుమ నోంబుజ షత్కరణా।
జయ భోగయ భూవరసంచరణా ॥ **169**

గద్య॥ ఇది శ్రీమద్వేదాద్రిపురనివాస శ్రీరంగ చరణసరసీరుహ భ్రమరాయమాణ పొబ్బాల గోత్ర పవిత్ర చిన్నారెడ్డి పుత్రభోగయనృపాలనిజాశ్రితలింగ సుకవిప్రణీతంబైన సీతావిజయంబను మహాప్రబంధంబు నందు ద్వితీయాశ్వాసము సంపూర్ణము.

# మూడవ యాశ్వాసము

గీ॥ శ్రీకరణకార! రాజ్యలక్ష్మీ విహార
హారగోక్షీర హీరనీహార తార
తారకాధీశ తార భూధర తుషార!
సారకీర్తి శాల! భోగయనృపాలా! 1

వ॥ అవధరింపుమట్టి చందాన పార్వతీదేవికి మహాదేవుండిట్లనియె॥ అట్లు సకల గుణాభిరాముండును ఏపుణీయ గుణశ్యాముండును। సమాధిశ్రుతిసంపన్నుండును ॥ ఆపన్నకల్ప మహీజాతుండును, మహీజాధి నాథుండును నగు రఘు వల్లభుండును హనుమచ్చి రోమధ్యంబున సకల సేనాసమన్వితుండై వచ్చి వచ్చి ॥2

మహాస్రగ్ధర
కనియెన్ రామక్షితీ శాగ్రణియచట మహోత్కంఠ దీపింపచండ।
ఘన సర్పగ్రాహ నక్రోగ్రక మకవిలుటుద్గాఢ పాఠీన కల్లో ॥
లనట శైవాల భాస్వల్లా సదళిత సుకల్హార రాజీవషండో।
త్కన దుగ్ధోతాన సద్రుక్క చబక ముఖకాంతార భద్రున్ సముద్రున్॥ 3

గీ॥ అలరియారీ తిగను గొనియనుజ తనుజ
దనుజమను జాధి వనచరత తులుగొలువ।
నఖిలవాద్యధ్వనులు మిన్నల దరఁజేయ।
రాఘువుఁడు వచ్చె లవణవా రాశికడకు ॥ 4

వ॥ ఇట్లు రామభద్రుండు లవణ సముద్రతీరంబు దొరంబుసేర మారు తనందనుండు సంతుష్టాంతః కరణుండై తన శిరోభాగంబున వీపున దేహంబున రాఘవ సీతాదుల విభీషణ సుగ్రీవ ప్రముఖుల నందఱుండించి రఘువరునకు ప్రదక్షిణముగావించి నమస్కరించిపురోభాగంబున కరములు మొగిడ్చియున్న మరున్నందను నవలోకించి తన నయనంబుల కరుణారస హర్షములు దొరుగ సరసమధుర వచనంబుల నిట్లనియె ॥ 5

గీ॥ అన్న పవన జనీమహాత్మ్యున్న తంపు।
పెంపుసొంపిక యెట్లును తింపవచ్చు।
యేమొసంగిన దీరదుయీారుణంబు।
అనుచు దీవించె శుభవాక్యములనపుడు ॥ 6

సీ॥ సీతయు తన విభుచెవిసోఁక హనుమంతు।
నెలమిమై వీక్షించియిట్టు లనియె।
నవ్వేళ రావణుఁడట్లు వనంబున
కరిగి దైత్యస్త్రీల గాపుపెట్టి।
బాధగా వింపమ త్పతిబాయునని దుఃఖాన।
వ్రాలితి దేహంబు మఱచి భువిని।
ప్రాణంబు వాయువెల్వడు సమయంబున
నరుదెంచి రాముజయంబు జెప్పి।

గీ॥ జీవములు నిల్పిరక్కసు శీవిచెఱుచి।
పతిని గూర్చె దననిచాలఁ బ్రతినఁజేసి।
మరల నాయకునకు సేను మనుటఁజెప్పి।
యబ్ధిబంధించి సకల సైన్యములదెచ్చి॥ 7

గీ॥ శాత్రవుల నెల్లఁజంపించి జనవరేణ్యు।
చే విభీషణు కరుణింపఁ జేసి పిదప।
నన్ను నా విభుగూర్చితి వన్నయెచటు।
గన్ననీ వంటి బంధుండు గలఁడె మాకు॥ 8

చ॥ అన వినిమోదమంది మరుదాత్మజుఁడా నృపతిన్ ధరాసుతన్।
కనుగొని యేనుమీ మహిమకాదే తరించితి యెల్లభారమున్।
వినుతికి నెంత వాడన వివేకినీ మర్కటుండన్ మహాత్మమీ।
యను మతిజేసి యెట్టి పనులైనను సాధ్యముగాక తక్కనే॥ 9

ఉ॥ ఎల్లని విలింపవర్గములు, నెల్లని శాటులు, నెల్లరాజులున్।
ఎల్లవనే చరుల్ పొగడ యెల్లమునీంద్రులు సంతసింపఁగా।
నల్లన మీరుజూడ చతురబ్ధుల వాలము చాచియందుపై।
పెల్లుగ సేన లెల్లనడిపింతును లంకకు రాఘవేశ్వరా॥ 10

చ॥ అన విని రాముఁడిట్లని యెనద్భుత సంభ్రమముల్ పెనంగగా।
ననిలజనీవుగల్గ గనుల్కాంద గనేమి టికెల్ల సేనలం।
ఘనతతోచేర్పు మొక్క దరిగ్రక్కున నవ్వ లికార్యమెల్ల నే।
యొనరఁగఁజక్క బెట్టెదమ దుగ్రశరంబుల నాహవంబునన్॥ 11

ఉ॥ ఎవ్వఁడు విప్రవర్గమునకె గ్గొనరించున తండిహంబునన్।
దవ్వగుఁ జేయుకార్యము వృథాయగు మోక్షఫలంబు దూరమౌ
యెవ్వడు విప్రవర్గమునకెగ్గొనరింపడ తండిహంబునన్
మవ్వముగా సుఖించును గ్రమంబున మోక్షఫలంబులుంగనున్॥ 1

ఉ॥ కానమహీసు రావ లిక కారణమీశత కంఠుఁడెంచునౌ।
గాన జయంబులేదు మృతిగల్గుట సిద్ధము యన్నిభంగులన్।
మౌనిజ శిష్టరక్ష గరిమన్ మనకెప్పుడు గల్గుగావునన్।
దాననఁజేసి యుద్ధమున దప్పదుగెల్వహనూమ తాహ్వాయున్॥ 1

గీ॥ జాగుసెయ్యకు మికసురల్ సన్నుతింప।
బనుపు బలముల నెల్ల శుభస్యశీఘ్రు।
మనెడు వార్తలు నిజమని యాత్మనిలుపు।
ప్రతిన చేపట్టి కీర్తులుబడయుమన షు॥ 14

మ॥ అనినన్ జవ్వనమిన్నుముట్టి ధృతిమైనందంద లంఘించినా।
య్యనరామాంఘ్రి యుగంబునం బడి తదీయజ్ఞాతి శేషంబునన్।
తనపై నిర్జరులందఱున్ గుసుమముల్ దట్టంబుగాఁ గురియక్రొ।
వ్వునవార్చెన్ రవిపుత్రముఖ్యులు కపుల్ హోయంచు దీపింపఁగన్॥ 15

శా॥ దేహంబభ్రమునోఁకఁబెంచి యు సితవార్థిండాసిసైన్యావళుల్।
ఆహాకారము సేయరాఘవుఁడు నత్యాశ్చర్యముంబొందను।
త్సాహంబొప్పఁగ భూరివాలమపుడు ద్దామప్రతాపంబునన్।
బాహుల్ద్రిప్పుచుఁజూ చెవలణనిధిపై ప్రత్యర్థులుల్కంబెసన్॥ 16

వ॥ ఇవ్విధంబున బలవంతుండగు హనుమంతుండు దిగంతవిశ్రాంతయశః కాంతుండై కృతాంతు నిపోలికనంత కంతకు ధిక్కరింపుచుఁదన వాలంబులక్షయోజనంబులపొడవును యేబదివే లయోజనంబుల వెడల్పుంగలు గనిక్కించి కలశాబ్ధిపైఁబఱపి బ్రహ్మేమరేంద్రులును గరుడగంధర్వ యక్షరాక్షస కిన్నరకింపురుషసిద్ధ విద్యాధరబృందంబులందంద నవలోకింపుచునక్కజంబుగా బెక్కువిధంబులందీవింపగ దాహస్తుండైమేరున గంబుచందంబున దోరంబుగాఁ గదలక నిలచి చెలంగుచు నెల్ల దళంబులు గదలుండని పెద్దయెలంగు నంబలుక రామభద్రుండు మహాశ్చర్యంబున సీతమొగంబును లక్ష్మణునిదిక్కుజూచుచు ననేక తెరంగుల వినుతింపుచు సుగ్రీవ జాంబవత్సుషేణాదులు ముందటఁదోకపై నడుపుడమీశుండునుజానకీ సమేతుండై పుత్రపౌత్ర మిత్ర సహోదర ని చయంబు పరివేష్టించి యరుదేరయజయధ్వనులతో జనుచుండెఁ వెనుకొని సకల దళంబులును రాఁదొడంగెనా సమయంబున॥

17

సీ॥ వనధిలోపల గుభల్లున కొండలు రికినొ ।
యానజనిరటు వల్లు లాడుకొనుచు ।
గగన భాగమున నొక్కటు కొండలురుగుచో
మేటివేల్పులచేతమెప్పుగొనుచు ।
కుప్పించి దాటగాఁగోరికొండలుపెల్లు
లక్కింపఁదొణఁ గిరిళఘువు మెఱసి ।
పవనజువాలంబుపై కొండటేఁగిరి ।
పెక్కు చందంబుల నిక్కు కొనుచు ।
గీ॥ రథములును గంధకరులు తురంగతతులు ।
జంకలందులనిరి కినిశ్శంకతోడ ।
న తనిబొగడుచు నందందనాడు కొనుచు ।
నడువఁజొచ్చిరి కొండలందముగ నపుడు ॥ 17 ఎ
గీ॥ సీత కవ్వేళ రాముండు చెయ్యి సాచి ।
ఘన ఝుష గ్రాహకర్కటు కచ్ఛపముల ।
జూపుకొనుచును పేడ్కతోసుమహి తాండ
జాళినిష్ఠార కల కలంబచటు వినుచు ॥ 18
ఉ॥ ఈరీతింగపి సైన్యముల్ గొల్వగా నింపొంది సీతా వధూ ।
టీ రత్నంబును దమ్ములున్ దనయలున్ రీవింముదంబొప్పఁగా ।
శ్రీరాముండ సమాన విక్రమమునన్ శ్రీఘ్రంబు దాఁటివ్వలన్ ।
ధీరోదారతనిల్చి నిర్జరతతుల్ దీవింపఁగాఁ జెచ్చెరన్ ॥ 19
ఉ॥ చేరి రివాన రోత్తములు జేరి రిజాంబవ దాదిముఖ్యులున్ ।
జేరె విభీషణుండు తన సేనలతో సకల క్షితీంద్రులు ।
జేరిరి, ఘోటకంబులును సింధుర బృందయులున్ రథంబులున్
జేరె మరుత్తుడుండొకఁడు దక్క సమస్తదళంబులచ్చటన్ ॥ 20
మత్తకోకిల ।
మారుతాత్మజుఁడిట్టి రీతి సమస్త సేనల నొయ్యనన్ ।
భూరి వాలమీదంబంచి యపూర్వ విక్రమ శీలుఁడై
ధీరతన్ తన తోఁకమెల్లన దీసి పువ్వుల వానబ్బం
దారకుల్ గురియింప నిల్చె ముదంబునెక్కొననత్తఱిన్ ॥ 21

చ॥ రఘుపతి బంటఁజూడుడు పరాక్రము లారయటంచు ధీరసా।
రఘ నశరీరుఁడైన కపిరాయుండు చేరువనున్న కొండపై।
లఘుగతి నెక్కినిక్కికుతలంబు వణంకఁగ నార్చిదోర్బల।
ప్ర ఘటిత కీర్తి శాలియని భానుజముఖ్యులు సన్నుతింపఁగన్॥ 22

చ॥ నగు మొగమెత్తి భానునిజెనంకగఁదల్చి విశాలబాహువుల్।
తగ ఝుళిపించి యంఘ్రులు చితస్థితి గూడఁగఁబేరి కిఁజివ్వనన్।
నగము వణంకఁదూగి వదనంబు బిగింపుచు రామంద్రభూ।
రిగుణు దలంచిదాఁటెబలు రెక్కలు నొప్పను రాద్రికైవడిన్॥ 23

చ॥ అపుడు సమస్తలోకములు నల్లలనాడె భయంబుపెంపుచే।
నపుడు మహాజవంబు జగమంతయునిండెఁదలంచి చూడఁగా।
నపుడు పయోధులుంగ లఁగెనల్లన దేవతలాశతాననుం।
డపుడుయణం గునంచు ముదమందుచు నుండిరి మాటమాటికిన్ 24

ఉ॥ పావనియుంవసే చరులుబ్రస్తుతి సేయుచుఁదన్నెదుర్కొనం।
వావిరినేగుదెంచి తన వల్లభుఁడై నర ఘూద్వ హుంకృతిం।
గా వకులేంద్రుఁజూచి పొసఁగన్బ్రణమిల్లికరాబ్జ యుగ్మముల్।
తీవిగ ఫాలమందు లిఖియింపఁగఁజేయుచునిల్చె ముందటన్॥ 25

ఉ॥ అంతట రాముఁడుంబటు దయారసమొప్పఁగ పేడ్కనాహను।
మంతుని జోచియుం సుజనమండల చారువనీవ సంతుని।
వింతగ గౌఁగలించి కడుపే డుక దీవనలిచ్చి నాటికిం।
పంతముతోడనిల్చెద న పజ్జను సీత వెలుంగు చుండఁగన్॥ 26

వ॥ ఇవ్విధంబున రఘుకులేంద్రుండు సకల సేనాసమేతుండై నాటికచ్చట నిల్చి। మరునాడిక్షు సముద్రంబును మూడఁవ నాఁడు సురసముద్రంబును నాల్గవవాడుఘృత సముద్రంబును క్రమక్రమంబున హనుమదాభీల విశాల వాలంబుపైఁగడచి జానకి యుందానును పవనుసుతుని శిరోమధ్యంబునరథదంబుపైఁ దేజరిల్లుచు ప్రతాపలం కాలంకారప్రాకార కవాటపరిఘచమత్కార భర్మ ప్రాసాద గోపుర శాతకుంభగంభీర తోరణగంధగజతురంగభటబృందంబులగల విశేషంబులు జాచుచుయరుదెంచిన శతకంఠునిపు రంబుడాసికా హళమృదంగఢంకా ముఖబహువిధతూర్యనాదంబులు ఘోరుగలుఁగంగ మనుజదనుజశాఖామృగవా హినీసమూహంబులతో రఘునాయకుండు విడిసె। బలంబులు దగిన యెడల నుండిరి విభీషణసుగ్రీవాంగదముఖ్యులు రామునిచేరువ నుండిరి భరత శత్రుఘ్నులక్ష్మణ కుశల వాది విజయప్రముఖని ఖిలానుజపుత్ర పౌత్రులును సీతంబరి వేష్టించి రామునింగాంచి యుండిరి రఘువరుండును పట్టణంబు నెట్టనముట్టడి వేయనూహించి విభీషణాంగద సుగ్రీవ జాంబవన్మరునంద నాను జానుమతంబున॥ 27

దక్షిణ ద్వారామున నీవు దక్షిణేశు।
కరణివారణ బలమ సంఖ్యంబుగొలువ
మెండుకొనిపట్టు వదలక యుండుమనుచు
నం గదుని బనిచె నత్యద్భు తముగ॥ 28

వివిధభంగుల పడమటిగ వనియందు।
క్రూరభల్లూకములునూ ఋకోట్లు గొలువ।
నప్రమత్తుండవై యుండు మనుచు జాంబ।
వంతుని యమించెనట బలవంతుముగను॥ 29

అగచరోత్తములరయ నూర్బుదములు।
సేర్పుతో డనునిను గొల్వఁదూర్పు దిశకు।
చనుడి మీరని గోముఖ పనసరిషభ
శరభులను బంపెసంగరోత్సాహముననను॥ 30

అంతమిగిలిన సైన్యంబునంత నొక్క
మూఁకఁగా వించి వారినిమ్ముల నొసంగి
కదలు మనుచును శత్రువుల్ కలవశింపు।
నుత్తరంబున సుగ్రీవునుని చెనపుడు॥ 31

వరుస విభీషణుంగొలిచివచ్చినదైత్యుల కొమ్మ కొమ్మకొ
క్కరిబురి గొల్చి వారలను గావప్రధానులఁ జూపియెల్లభూ।
వరని వహంబులంబిలచి వాహినుల ల్పములైనచోటమీ।
రర యుచునుండుఁడీ యనుచునల్లనఁదానియమించెనెంచగన్॥ 32

అందఱనన్ని దిక్కులన యంబుగ సేర్పరరపంగణంకతో
కొందఱగడ్డబూల్చుచును కొందఱు కొమ్మలు గూలఁద్రయుచు
కొందఱు తత్కవాటములు కుంజరయూ ధమురీతిద్రోయుచున్।
కొందఱు గర్భముల్ పగులఁగ్రొవ్వున నార్చుచు నుండి రత్తఱిన్॥ 33

సీ॥ ఆసమయంబునన వనీశుఁడగు రామ
చంద్రుఁడల్లన విభీషణునిజూచి।
యమ్మహాకుశలుని యనుమతిగైకొని।
వంతుకెక్కిన హనుమంతుబిలిచి।
సేనల మమ్మును జేర్చితి యిచటనీ
కృపనెల్ల పనులు దిగ్విజమయ్యె।
ఇటమీఁది కార్యమే మెన్నిభంగులనైన
ఘటియంపఁజేయుదు కాండములను।

గీ॥ కానయింతటనా శతకరుబుద్ధి।
యెట్టిరీతి మెలంగునో య రుగరాదు।
రాయభారంబు తరుచర రాయనీవు।
ధీరతను జనియెంతయుఁ దెలియరాదె॥ 34

గీ॥ ఎల్లిపుష్యమి యాత్రకుని దిజయంబు।
రమణ నీపేరచంద్రతారాబలంబు
గరిగియున్నది గనిశత కంతుఁజోచి।
మమ్మునెఱిఁగించు సరియన రమ్ము పొమ్ము॥ 35

గీ॥ వనజ సంంభవుండొసంగిన వరములకును।
మది మదించకుమని బల్కుమఱి మదించి
పోరినాచేత దగ్ధులై పోయినట్టి
దశము ఖానేకదైత్యులఁద లఁపుమనుచు॥ 36

గీ॥ లీలఁబురుషులచేఁ జావులేకయుండ
బ్రహ్మఁగోరితినని వాఁడుఁబలికె నేని
మించి ఇచటికి సేనరుదెంచి నట్టి
రాక తలపోయు మను మయ్య యోకపీంద్ర॥ 37

గీ॥ వెఱచె సేనియు నిప్పుడే శరణు జొచ్చి
మనుట మేలని యెఱిఁగింపు వనచరేశ
శరణు చొచ్చిన వెనుక నాధరణి సురలఁ
జేయు దుండగములు మది జేర్పననుము 37ఎ

చనుమని పలికిన నలరుచు।
హనుమంతుఁడురి పుకృతాంతుఁడను పమవిద్యా
ధనవంతుఁడు బలవంతుఁడు
జనవల్లభు చరణపం కజములకు మెరగెన్॥ **38**

ఇవ్విధంబున నమస్కరించి యమ్మహాత్ముండు దీవింపనచట వీడ్కొని తన జనెడు మార్గంబుననున్న
వున కెఱింగించియును పవచ్చిన విభీషణు నునిచి సకల దానవ వన చరనిచయంబులు జయ
ధ్వనులుగా వింపనరిగి ద్వారనగరంబుల బలసియున్న మహాదానవులంబరికింపుచునదృశ్యశరీరుండై న
కారంబులుగడచి తనమహాకారంబు గొందఱుగని వెఱచెడి విధంబుజూచినవ్వుచున రయవచ్చిన
హుంకరింపుచు చనిచని పట్టణంబు వీక్షించునప్పుడు॥ **39**

అలరునప్పురి రమ్యహర్మ్యాగ్రశాత
కుంభి కుంభీ వ్రజంబుల కొమరుమిగిలి।
ప్రకటజాంబూనదాంభోజము కుళములను।
సరసమగు నట్టి మానవసరణివోలె॥ **40**

॥ ఇట్టి పట్టణంబునింద్రుని కైవడి।
నేలు చుండెనింతనితఁడు క్రొవ్వి।
ఘనతగల్గుటకున వినయంబుభూషణ
మదియు లేని జన్మహాని గాదె॥ **41**

అనిమఱియు శతకంధరునిందించి పోవు సమయంబున పట్టణమధ్యంబున మరకతనీల ప్రవాళమౌక్తిక
ార్య పుష్యరాగద్యనేక రత్నఖచిత। అభ్రంకష సింహాసనంబున నూఱుతలలును ఇన్నూఱు కరంములును।
ముట్టిన పొడవు నుంగలిగి గరుడ గంధర్వ సిద్ధవిద్యాధర కిన్నరకింపురుష దేవదానవోరగ అష్టదిశారమణ
శోభితంబులగు కనాటంబులు గాటంబుగా ద్రొక్కి నిక్కుచు చరలు వెట్టిన
నూదేవయోషాసముదయంబు కన్నులనశ్రులోలుక నుటకు దగిన చుండపనులు సల్పుచుండ
నులుందానును కొలువుపైఁ గూర్చున్నశతముఖనవలోకించి మహాద్భుతంబంది రావణునకు నితనికి
ంతరాంతరంబునని తలపోయుచు నవార్యధైర్యగాంభీర్య ధుర్యుండై. డాసి తదీయ సింహాసన
భాగంబున తనవాలంబు దివిసొఁక వీఁకజుట్టి తదగ్రంబున నమ్మహాదాన వేంద్రుని కంటె పొడవు
ూర్చుండిన యతని దారుణాకారంబు శతకంఠుండుగాంచి యాశ్చర్యంబున భిమానంబును గోపంబును
గొనంగజింతించియిట్లనియె॥ **42**

కారంబుల్ వెసదాఁటు టెట్లుమఱి వీకందాఁటి దుర్భీషణా।
కారంబొప్పఁగవచ్చు టెట్లుతగనల్కాం వచ్చినాముందటన్।
ధీరత్వంబున నిల్చు టెట్టు లివిచింతి ంపన్ మహాశ్చర్యముల్॥

శా॥ ఎవ్వండంపిన నిట్లు వచ్చితివి నీవెవ్వాఁడ వెవ్వానికిం।
మవ్వంబైయుదయించి నాఁడ విటకే మార్గంబునన్ వచ్చితీ।
వెవ్వండింతటి రూపొసంగె మఱిపేరేమంద్రు విన్పింపరా।
ఇవ్వీటంగల దానవుల్ కడునినున్ హింసింతురిట్టుండినన్॥

ఉ॥ ఎవ్వని గొల్తు వారఁడన నెవ్వఁడు దోర్బల మొప్పయుద్ధమం।
దెవ్వని గెల్చిది క్కతనికెకెక్కడ యిక్కడ యిక్కడికే గుదెంచెనో।
చవ్వన మత్ప్రతాపములు జూడఁగశూరునిన్నుబంపెనో।
యవ్విధమెల్లఁ జెప్పఁగదరాదివి జూచెదవింత గర్వమా॥

వ॥ అనినవిని మహాశూరుఁడగు మరుత్కుమారుండునిశ్శంకమానసం కజుండై ప్రతాపలంకారమణుఁ శతముఖునిరాకరింపుచునిట్లనియె।

గీ॥ ఓరిదను జాధముఁడ వినుమోరిరాము।
నప్రతిద్వంద్వ శౌర్యునాహవవినోదు।
పరమ ధార్మికు జానకీ ప్రాణనాథు।
త్రిభువనాధీశునధికులు దెలుపవినవే॥

గీ॥ ఎరగ వేరావణుశిరములు పదియును।
ధరణిపై గూల్చు ప్రతాప మహిమ।
ఎఱుగ వేకలని లోనలఘుబలోదీర్ణుని
నాకుంభకర్ణుంగీడణఁచు విధము
తలఁచెవెయింద్రజిద్దారుణాగ్నిని గూల్చు
భూరిదోర్థం డదంభోశిఘనదఁ।
దెలియవేలంకకుఁదివిరివిభీషణు
పట్టంబుగట్టి నపటువివేక॥

గీ॥ మట్టి శాత్రవ సంహారుండా రఘూద్వ
హుండె మాస్వామిన తనికి నూడిగములు
సేయుచుందు మునే మొదల్ జేసిపెక్కు
వనచరులము మహీసురావనచరులము॥ **48**

క॥ నాతండ్రి వాయుదేముడు
నాతల్లిని దల్చనంజ నాదేవిమదా
ఖాతంబును హనుమంతుడ
భూతల పతిగొల్లు జయముబొందెడి కొఱకై **49**

సీ॥ ఖ్యాతి కాగానేలంకరుగునప్పుడు నబ్ధి।
గనుగొని దాటితి కాల్వకరణి
వనమెల్లఁబెఱికి రావణుకుమారుని యకు
ధాత్రి గూర్చి తితృణ మాత్రమునను।
దశకంతుపుర మెల్ల దగ్ధంబు జేసితి
దివిజులో హాయని దివినుతింప।
బట్టి వచ్చివారి పట్టపురాజునై
పెలుచదండించితి పెక్కుగతుల।
గీ॥ మరలివచ్చుచు లంకిణియురముద్రొక్కి
జలధిలంఘించి జానకి జయముచెప్పి।
నట్టి సూరుండు నిప్పుడు నధిపనిన్ను
జూచి పోవచ్చి నాఁడరానీచ హృదయా॥ **50**

ఉ॥ వంచనలేక మోచుకొని వచ్చితి సేనల నెల్లవచ్చిదా।
టించితి నాల్గువార్ధులును తీవిగవాలము మీఁదవాఁడెయే।
తెంచెరఘూద్వహుండ తనిదేవియుఁదానును నిన్ను జంపఁగొ।
నెంచఁగనిక్కవంబుధర నెవ్వఁడుజూచు కొరోరిదుర్మతీ॥ **51**

చ॥ అనవినియప్పుడిట్లనెశతాస్యుఁడి దేమిరయోరిదూతనే।
మనజనదంచునున్నఁబలు మాఱును రాముఁడు గీముఁడంచున।
మ్మనుజ కులాధమున్ వినుతిమార్కొని జేసెదవిట్లు వాఁడుచే।
సినయవినాభటుండొకఁడెసేయునిమేషములోనఁజూచినన్॥ **52**

సీ॥ క్షుద్రమానవుజెప్పి సుకృతాత్ముండనుచుపె।
కృ్కలు వల్కెదవు వెఱ్ఱి కోతికాన।
యేధార్మికుండు రాయింతినితాటకి।
నణంచిపిన్నపు డెస్త్రీహత్యజేసె।
యొకప్రాతవిలువంచివికలంబుగావించి।
ఇలమహాదేవునకెగ్గుజేసె।
నాతికై నిష్కారణంబుగా నవ్వాలి
బడవేసె నత్యంత్ పాప మొదవ మొదవ
గీ॥ నట్టి కాంత జనాంతకునట్టిశైల।
జాధిపద్రోహినట్టి మహాఘచిత్తు।
చెప్పనేమున్నది కనీవు చేరినట్టి
వార్తనెఱింగింపఁగదరోరివదరువేల॥ 53

సీ॥ అనవిని మదినాగ్రహంబందిశతకంఠు
తోడనిట్లనెమరుత్సుంతుడు కదసి।
ఆది దేవుని దేవ తారాడ్యునననఘాత్ము।
శ్రీరాఘవునినిందఁజేసిరేని।
యాయువు గ్రుంగును యనుమానమింక లేదు।
దివిజులు చెలంగిరి తేజముగను।
యత్యంబునకు రావణాసురుండునురాము।
నిటువలె దూషించి యిలనుగూలె।
గీ॥ కాననీకును యెడలేదుకాలమింకను।
నరవరుని చేత నీమరణంబుని జము।
దురితవర్తిని దేవతాద్రోహివరయ।
నిన్నుగను గొన్న దోషంబునిష్ఠురాత్మ॥ 54

ఉ॥ నీవెటుబోయెదింక మఱినేర్పున నీకెఱుగింప నేలనీ।
తావిభుఁడెల్ల సేనలముదంబున ముట్టడి వేయఁబంచినన్।
ఈవిధితోడ నీ హృదయమెల్లనెఱింగిరయమ్మొరమ్మనన్।
నావలికార్యమెల్లవి శిఖావళిచక్కఁగ జేయుఁ బొమ్మనెన్॥ 55

గీ॥ పురుషవర్ణంబు చావుబొరయకుండ
వరముగైకొంటినని పౌరుషంబు వాలదు।
మించి జానకీతోడ నేతెంచినట్టి
రాకతల పోయుమని యెధరావరుండు। 56

గీ॥ ఎల్ల విధములనిన్ను వధించి కాని
పురికి నరుగుము కావున పొసఁగదనకు।
నమర భోగంబులన్నిచు ననుభవించు।
మనుచు నీతోడనెఱింగిపుమని యెనృపతి॥ 57

వ॥ అదియునుంగాక బంధుమిత్రుల నాదరింపుచునాశ్రితులకు నిల్లు చూరనిచ్చుచు పుత్ర పౌత్రులనలరింపుచు। నరోచికపరిహారంబు గాభుజియింపుచుని ఁకమూడు దినంబులు వసియించుమని యెఱింగింపుమనియె। వెనకనెడగలుగునేరదిన్ని భంగులఁదన ప్రాణంబరచేతులనునిచి సంగరమ్మున కరుదెమ్మని పలికి పిదప కరుణారససముద్రుండు గాననేరాగక్రమ్మరించి లచిశతముఖుండు నంగరంబునకు భయంబందె నేని శరణు జొచ్చినంగాతుననియెఱింగింపుమనియె। నత్తె రంగైననీవు జేసిన మునులబాధలు క్షమియించెద నని జెప్పుమనిపరచిన వచ్చితిని చటనిన్ను బురిగొల్పుతుచ్చు రాక్షసులనమ్మకుఁనతండు నారాయణుండాది మూర్తిగానినరుం గాడునన్నియ విచారించివైరంబువి సర్జించి శరణు జొచ్చిన బ్రతుకుము॥ ఈ పల్కులు నీమదిసహింపకయున్నయు రామచంద్రునివెంట జానకీ దేవిచనుదెంచు టెల్ల భవన్నాశంబునకు కారణంబు తదీయ ప్రభావంబు దెలపె దీవెన మీతల్లి చిత్రగం ధినడుగు మమ్మహా దేవిచేత నీవుద్రుంగుట సిద్ధంబని యనేక ప్రకారంబుల పలికిన నులికి పడి ప్రళయాగ్ని చందంబున మండుచు నూరు మొగంబులు ముడి వడఁ బెట్టుచు హనుమంతుని చంపనిశ్చయించి దూత ధర్మంబు విచారించియవ్వేళకునడమఱగి యాస్థానంబు నంగల మహాదానవులద్భుతంబున వినుచుండయిట్లనియె॥ 58

శా॥ ఓరీమర్కటు మద్భుజా బలము పెంపూనం గలజ్జించుచో।
బీరంబెల్లను విడిభృత్యుల గతింబృందారకుల్ గొల్వనా।
హారంబైన మనుష చెప్పియు భయంబందం దఁబుట్టించి నీ।
వారూ ఢిన్‌బహుభాషలాడెద వహా! ప్రాణంబులే యొల్లవో॥ 59

నడ రెడు కార్చిచ్చునుడు పనేర్చు ।
సమయంబు వచ్చిన జంఝూనిలమునైన
నెఱిమెదలఁగ నీకనిలుపనేర్తు ।
నాహవంబున జయంబను కూలము గమంత్ర ।
సిద్ధజపంబులు సేయనేర్తు
కడువేడ్క రథము లకరితు రంగంబుల
నడిపింపనేర్తునే నదియు మీఁద
గీ॥ ఇన్నియును గాకపరమేష్టి యిచ్చినట్టి
వరములున్న విజమునైన సరకు సేయ ।
నట్టియ సమాన బలశాలినైన నన్ను
జనకీ రాముఁడె దిరింపఁజాలఁగలడె ॥ 60
సీ॥ మద్భీమతర నామమహనీయ మంత్రంబు ।
సకల భూత గ్రహోచ్చాటనంబు
మద్బాహుదండంబు మత్తారిన్నృపకుమా ।
రాచలా ఖీలవజ్రాయుధంబు ।
మచ్చండ కోపంబు మానితబ్రహ్మాండ
భాండంబుల మనెల్ల ప్రళయ కరము ।
మన్మందహాసంబు మనసిజ కమలభ
వామరులకునెల్లనమృత వృష్టి ।
గీ॥ సకల లోకంబులకుఁ దానెచక్రవర్తి ।
యట్టినా యుద్ధతికి నిల్చియధముడైన
జనవరుండును నబలయుజానకియును
దరము గెల్చెదరనుట యద్భుతముగాదె॥ 61
ఉ॥ ఇన్నియుఁజెప్పనేల విను మీక్షణమందు ననిన్నుజంపి, రే ।
పున్నత వృత్తినేగి నృపునుక్కణఁగించి తదీయకోమవిం ।
పొన్నసుగంధి దెచ్చి బహుభోగపరంపరదేలుచుం సుఖం ।
బెన్ను గఁగందు దైత్యులు భళాయన సత్యము రోరివానరా ॥ 62

ఉ॥ చిక్కితి వెందు బోయెదవు చెచ్చర ద్రుంచెద నిన్ను రామునిన్
దిక్కిక నేది నీకనుచు తీవ్రరయంబున నాగ్రహింపుచున్
పెక్కు నిశాటకోటులను బిల్చి వనేచరు ద్రుంపుమన్నవా
రుక్కున నేగుదెంచి పటుహుంకృతి సేయుచు నుండనుగ్రుఁడై ॥ 63

ఉ॥ ఓరి శతాస్య ! నేను కడనొంటిగ చిక్కితినంచు పట్టఁగా
గోరితి జూడు చూడుమని గొబ్బున రాముని దల్చి వాయువున్
సౌరెకుఁజీవి వాలము విశాలముగా రవిసోఁకఁజూచి దు
ర్వారశరీరుఁడై పెరిగె భగ్గునమంటలు మోముజుట్టఁగన్ ॥ 64

చ॥ వెఱచిరి కొందఱల్తఱిని వీని మహాకృతిఁజూచి, కొందఱుం
బఱచిరి నందుసందులను, బల్విడి కొందఱు భీతిఁబోవలే
కఱచిరి, కొందఱప్పుడు శతాస్య ! మము గరుణింపు మంచుఁబె
ల్లఱచిరి యిట్టి రీతిఁగ డునాకుల మొందిరి దానవుల్వెసన్ ॥ 65

క॥ శతముఖుఁడును హనుమంతుని
మత మంతయుఁ జూచి భయము మల్లడిఁగొనఁగా
మతిన డలుచుండె తక్కిన
హితులును నిర్విణ్ణులైరి హృదయము లులుకన్ ॥ 66

మ॥ హనుమంతుండపుడు గ్రుఁడైదనుజలోకాధీశనీ పొట్టగ్రొ ।
వ్వునను బట్టఁగఁబూని తిప్పుడు మదింబువ్విళ్లు నీకేలయం ।
చును ఘోరాసినిబోలు ముష్టిహరియంచుంజూచి యద్ధానవేం ।
ద్రుని నేలంబడి గూలంగాఁ బొడిచెరుద్రుంబోలియుగ్రాకృతిన్ ॥ 67

గీ॥ ఇట్లుబొడిచినఁ బడితలవెల్లఁబగిలి ।
యంబరంబున నెత్తురు లుబ్బిపాఱ ।
నపుడు మూర్ఛిల్లన తనిసింహాసనంబు ।
చూర్ణము గదన్నె మనరులు చోద్యమంద ॥ 68

గీ॥ తన్నియంతటుఁబోక యద్దనుజవరుని ।
ద్రొక్కియున్నతలాటంబు ధూళితివి సి।
యేపుననుగొనియెప్పటి రూపుతోడ ।
నచటవీడొని రఘుపతి నాత్మఁదలఁచె ॥ 69

వ॥ ఇత్తెఱంగున రఘువరు చరణారవిందమకరందబిందు. పరంపరాస్వాదనేందిందురుండై మరునందనుండు తనకునెది రినదైత్యులంబరి మార్పుచు సింహనాదంబు సేయుచు। కపిసేనాభిముఖుండై వచ్చి వచ్చిపురోభాగంబున సకల దళంబులతో నున్న సుగ్రీవునింగాంచి యతనికి తనవృత్తాంబు జెప్పి సంభావనల గైకొనియచట వీడ్కొని సకల కపినాయకులుదన్నెదుర్కొనిగాఢాలిగనంబుగావింపఁ పెక్కు తెఱంగుల నభినందింపరయంబున నరుదెంచి యనుజత్రయ పుత్రమిత్ర పౌత్ర పరివేష్టితుండై జానకియుందానును దనరాకకెదురుజూచుచున్నగాంచి వందనంబులుగావించి యనేకవిధంబుల సన్నుతించి ప్రతాపలంకకుఁదానరరుగుట మొదలును శతకంఠుని తలలుపగులం బొడుచుట తుదయునుంగా నంతయునెఱింగించి రేపులగ్గకు దయసేయవలయుననిన హర్షించియక్కునం జేర్చిన సీతయుందా నను బహుంభంగుల దీవింపుచునుండె నంతనక్కడ॥ 70

క॥ దనుజేంద్రుఁడంత కంటెను
మునుపడదను మూర్ఛదెలసి మునుకొని సింహా
సనమును పొడియగుటకు నుం
దన దుతలాటంబు మోవదానికి నడలెన్॥ 71

క॥ అదరి తనయిరుగెలంకుల
నడరుచుఁగను పట్టుబలుని శాటుల హితులం।
గడు మంత్రుల నొగి మొగములు
ముడి వడఁగాఁ జూచి భయదముగ నిట్లనియెన్॥ 72

క॥ ఓయి సచివేంద్రులారా
మాయురెయిపుడొక్కకోతి మాత్రమెయిట్లుం
సేయఁగ నేమియు నిందఱు
సేయఁగ నేరైతి రేమిసేయుదు చెపుడో ॥ 73

క॥ ఏలాగునమ్మెదను మీ
రీలాగున బిరుకులగు చునిల్లుండిననే।
నేలాగు రాముదు నుముదు
ఏలాగున బంటులుగను నేలుదు సురలన్॥ 74

క॥ అని మనమున మునుకోపం
బును ఘనముగ, శోకంబు పెనగను చింతాం।
భోనిదినమును గుచునున్నయా
దనుజేంద్రుని మంత్రులెల్లతొడిబడకిను కన్॥ 75

క॥ ఏమప్పుడే మరినచో
నామర్క్షటుఁడేగెగా కయటు చూడుముత
ద్రాముని జంపి మరాతని
కోమలి గొనివచ్చి నీకు గొబ్బుననిత్తున్॥ 76

క॥ మాయట్టి మంత్రులుండఁగ
నీయదవ దయేలనీకు యిప్పుడెమమ్మన్।
బాయకపనుపుము యుద్ధము
సేయుదమ మరులుల్క నీదుచిత్తము రాగన్॥ 77

క॥ వనజజుఁడొసఁగిన వరములు
ఘనత విచారింపఁదగదెగదసిన నీకున్
వనచరులన నరవరులన
వినుతృణమాత్రంబుగా వేవివరింపంగన్॥ 78

క॥ సురలెల్లనీకు వెఱచుచు
సొరదిగసేవింతు రనఁగసురలుపనుపఁగా।
నరుదెంచు బేలరాముని
సరకుంగాఁగొనుగఁదగు నెసంగరధుర్యా॥ 79

క॥ దనుజేశనీవు గణఁగిన
కనుగొననామృత్యువైన కళవళపడునుం।
వనచరులనుగినచరులను
మనుజుడుగినుజుఁడు నుని న్నుమార్కొనఁగలరే॥ 80

క॥ అని మంత్రులు బహుతెఱఁగుల
తనమదిపురిగొల్పిన సురధవుఁడు మహారో।
షనయమనస్కుఁడైత
ద్దనుజలమన్నించిచని యెదల్లి యెదటికిన్॥ 81

క॥ చని తల్లికి సాష్టాంగము
వినయంబునఁజేయ పుత్రువిలసద్ఘనకాం।
తనిగాత్రువినుతమిత్రుని
కనుగొని దీవించి చిత్ర గంధినిట్లనియెన్॥ 82

గీ॥ అన్ననీమొగమదియే మివిన్ననగుచు।
నున్నదిప్పుడు నెన్నడు నుల్లమునను।
వంతఁ జెదవునేఁడి దివింతనొదవె।
నేమియెఱిఁగింపునాతోడ నెద్దియైన। 83

సీ॥ అలిగెనో యుష్మదహంకారములు జూచి
ఘుగ్రుండైయపుడు మృత్యుంజయుండు
మును లనేచితివనివనజసంభవుఁడొండె।
శపియించె నొకడు సాహసమున।
కింకరుల్ దానును శంకలేకకృతాంతు।
డురువడి దండెత్తె నొకణంగి।
వరశరణాగతవ్రసపంజరుఁడగు
రాముఁడే తెంచె నోభీమముగను।

గీ॥ వీఁక యెఱిగింపు విన్నయందాకఁదనకు
కడుపు లోపల చెయివెట్టి కలచినట్లు
యున్న దిప్పుడు నీమోము విన్నఁదనము
గన్నయప్పటి నుండి యక్కజముగాను ॥ 84

సీ॥ నావిని తచ్చుతాననుడు తల్లికి హను
మంతుఁడు వచ్చిన మార్గములును
వచ్చి రామునిఁజెప్పి వాదించు తెఱగును
వాదించి కనగి కగించువైఖరియునుఁ
బట్టంగ దైత్యులఁ బంపు వెట్టుటయును
పంపు లెట్టినవారు పదరుటయును
డంబుగాదనదు రూపంబుఁజూపుటయును
చూపి తన్నొక ముష్టి చూపుటయును ॥

గీ॥ తనదుసింహాసనము గూలదన్నుటయును।
పూనిబిరుదుతలాటంబు చోవుటయును।
మరలివనచరుఁడేఁగినమహిమములును।
చెప్పిననువిని తల్లి మూర్ఛిల్లుటయును॥ 85

వ॥ కొంత తడవున కుందెలసి॥ 86

గీ॥ యన్నశతముఖమీతం(డి యద్భుతంబు।
వార్తనారదు చెవిని వచ్చినన్ను
నాకెఱింగింపనెఱుఁగుదు నీకునట్టి।
గోప్యమంతయు వినుపింతుఁగోరివినుము॥ 87

వ॥ జ్యోతిర్మయమగు నొక్కమహాశక్తి చతుర్దశభువన నాయకియై ప్రవర్తింపుచుండి తస్వరూపంబగు నట్టి యోంకార రూపంమున । బ్రహ్మ విష్ణుమహేశ్వరుల నొదవించి జన్మపోషణ లయ కారులుగమ్మని నియోగించి వారలకు సుముఖంబులు గరుపుమని, తన కళలచేయ ముప్వురు గన్నియలఁ బుట్టించి యందు శాకదయను చెలియ నజునకుఁలక్ష్మి యనుతరుణి యచ్యుతునకుఁగౌరియను నారిశివునకుందయఁజేసి ప్రపంచంబున కనుపుచునందు. దనపూర్ణకళయగు లక్ష్మినిం బిలిచి యతిరహస్యంబుగా నిట్లనియె। త్రేతాయుగమున నీదు భర్త విష్ణుండుఁ రాముండై రావణవధార్థంబున కు నటింపఁగలండు తత్కాలంబుననీవును జనకునకుదయించి జానకీ నామంబున రాముతో మెలంగఁగలవు ।రావణునురణాంతంబున శతముఖుండన నొక్కరాక్షసుండు పురుషులచే చావువేకుండ బ్రహ్మచేవరంబులు గొని తరుణులతృణీకరించుఁ దన్నిమిత్తంబున రాముని వెంటనీవు చని యతనికిశక్యంబుగాని సమయంబున శస్త్రాస్త్రంబులు ధరియించియుద్ధంబు సేయు నట్టి యెడ నేవచ్చి నీయందు నావహించి నీచేత శతముఖునిం జంపించెదఁ జనుమని బల్కిన భవన్నాశంబునకు కారణంబగుచు సీతయననుదయించినది యని మఱియు నిట్లనియె॥ 88

సీ॥ సృష్టిపైవిష్ణుండు దుష్టని(గహమున
   కైరాముఁడై పుట్టె నమరులార
వలనొప్పనవ్విష్ణువక్షస్థలంబున
   జెన్నొందు శ్రీదేవి సీతయయ్యె।
సరవి నాతఁడు బూనుశంఖ చక్రంబులు।
   భరత శత్రుఘ్నులై పరఁగిరిప్పు॥
డాశౌరి పర్యంకమై యుండు శేషువు
   సౌమిత్రయన మించె జగతియందు। 89

గీ॥ కాన రాముండుమనుజుండు గాడుజూడ।
నతని గొల్చెటి కపునెల్ల నమరువరులు।
గాని శాఖామృగంబులుగావు నీవు।
వారితోడుత వైరంబువలవదుఁడుగు॥ 89

గీ॥ బ్రహ్మదేవుని వలన లోఁబడినయట్టి
బ్రహ్మనీతఁడు పుట్టించె పరఁగగాన
తనయ నామాటువినుము తథ్యంబుగాఁగ।
మించి తమతండ్రి పూన్కి తప్పించఁగలదె॥ 90

ఉ॥ కాన రాఘవు నెదురు శక్యంబు గాదు
తవిలి వారలపై విరోధంబు మాను
శరణు జొరుము రాత్రులఁజేర ఁబోకు
జగతి బెబ్బులి పైగోల సాఁపఁదగునె ॥ 91

సీ॥ అని రాము విక్రమంబతని తమ్ములలావు।
తనయుల విధమును తరణి సీత
మహిమంబులును హనుమంతుని తెఱంగును।
సుగ్రీవుఘనతతత్సుతుల గతియు।
బలముల చలమును నెఱుఁగరాకుంటయు।
పెలుచ విభీషణు భేధములును
తమనిజ శక్తియు ధర్మసంఘటనము
పాడియుఁ గీర్తిసంపాదనమును।

గీ॥ తెలిపియును బుజ్జగించియు బలువిధముల।
మనసు గలచియునీతిగోదనియు భయము।
లొదనఁ జేసియు బహుగతినూరడింప।
నాగ్రహింపుచునుడుగకయసురఁబలికె॥ 92

ఉ॥ రాముడు విష్ణుడంచును బరాక్రముడంచును యెన్నజూచితా
రాముఁడు విష్ణుఁడైన తనరామును రావణుడుగ్రుఁడైతగన్।
ప్రేమతొగొంచుఁ బోవఁగన భేద్య శరంబుల గూల రాదెయా।
రాముని చాపనైపుణి పరాక్రమముంగన వచ్చెనిందులన్॥ 93

చ॥ అనుచును విష్ణుఁడేఁడమను జాధిపుఁడేడది శ్రీవచోక్తినా।
మనసుకరంగఁబల్కిన కిమాత్రునకై భయమందనేర్తునే।
యను పమ యుద్ధమందసుర కానని మెచ్చనృపాలు జంపియా।
తనితరుణీలలామను సతంబుగఁగైకొని నెల్లకాలమున్॥ 94

చ॥ అనుచు ప్రధానులందొరలు నాప్తులు మంత్రులు నెక్కడెక్కడన్
ఘనముగ నుంచి మంచి పటుకాండపరం పర లేర్చిసాహసం
బున చతరంగముల్ బలసి పొంగుచునుండ గ రాముదల్చుచున్
కనలు చునుండె దండిశతకంఠుఁడు చండతరాగ్నికైవడిన్॥ **95**

శా॥ రాముండుంబటు బేరి కాహళమహారావంబుమీఱంగను।
ద్దామ స్థైర్యగుణాభిరాముఁడగు చుందర్పించి సైన్యంబులం।
వేమారుంబురి గొల్పిసారెకును మౌర్వీనాదముల్ వెల్లుఁగో।
ప్రేమంబిక్కటిలంగఁ జేసిది నరాట్పుత్రాదులన్ బిల్చుచున్॥ **96**

శా॥ లగ్గల్ పట్టుఁడు పొండుపొండ నిమహోల్లాసంబునంబంపఁగో।
నగ్గాఢధృతి మెండుగావిని మహోగ్రాకారువైకొమ్మలున్।
నేగ్గుల్ సేయ చునయ్యు గడ్తలును మిన్నుల్ ముట్టఁగో బూడ్పేచున్।
లగ్గల్ పట్టిరిదేవ సంఘములు చాలంబొంగి దీవింపఁగన్॥ **97**

చ॥ జడిగొనిపర్వతంబుల కుజంబులు దెచ్చినణంగి కోటలున్।
పొడిపొడి జేసియందుగల భూరిని శాచర కోటులంధరన్।
బడపిడికిళ్ల చేనడచి బాణపరంపరను గ్గుజేసి బల్।
విడి నివసే చరుల్దనుజ వీరులతో నని సేయఁబూనుచున్॥ **98**

వ॥ మఱియు ననేక ప్రకారంబులు సకల కపివరులున్నల గ్గయగ్గలంబునంబట్టుచుండ వారితోడనే విభీషణ సైన్యంబులు వనచరభల్లూక శార్దూల రూపంబులవడు పడిరి మనుజ బలంబులు నుదలపడిరి । యొక్కమొత్తంబున వలంబులన్నియుందల పడిపట్టణప్రాసాద తోరణకు డ్యాదులన మోఘ బాణంబులు పఱపి నేలంగల పుచుండిరి శత కంఠం నింబలంబులును యింతింతని గణిపంనలవిగా కుండగదసి పూర్వపశ్చిమ సముద్రంబుల తెఱంగున కోలాహలంబు జేయుచు పిడికిళ్లబొడుచుచుఁగ దలనడచుచు కఠినపాదంబులందన్నుచు దీర్ఘదంతంబుల గఱచుచు మోచేతులఁదాటించుచుఁ పలు విధంబులఁ చెనంగుచుఁగ జంబుల కుంభస్థలంబులు వగుల మోదుచు హయంబుల బడద్రవ్వుచు రధంబులు భగ్నంబులుగా వింపుచు రధికులంగూల్చుచు సారధులంద్రుంపుచు భటుల నందఱంద్రుంపుచు నపారయుద్ధంబుగావింపు చున్నందులకు సహింపక నగచరభల్లూక శార్దూలమనుజ బలంబులునాగునే లవిరింగిపారిక్రమ్మరపురికొని దైత్యుల మీఁద గవిసిఁ గదలుద్రుంచియు ముసలంబులు పొడిచేసియు చాపంబులు విరిచియు

నరచేతులంజరచియు గళంబుల ద్రొక్కియు నింగిముట్టనిక్కియు నఖంబుల జీరియు నలుకలు మీఱియు ప్రతి పక్షులందరియు వాలంబుల మొరవియు ముష్టిహతులంగువ్మియు వాలరోమంబుల జిమ్మియు గుల్మంబుల నడచియుఁకుంభి కుంభంబుల పగులబొడిచియు రథంబులనుగ్గుజేసియు రథికులంద్రోచియు సారథులంజంపియు శరంబులుందెంచియు పెక్కుచందంబులనుక్కు మెఱసి యక్కపి వీరులు పొర వారలంగ నిహర్షించి రామలక్ష్మణులును దనుజులపైనం దందనలఁగి యాజ్ఞేయసాయకంబుల బరపినగూలు నేనుంగులును యేనుంగులతోడనే వ్రాయు హయంబులును హయంబులతోడనే పొడియగు రథంబులును రథంబులతోడనే మరియు రథికులును రథికులంగని పొరలు సారథులును సారథుల దురవస్థచూచి తలంకు భటులను విరుగు విండ్లును నురుమగు శరంబులును । పరయలగు గదలును తునియలై పడిన ముసలంబులును । చిన్నాభిన్నంబులగు పట్టెసంబులును నుగ్గులగు ప్రాసంబులును తుత్తునుములైన శూలంబులను హయంబులతోడనే పొడియగు రథంబులను పడిన బిండివాలంబులను తన్ను కొనెడి దైత్యులును చచ్చిన వారిదాపున చచ్చినయట్లే కదలకయుండు రాక్షసులను మృతజీవులైన జీవులును జొత్తుపాపల వలెనెత్తుటంజొత్తిల్లు నిశాచరులును అవయవంబులు నేరుపడక తునసిన నక్తంచరులును శోణిత ప్రవాహంబులును ప్రవాహంబుల నీదులాడుభూత భేతాళ డాకినీ శాకినీగణంబులను గలిగియ్యైదహోరాత్రంబులు చరణతలఘట్టనో దూతధరాపరాగంబులు చంద్రి కారంబులు నేర్పరు పరాకుండంబోరి కపులు సింహనాదంబు జేసిన దేవతలు పుష్పవర్షంబులుగురియించి యంబరంబున నిల్చియాశ్చర్యంబునొందుచు చూచుండిరి, బ్రహ్మదేవుండును ప్రళయ సమయంబుగా బోలునని కాలంబు లెక్కింపుచు నుండె । ఏనును రజిత పర్వతగుహ్వారంబున నీతోడ గదల కయుంటినని చెప్పిన పార్వతీదేవి యాశ్చర్య మానసయై అటమీఁదనక్కలహంబేమయ్యె నని వినుచుండెనంత ॥ **99**

కII హతశేషులైన దానవు
లతిరయమునఁగ డుభయాత్ములైనల్దిశలన్ ।
గతిచెడ పఱచుచు భయమున
మతినడలుచుఁజనిరి కపులు మలయుచు నార్వన్ ॥ **100**

కII కిటకిట మనుచును మెయినె
త్తుటు దొప్పందోఁగిన పుడుడొత్రుపడంగా ।
కటకటయనుచును గుండెయు
తటు తటున దరంగ వివిధ దైన్యోతదోపన్ ॥ **101**

సీ॥ అదె వచ్చెనగ చరులదెడాసి రనుచును
గడు శరీరంబులు గంపమొదవ
నల్లడెకొల్లుఁగా భల్లూక తతిమించి
పొంచియున్నవటంచుఁబోక మరలి
మేదినీధరములు పాదపంబులు తమ।
మీఁద వచ్చెనటంచు మెలగి తొలఁగె।
వెందు వోపుదమిఁకనేది దిక్కనితమ।
చేష్టలు తలఁగి మూర్ఛిల్లి తెలసి।
గీ॥ పుడమి నాడాడచతికిల పడుచునప్పు।
టుప్పటికి వేచి నురుకుచునంత మెఱసి।
కొలువు లోపల గూర్చుండు ఘోరవిమత
లుంఠన ప్రాభవుని శతకంతు గనిరి॥ 102

శా॥ ఇమ్మాత్రిట్టింశత కంతుగాంచి మదిలోసేడ్పుంభయంబున్ దగన్।
గ్రమ్మం సాగిలిమ్రొక్కి యక్కపుల రౌద్రంబుట్లు వీక్షింపుచున్।
దిమ్ముల్ చేకొని పిల్చినా పలుక కెంతేఖిన్నులై సారెకున్।
దమ్ముంగావుమంటంచు నిల్చినను తద్దైత్యేంద్రుఁడాశ్చర్యుండై॥ 103

గీ॥ ఓరి దానవులార మీకుల్లముననను
నలుగనేటికి నాయంత నాథుఁడుండ
నేమి వృత్తాంతమంతయు నెఱుఁగఁజెప్పు।
డిప్పుడే చనివిధలింతు నెల్లరింపుల॥ 104

గీ॥ అనుచు పలుమారునుడువ దామంతఁగొంత
మాటపొందలెఱింగి యామరక యతని
కభిముఖంబులతో నిల్చియఖిలమంత్రి
వరులు విననిట్లు పల్కిరివారితోఁడ॥ 105

సీ॥ దనుజేంద్ర యేముమీ పనువున జనిలగ్గ।
పట్టిన వానర ప్రకరములతో
పెక్కు విధంబున నుక్కునపోరాడ
నెఱిదప్పియరి చేత మఱియుజరచి।
వెండియు బురికొని విపుల వాలంబుల।
జుట్టియు ముట్టియు నెట్టుకొనుచు।
కఱచియుఁజ ఱచియుకఠిన శిలంబుల
నడచియుబొడచియునలుక మెఱిసి।
గీ॥ యుండనంతటు ప్రళయకాలుండెపోలె।
రాఘవుండగ్ని బాణపరం పరముల।
గప్పినను మన సైన్యంబు గలఁగితలఁగి
పాఱిలేక నుదగ్గులైపడిరియచట॥ 106

సీ॥ స్తనిత భాషుడు చచ్చెశార్దూల వదనుండు
మడిసె రక్తాక్షుండు మహినిగూలె
గత జీవుండయ్యె పింగళనేత్రుండ వనిపై
గూలెనగ్ని ముఖుండు కుంజరాంగు।
డీల్గె కరాళుండు నిల గ్రుంగెకుటిలదం।
తుఁడు ధృతినొంది నిప్పుడమిగలసె।
చిత్రుండు కర్కశగాత్రుండు మొదలైన
బంటులు పీనుఁగ పెంటలైరి।
గీ॥ ఏము కొందఱ మిటకు నీకెఱుఁగఁ జెప్ప
చావున కుందప్పిరాగ నీజాడఁగంటి।
మసుర విలయంబు సమసి నకటమీకు
యేమిచెప్పుదు మహోగ్రార్తలేము నుడివి॥ 107

చ॥ అన వినియట్టి హాసము రయంబున దానొనరించి నెత్తందో
గినయనలంబు చాడ్పునను గెంటకమండి సమస్త లోకముల్।
మిను కొనిమ్రింగఁబూను బెను మృత్యు వురీతిని హుంకరింపుచుం।
తనదుప్రధానులన్ హితుల తప్పక గన్గొనివారి కిట్లనున్॥ 108

ఉ॥ వింటెరె మంత్రులార మనవీటి నిశాటులబట్టి కోతులన్।
కంటకమొప్పఁ జంపినృపకాంతుని రాముని నేలగల్పినా।
కంటక మెల్లఁ బాచికలకంఠిని పల్లవ పాణి జానకిన్।
వెంటనె తోడి తెండనుచు వేగమెబంపిన శౌర్యహీనులై॥ 109

చ॥ మడిసిరిదైత్యులంచునొగి మాత్రులు దానవనరావళిన్।
విడువక చంప వచ్చి కపినీరులనే మనువాఁడు నిప్పుడే।
తడయకపోయిరాఘువు నితమ్ములతోడు తజంపికోతులన్।
పొడవణఁగించి వత్తునికపూనికెగాదు బలంబుబంపనన్॥ 110

చ॥ కదలుఁడు నాసహాయమున గంధ గజాశ్వరథాదులేర్పడన్।
వదలకశత్రులందు నిమివత్తుము వచ్చి ధరాసుతామణిన్।
గొదఁగొనితెతుమిట్టి యెడ కోతులు గీతులు నాకునడమై।
కదరమునందున వల్లిననుఖండనఁ జేతుసురేంద్రునైననున్॥ 111

చ॥ అనవిని మంత్రులెల్ల పట్లు హుంకృతి మాఱంగసేచినిర్చియో
దనుజవరేణ్యా నీవనుపఁదార్కొని రాముఁడనంగనెంతవె।
ల్లనలమునై నమ్రింగెదము యాజినిమృత్యువునైన నోర్తుమ।
వ్వన చరుఁడేమి వెక్కయ జవర్ధన ఘోరతరావిమర్దనా॥ 112

సీ॥ భండనవేదియేర్పఱుచి మత్రోక్తధాగ్ని
దరి కొల్పి పటుశరస్తంభమునను।
పరఁగభీషణ పశువుని బంధించి
కపిసమిత్తులనవకముగఁగెల్చి
చెలఁగుచునసి పత్రస్రుక్స్రువంబులు నేర్చి।
రక్తమాజ్యంబు కారణము జేసి
తనయసహోదరతతులరాముని బట్టి।
పూర్ణాహుతిగ వేల్చిభూరిజలధి

గీ॥ నవభృత స్నానములు చేసియలరు సోమ।
యాజివైయుండు మీవు మేమపుడుహోత
లనఁజెలంగుమీయుద్ధమనుమఘంబు।
జేసినను గాని త్రిజగత్ప్రసిద్ధిగాదు॥ 113

॥ అనియాకైవడిమంత్రులాడఁగ తదీయాలాపముల్ మెండుగా
వినిదైత్యేంద్రుండు మిన్నుముట్టిసకలోర్వీ భాగముల్గంపిలన్।
మనుజేంద్రుంని వాలద్రుంతునని దుర్మార్గంబు నందల్చెనెం।
దనొగింజచ్చెటి వారికన్యజనవిత్తుల్ గానఁగా వచ్చునే॥ 114

॥ మఱియుంబెక్కు విధంబులంగనలుచుంమత్తేభముల్ బోలెమై।
మరచిత్రోప్దీతుఁడైనివింపతతి పల్మారుంభయంమందఁగా।
శిరముల్నూఱిటదివ్య సన్మకుటముల్ జన్పొందఁగా భూనిభా।
సురమార్తాండశతంబురీతి ముఖముల్ సొంపారభాసిల్లఁగన్॥ 115

॥ ఆరగనింద్రపావకయమాసు రపశ్చిమర్త్మారున్మహో।
దారకు బేరముఖ్య భవదస్ఫుట ఘోరకంఠోరగండపెం।
డేరము వామపాదమున తీవిగఁబెట్టి కరంబులన్నిటన్
భోరుననస్త్ర శస్త్రములు పూని రణంబున కుత్సహింపుచున్॥ 116

॥ దనుజులునూఱు కోట్లు దనుదట్టముగా ఁగొలువంగ దివ్యఁకే।
తనమణిచక్ర షోడశసుధాకరవద్వివిధాతపత్రపే।
గనయసహస్రవీచితురగ ప్రకటాసన సూతఘంటికా।
స్వనయుతవిస్ఫురద్రథముసయ్యనఁనెక్కి జగంబుగంపిలన్॥ 117

॥ అప్పుడు వారధుల్ గలగేనిష్టదిగంతమ దేభయూధముల్
దెప్పిరవేకమూర్చిలె మదింభయమందుచు లక్ష్మివిష్ణువుం।
గుప్పున గౌఁగలించెనదిగో తమపాలిటి మృత్యువందఱిం।
చప్పొరి శాయవచ్చెనని సయ్యనదాఁటిరి దేవసంఘముల్॥ 118

॥ పదువురుమంత్రులున్ యముని భంగినిదండములు గ్రచిత్తువై।
వదలకపూని భేరువంబులు మిన్నులు ముట్టగంధదం
తిదశకరాజినెక్కినలు దిక్కులు వ్రయ్యలుగాఁగ నార్చుచున్।
బొదలు చునాశతానుని భోరున గొల్చిరి దేజరిల్లుచున్॥ 119

॥ హరిరఘురాముడంచు మఱియుద్భుత విక్రమునైనవానరుల్
సురవరలంచు గెల్పులికచొప్పడవంచు రణంబుకేఁగకే।
మరులు మటంచుఁ దల్లిపలు మారునుదూతలఁ బంపనాత్మలో।
నిరుపమవిక్రమ స్ఫురణ నెట్టు కొనన్ వినడయ్యె నత్తఱిన్॥ 120

క॥ నానాముఖములనడచెటి
సేనామధ్యమున చంద్రశేఖరుమాడ్కిన్।
మానుగశూలముభుజమున
పూనసుకరణ కాంక్షవెడలె భువనములులుకన్॥

సీ॥ ఆవేళ కంకగృధ్రావళిపురివిచ్చి।
నాడంగఁదొడఁగె శతాస్యుమీఁద
విరిసెనెత్తురువాన గురిసెసేనలమీఁద।
పిడుగులు పడఁజొచ్చెపుడ మివణఁకె।
వరడులంతంతకు వాపోయెతలలెత్తి।
వెసఁగొన్ని గొడుగులు విరిగి పడియె।
నెదురుగా నరుదెంచెనేపు మైపెనుగాలి।
మెఱవిడితురగముల్ మేఁతలుడిగె।

గీ॥ కడువిలాపించియొరలెనాకాశవాణి।
చెలఁగియడ్డంబు గావచ్చె చెవులపోతు।
మఱియుముందట నొకమహామలినమైన।
విధవరాలేడ్చెపోయిన విభునిదలఁచి॥

మ॥ అని యెల్లంవెసఁగాంచియుంవికృత కోపావేశుండై పూనిశాం।
తివిధుల్ దానొనరించి మానసమునందీరాత్ముండై భేరికా।
హవళీ ధ్వానమృదంగనాదము మహోర్వింబిక్కటిల్లంగభై
రవమూర్తి ప్రతిబింబ మైతరుచరవ్రాతంబులండగరన్॥

శా॥ ఈరీతింకడు డగ్గరంకపులు దైత్యేంద్రున్ విలోకించిగం।
భీరంబుల్ విడహస్తకీ లితధరాభృత్పాదపశ్రేణిని।
స్సారంబొప్పఁగ పైచి దానవ మహాసైన్యంబు పెల్లార్పఁగా।
మేరల్ దప్పివణంకుచుంబరిచి రెమ్మిన్ దూరిరాడాడకున్॥

సీ॥ గిరిగహ్వారంబుల కేగిరిగహ్వారం
బులు విడిచి కొందఱుకపులఁగొనుచు।
రూపముల్ డాచివిదూతముల్ గైకొని
వ్రాలిరి కొందఱు వసుధమీఁద।
దండములుగాని యుద్దండములుపనికిరా।
వనికొందఱసురులు వినుతిజనిరి।
రామచంద్రుండె పరామర్శించున।
టంచునల్లన శరణనిరి కొంద।

గీ॥ ఆట్టి తెఱఁగున వానరులెల్లదిశలు
బరవ వారలఁగనుగొని భానుసుతుఁడు।
వారలకురాముగేల నొయ్యా రముగను।
జూచియిట్లనె సైన్యముల్ చోద్యపడఁగ॥ 125

సీ॥ ఈరఘునాయకుండిన వంశరత్నంబు।
జగదేకవీరుండు శౌర్యఘనుఁడు।
వరశరణాగత వజ్రపంజరుఁడుదా।
నవసంహరుఁడు నరనాయకుండు।
జానకిహృదయ రంజనసుచారిత్రుండు।
వికలాబ్జనేత్రుండు విమలయశుఁడు।
ఈశత కంఠుని యిప్పుడే తృణవీల
మడియింపుచున్నాఁడు మనకునితఁడు।

గీ॥ దాపు ప్రాపునుతల్లి యుదంఘ్రి నగుచు।
నుండమీకేల భీతిల్లనురుకుచుండ।
రండు రండురయంబున రాజు కడకు।
ననుచుమరలించెతనదు సైన్యములనెల్ల॥ 126

మ॥ మరలింపంగ పిసైన్యముల్ గిరివ రక్షోజ వ్రజంబుల్ మహా।
కరయుగ్మంబుల బూనిపెల్లుగజగత్కంప్పుగొ నార్చియో।
ధరణీ నాయకమమ్ము బంపుమ సురంధాత్రీ స్థలింగూర్చి మీ।
శరణంబుల్ గైకొందుమంచు నురణోత్సాహంబునంబల్కంగన్॥ 127

శా॥ రాముండున్ ముదమంది వచ్చెటిమహారక్షోగణాదీశ్వరో।
ద్దామ ప్రాభవముల్ శతద్వయ విదోర్తండ ప్రచండత్వముల్
మోముల్ నూఱును తన్ముఖ ప్రకార సంభూతానల జ్వాలలున్।
వేమాఱుంగని కోపముంభయము నావిర్భూతమై చూచుచున్॥ 128

మ॥ నరనాధుండు విభీషణుంబిలిచి యన్నాయీమహాకారుయీ
శ్వరుఁడో చండకృతాంతుఁడోయనలుఁడోచర్వింపఁగా మృత్యువో।
ధర పైనెవ్వఁడు వీడు వీనిగ చిత్తంబెంతయుంభీతిలెన్।
కరమొప్పంవినుపింపుమా యెఱిగెదన్ గర్వంబుపోకార్చెదన్॥ 129

మ॥ అనినందేవమహానుభావవిను వీఁడా భీలదోర్వారిశా
ర్యనయుండైన శతాననుండు బహుమాయా వర్తనుండస్మనీ।
య్యని తాంతాత్ముఁడు వీని యుద్ధమునఁబోరాడంగ శక్యంబుగా।
దునరాధీశ్వరుఁడెట్లొ కాని సమరాదూర్వారుఁడీ తండిలన్॥ 130

మ॥ దనుజాధీశునియంగమందు గలరక్తంబింత యిద్ధాత్రిపై।
నొనరంగాఁబడెనేని నూర్గురు శతాస్యుల్ సంభవం బైరణం।
బునకఱ్ఱోడు దురిందు కేమితెఱఁగోపారా డియెట్లోర్తుహో।
వనచారులవర జాతజాతువరసత్వంబెట్లు నాసిల్లునో॥ 131

గీ॥ ఇతని చేమన బలంబు లనేక త్రుంగు।
ఇతని గెలువంగ ఁజొప్పఁడ దెవ్వరికిని।
పృధివిపురుషులకితఁడ జేయుండుగాన।
నెట్లు జయమందు నో మనకెఱుఁగరాదు॥ 132

వ॥ అనిమఱియు బెక్కు చందంబుల వీభీషణుండు శతకంఠుని భీషణ ప్రకారంబులెఱింగించి లక్ష్మణు నవలోకించినృపవరుండు యుద్ధంబు సేయునెడన ద్దానవేంద్రుని పైనాగ్నేయశరంబు వేమరక వేయుచునుండు ముదానంజేసి రక్తబిందువుల యందు వలననణంగు నట్లైనగెల్పుసమకూరంజేయు మదియునుంగాక నాపైనిద్దానవుండుని గ్రహించుచుండు। గావున నను యేమరక కాపాడుమని ననొడంబడియె। నంతరామునసాన్నిధ్యంబున సమీరసుతుండువాలంబు ద్రిప్పుచుండె భరతశత్రుఘ్నులక్ష్మణకుశలవ విజయ సుగ్రీవాంగదాదులను మిన్నుపగులనార్చుచును బరి వేష్టించి యుండిరి। రాముండును ధనుర్గుణటంకారంబుల దిశలువగులించుచునమోఘశరంబు లేర్పరింపుచు సీతకుభయంబు దెల్పుచు లక్ష్మణుని బురిగొల్పుచు. ననే క తెరంగుల విజృంభిచుచునుండె నంత నుభయముబలంబులు దలఁపడిన శరవర్షంబులు గురియింపుచు శైలంబులు రువ్వుచు పాదపంబులనణఁచుచుఁ బహుగతులంబోరంజొచ్చె నాసమయంబువదేవ

గంధర్వవిద్యాధరగరుడ కిన్నర కింపురుషులు సిద్ధాదులు నభ్రతలంబుననిలిచియవ్వుహాకల కలంబాకర్ణింపుచుఁజూచుచు పరమాశ్చర్యంబునుం బొందుచుండిరి (బ్రహ్మదేవుండును మనంబున వగచియిట్టి వరంబువేల యొసంగితి। ఇద్దు రాత్ముండు సేయంగ నఖిలకపిప్రళయంబు సమకూరుచున్నది. యనితన్నునింద్రాదులెఱింగింప విన్ననైయుండె ప్రళయకాలామసరంబున నొదవు సకల భువన సంహారంబునను కరించియు భయ కటకంబుల యందును భీభత్సంబైయుండెనంత॥ **133**

సీ॥ ఈపాటిమాంసంబు యెన్నఁడులేదని।
ఏచియుపొంగెపిశాచములును।
పాటించిదాఁటి మేటియై యాడకో।
డకును తాండవమాడుఢాకినులును।
ఢాకినీ గ్రహములఁ డాసి మొదళులుఁద్రావి
యోకిలించుచునుండుశాకినులును।
శాకినీకులమును ఢీకొని నెత్తుట
నోలలాడ బూను భేతాళతతులు।

గీ॥ కదిసిపురివిచ్చి యాడెడు కాకములును।
కేరికాకులగ మకించు గృధ్రములును।
గలిగికావిరిదిశ వెల్లగప్పి దివము।
సంధ్యయును రేయుఁదెలియన సంఖ్యమయ్యె॥ **134**

శా॥ ఆరీతిందమ సైన్యముల్ ధరణి పైనందందఁగూలంగఁదా।
క్రూరాక్రోధమనస్కుఁడై దివిజులాఘోషింపఁగాలానలో
కారంబొప్పఁగ దీర్ఘజిహ్వుఁడురుసంగ్రామంబుగావింపుచో।
నారూఢిం గ పిసేనపైఁ గదసి నుద్యత్ప్రాభవంబేర్పడన్॥ **135**

చ॥ కవిసినను గ్రరాక్షసుని గన్గొని రామునను గ్రహంబునన్।
వివిధ శరంబు వేయుచును వేగననాభరతుండొగింమహో।
గ్రవిశిఖమాని శాచరుఁడు గ్రక్కునసేసిన దానినొంచిభై।
రవరవమేర్పడంగీణఁగి రాక్షసుగన్గొనియప్పుడిట్లనున్॥ **136**

ఉ॥ ఓరినిశాచరుండవిను ముగ్రరణంబుననిల్చినేర్పుతో।
బోరుము జూచెదన్ యముని పోలికి నిన్నుద్రుణాకృతింమహో।
దారశిఖీముఖంబుల హతంబబుగం జేసి వనేచరావలిం।
జేరి ముదంబు నెక్కొనఁగఁ జేతుని మేషములో నయిచ్చటన్॥ **137**

చ॥ అనవినిదీర్ఘజిహ్వుఁడు దురాగ్రహుఁడై భరతుంధనుర్గుణ।
స్వనబదరీకృతాఖిలది శావలయుంగని యోరి చూడరా।
మనుజకులాధిపాధమసమర్థన కుంబహుభాషలేలరా।
కనదసిధారచేఁగవిసి కండలు సేయుదు నన్నుజూడరా॥ 138

చ॥ పడిననినుంగనుంగొని నృపాలుఁడు రాముఁడు వచ్చునేనియి।
ప్పుడమిని గూల్తునందులకు బోరవిభీషణుఁడా డెసేనిబల్।
విడి మెడఁద్రొక్కి చంపెద నహీనబలంబున దానికైనజుం।
డుడుగక వచ్చునేని తగనుక్కణిగించెదనొక్కవ్రేల్మిడిన్॥ 139

ఉ॥ నావిని రాఘవానుజుఁడు నవ్వుచు నొక్కన మోఘబాణమా।
దేవతులెల్ల దీవనలతిప్రమదంబుననిచ్చు మెచ్చఁగా।
వావిరి నారకిబూనిబలవర్ధనుఁడై తెరనిండదీసియా।
రావముమీఁఱనేసె బవరంబునదైత్యు నిజిహ్వద్రెంపంగన్॥ 140

శా॥ జిహ్వ నష్టము బొందిదానవుఁడు కస్తిందొడ్గియుద్ధక్రియా।
రంహుండై ప్రళయాగ్నికైవడిపైరంబొప్పఁగా మండుచుం।
సింహధ్వానము జేసి యాభరతుపై చిత్తంబు నంజెండరొ।
ద్రాహ్వస్త్రంబొగిసేయ బూనిననతండా ఖీలశౌర్యంబునన్॥ 141

శా॥ ఆటో పప్రభలన్ ప్రతాపచటులోగ్రాకారుఁడౌ చుంనిరా।
ఘాటజ్ఞేయశరంబునందును. మహీకాంతుండు మెచ్చంగన।
క్తాటోధీశుని హస్తముల్దునిమె. ధైర్యప్రౌఢిమన్ వేలుపుల్।
సూటిన్ సన్నుతి సేయవానరబలస్తోమంబు పెల్లార్వఁగన్॥ 142

ఉ॥ అర్కకు లేంద్రుడున్ దనుజునల్లన జూచియమోఘవృత్తిమై।
కర్కశ భల్లమొక్కటి ముఖంబు నమంటులు గ్రమ్మనీనుచో।
మార్కొని యేర్చియేసినను మత్తని శాచరుమస్తకంబొగిన్।
బేర్కొని ద్రుంచేసేలఁబడ బెట్టు గఁద్రోచే భయప్రదంబుగన్॥ 144

గీ॥ అట్లు భండనముననవనిపైఁబడు దీర్ఘ
జిహ్వపాటు జూచి శశిముఖుండు।
కణఁగివిలయ కాలకాలభైరవుబోలి।
బలిమి మెఱసికవిసె భరతు మీఁద॥ 145

గీ॥ అన్న మీఁద గవియునట్టి దురాత్ముని।
జూచి బలమునెల్లచోద్యమంద।
శత్రుభీష్మఁడైన శత్రుఘ్నుఁడొగినేసె।
అర్ధ చంద్ర బాణమతని మీఁద॥ 146

గీ॥ శశిముఖుండు వాని జీర్ణంబు గావించి।
యతని మీఁదబరిపె నైంద్ర శరము।
దానినడు మద్రుంచి దైత్యుపైనురగాస్త్రు
మేసె దనుజసే నలెల్లనులుక॥ 147

మ॥ సరగ న్గారు డబాణమేసియు రగాస్త్రంబుచ్చి పొసేసియా।
శ్వరబాణత్రయమూచి దుర్మదమునన్ శత్రుఘ్నుపై నేయనా।
శరముల్ దేహముగాడి సొమ్మసి లెగర్వాతర్జనల్ మీఱగా
నరుదారన్ గుపి తాత్ముఁడై ప్రళయకాలాభీలతంబొంగుచున్॥ 148

మ॥ నరనాథానుజుఁడం తనుగ్రుఁడగుచున్ నారాయణాస్త్రంబువిం।
టరయంబొప్పఁగబూని నిర్జరులు మింటన్ సన్నుతింపన।
బ్బురనేర్పాటు గనార్చి నేయన దియాభూమంతయున్నిండివి।
స్ఫురదగ్ని ప్రకరంబు లీనుచు రిపుక్షోభంబుగావింపుచున్॥ 149

మ॥ చను దేరంభువినంబు లెల్లనడలెన్ సప్తాచలంబుల్ భయం।
బుననందందవణంకెసకలాంబోధుల్ గతుల్ దప్పిర
య్యాన చంద్రుల్ వెసమ్రొగ్గె దిగ్గజచయంబేపారకాలాగ్నిన।
య్యాననావిర్భవమయ్యె తచ్చుటుల దివ్యాస్త్రప్రయోగంబునన్॥ 150

గీ॥ అమ్మహాకాండ మీక్షించియసురవరుఁడు।
బెట్టు వణఁకునటుమొరబెట్టుచుండ।
వచ్చె చిచ్చు లు గురియుచువానిశిరము।
ధరణి పైఁద్రోచెదైత్యులు తల్లడింప॥ 151

గీ॥ శశిముఖుఁడు గూలు టకువానివశుఁడు గనుక।
నుగ్రుడై స్థూలకంఠుఁడ త్యుగ్రశూల
మపుడు హస్తంబునను బూనియమరులదర।
రూఢినేయంగఁ బూను శత్రుఘ్నుమీఁద॥ 152

సీ॥ స్థూలకంఠుని బాహుమూలంబు వీక్షించి।
లక్ష్మణుండని పైలావు మెఱసి।
యడ్డంబు వచ్చి సాయకపరంపరవేయ।
నసురమహారోషమందికినిసి।
యాలంబులోఁగూలుమని శూలమపుడేసె।
యేసినభువనంబు లెల్లవణఁకె।
భూనభోమధ్యమద్భుతముగా ననలంబు।
నిండె భయంబందెన్న పవరుండు।

గీ॥ నప్పుడెడఁ జొచ్చి హనుమంతుఁడో త్రిశూల।
మెల్లసైనికులలరంగనేపు మెఱసి।
పద్మజాండంబు పటుపటుపగుల నార్చి।
విపులబలు ధైర్యుఁడై పట్టివిరిచివైచె॥ 153

గీ॥ వరుసనమృతంబుగురిసిరివాయునుతుని।
మీఁదనమరులు దీవించి మేదినీశు।
డపుడు సౌమిత్రి సంభ్రమంబంది మాకు।
ప్రాణబంధుండవగు మని బ్రస్తుతించె॥ 154

గీ॥ స్థూల కంఠుండు గూలినఁజూచి కూఁత।
విడుచుయోజన హస్తుండు నేపుమిగుల।
మెఱయ సౌమిత్రి నెలగిబట్టె మెదలకుండ।
నతని చేతులు దెగనేసెనక్కుశుండు॥ 155

గీ॥ హస్తములలో యోజన హస్తుడపుడు।
కుశుని మ్రింగెద ననిమహాకోపమెసఁగ।
తివిరి వక్త్రంబుదె ఱచి యేతేరనటయే।
సరసతూణీ రముగనేసె శరము లెల్ల॥ 156

గీ॥ మించి శరములు మ్రింగుచు మీఁదరాగ
అఖిల వానరసేనలందందనార్వ
తనదుశానంబునను మహోద్దండశరము।
తోడిగి యోజన హస్తుని బుడమిగూల్చె॥ 157

చ॥ కనలుచునక్కు శాహ్వాయుని గాంచి దురాగ్రహుఁడయ్యు దుర్ముఖుం।
డనియెడువాఁడు యోరిమనుజాధిపనందన నన్నుజూడరా।
దునిమెదనిన్ను యిప్పుడని తోరముగానరు దేరవానికిన్।
గొని లవుఁడుగ్రుఁడై పరఘోరశరంబులు చిత్రవైఖరిన్॥ 158

ఉ॥ అప్పటి బాణముల్ నడుమనన్నియుద్రుంచిల వాఖ్యు మీఁదటన్।
గుప్పునన గ్నిసాయకము గ్రూరతనేసిన వాని లీలతో।
నప్పుడు వారుణాస్త్రముననట్టియణంచినిలింపులెల్లబా।
గొప్పజయ ధ్వనుల్ చెలఁగను గ్రశిలీముఖ మొక్కటేర్చుచున్॥ 159

వ॥ అద్దానవు నిహస్తంబులు చరణంబులు ఖండించి పిద పలీలం బై వానిమస్తకంబును ఖండించె వాని మరణంబుగనుగొని కోపతాపంబులు మీఱ శూర్పకర్ణుండును. గజోదరుండును। త్రిముఖుండునుంగ దసియొక్కపెట్టున కుశలవులంజంపఁబూననెఱింగివారల మహోగ్రంబులు జూచి రాఘవుండు ప్రళయాం తకుని పగదిహుంకరింపుచునందఱికినన్ని సాయకంబులు బఱపి తలలుద్రుంచెనంత॥ 160

చ॥ పదువురుమంత్రులున్ నృపులపాలును భృత్యులపాలునైనతా।
నదవదనొంది క్రాలుచు శతాస్యుడు మృత్యువుబోలినిక్కుచుం।
ప్రదరపరం వరల్ కడున భస్థలియున్ భువియున్ మహానలా।
స్పదముగనిండనేసె బహుభంగుల నానరులెల్లఁగూలఁగన్॥ 161

వ॥ మరియునుబిరుతివియక నూఱు బాణంబుల నంగదుంగూల్చి యిన్నూఱుశరంబుల సుగ్రీవునొంచె నేనూఱుశరంబులభల్లూకపతిని మూర్ఛిల్లంజేసి నఖిల వానరు లక్షణమాత్రం బునఁజమిరిపెట్టి క్రవ్మరదేశాధీశులంగదిసి పదతాడనంబులహతంబుగావించి కడవునందఱ నొక్క పెట్టున తనవక్త్రగహ్వరంబులం జొనిపిమఱియుహతశేషులగు మనుజవనచరుబలంబులంబోకార్చి విభీషణునవలోకించి వీనికతంబున రావణ కుంభకర్ణ మేఘనాదము ఖానేక దానవప్రళయంబుగావించె। కులద్రోహియైన వీని దెగటార్చెదనని బ్రహ్మాస్త్రంబు సంధించె సకలలోకంబులు తల్లడిల్ల నార్చి యేసినన దియునిలయానల కీలాకరాలంబును మృత్యుంజయ ఫాలనేత్ర సంభూతమహోగ్రంబును।గూడనైశ్యబు నొంది యివ్విధంబున జనుదెచ్చునొక్కొయనిఁగరుడ గంధర్వ కిన్నర కింపురుషసిద్ధ విధ్యాధరామరలోకంబును హాహాకారంబులు సేయ చిచ్చులుగురియుచు చ్చివిభీషణు నవయవంబులు బంధించి నేలంబడద్రోచె। నంతియకాని రాఘవకరుణాకటాక్షభవామృతసంసిక్త శరీరుండగుటంజేసి చంపనోప దయ్యెఁ నవ్విభీషణు సైన్యములు

నాడోడంబటిచిడాగిరి (వెండియమ్మహాదానవుండు కుశలవవిజయభరత శత్రుఘ్నులక్ష్మణులతోడం గూడరాముని వధింపంబూని యెక్కు పెట్టు నధనుశ్శరంబులు ధరియించి బాణసహస్రంబుల హనుమంతుని వివశుంగావించి శర వర్షంబులు గురియుచునట్టహాసంబు సేయుచునరుదేరసీతామహాదేవియతని భీషణ ప్రకారంబు వీక్షించితనయాది మహిమంబాకర్షించి శతకంతునికిందప్పు నెవ్వరికింగానరాకుండగను పట్టిన। శతముఖుండును న రవరునింజపెదనని యార్చుచుండాసి। పురోభాగంబుననున్న జానకింగనుంగొనునవసరంబున। నవబ్రహ్మలేకాదశరుద్రులు ద్వాదశాదిత్యులునే నూఱునగ్నులుమూఁడు కోట్ల దేవతలునగుంపడినభయంబైయిదితన పాలింటి మృత్యువు గాని యాడ దానిమాత్రంబుగా దని నిశ్చయించి తానరుదేరతన తల్లి రణయాత్రకుననుగ్రహంబు। సేయకుండుటకును క్రమంబున దుర్నిమిత్తంబులు గనుపడుటకును। సంగరంబునఁదన ప్రధానులు బలంబులతో భస్మంబు లగుటకును। చిత్తంబువికలంబైనని కనేటికి యుద్ధంబుసేయుందగదురేపుచను దెంచి సహోదరసహితంబుగా రామునిందెగటార్చెదనని ప్రతాపలంకకరిగె రామచంద్రుడును విషణ్ణహృదయుండెవిభీషణు బ్రహ్మాస్త్ర బంధనంబు విమోచనంబుగోరి బ్రహ్మమంత్రంబులుచ్చరింపుచు మూర్ఛిల్లిన కపుల తనహస్తస్పర్శ జేసి నలరింపుచు। తమనిమిత్తంబునకైవచ్చి పడిన దేశాధీశులంగని వగచుచు రేపు దనుజుండ రుదెంచునెట్లోకోయని చింతింపుచు। సీతకుసంగరచాతుర్యంబులు దెల్పుచు। హనుమంతుని వినుతింపుచుండె। నని మహాదేవుండెఱింగించినవిని శిరః కంపంబుంజేసి మహాత్మాశతకంతుడుమరునాఁడ దెంచి। నృపులతో నెట్లు పోరె సీతయేరీతి నతనిఁహతంబు జేసె యెఱింగించి సంతుష్టంబు గావింపుమనిన తర్వాతి వృత్తాంతంబు పురహరుండువినుపింపఁ దొణంగెనంత॥ **162**

క॥ కదనామరవరతనయా।
సదమలచారిత్రరాజ్య సన్నుత గాత్రా।
మదననిభరూప సంతత
మదశాస్తుత హరణభోగమక్ష్మారమణా॥ **163**

పంచచామరము.

భవప్రభూత కల్మషాబ్ధి ఖండనాప్రచండనా।
నవీన కీర్తి హారమత్స్య నాయకాశు భాయకా।
అవక్ర విక్రమా బుధావనాక్రమాసు విక్రమా।
రవిప్రకాశభోగ యస్థిరాకృపాకరా **164**

గద్య॥ ఇది శ్రీమద్వేదాద్రి పురనివాస శ్రీనీలకంఠచరణ
సరసీరుహభ్రమరాయమానపొబ్బాలగోత్రపవిత్రరంగా
రెడ్డి పుత్ర భోగయనృపాల నిజాశ్రితలింగ సుకవి ప్రణీతం
బైన సీతావిజయంబను మహాప్రబంధంబునందు
తృతీయాశ్వాసము సంపూర్ణము 165



# నాల్గవ యాశ్వాసము

కII శ్రీనీల కంఠసేవక
దానకళాభరణ మానధనసంచరణో।
దీన సురద్రుమసన్నుత
మానవధనవితతి భోగమక్ష్మాధీశా॥ **1**

వII అవధరింపుమత్తెఱంగున పార్వతీ దేవికి మహాదేవుండు వినుపింపుచు వెండియునిట్లనియె। నట్లు శతకంఠుండు ప్రతాపలంక కరిగి కలహవృత్తాంతంబు సీతామహిమంబును। తనపరాభవంబును తన తల్లికి వినుపింప నమ్మానినియును చింతించి తనయున కిట్లనియె॥ **2**

గీII వలదు వలదని పల్కఁగోజలముజేసి।
యనికి నఱింగి తివటునీవు చనిన పిదప।
కలిగి యావంతనొందుచు కన్నుమూసి।
యొక్కకలఁగంటినవివిను నిక్కముగను॥ **3**

సీII పురుషులచేఁదోగి పొలియకుండుట జేసి।
వనజజుఁడొసఁగిన వరములెల్ల।
నిలివెదనిలిపి యునేపునకైనదా।
నాదిమ శక్తి ప్రార్థన ముసలిపి।
యప్ప రంజ్యోతిచేనీ రాక్షసుని బరి।
మార్చెదననిలో కమాతనొయ్యా।
ననుటయునయ్యమ్మ పలు విధంబుల రాము।
చేవిల్లు నమ్ములు చెనసితివిచి।

గీII తానెగై కోని ఘోరయుద్ధంబుజేసి।
యాహవంబు ననీతలలవని గూల్చె।
బల్కుడోసియొరలిది తనదు కోడంద్రుతాను।
యిట్టి కలగంటి నికమీఁద నెట్లో కాని॥ **4**

సీII ఏగన్న కలసత్యమింతియేగానిద।
పగనేరదెల్లిగరాఖవరముననను।
సితామహాదేవి సితశరంబులతోడ।
దలఁపడున పుడైనఁదలచు బుద్ధి

నీసేనలన్నియు నిమిషమాత్రంబున
ధరఁగూలు నపుడైనఁదలఁచు బుద్ధి।
పటువిశిఖంబున పలువిడినీతలన్।
ఖండింపునపు డైనఁగరపు బుద్ధి।
గీ॥ ఒక్కకపిమంత్రుడి చ్చోటను క్కమెఱసి।
రూఢి బిడికిటఁ బొడిచిన రొమ్ము వగుల।
నీదు సింహాసనముగూల నిలిచితన్ని।
యెఱింగినదియైనఁదలఁపవేమందునిన్ను॥ 5
సీ॥ వానరావలికి వశ మాసముద్రంబులు
నాలుగుదాట యేనాటయైన।
నరులక శక్యమా నవ్వుచు నీలంక।
యగ్గలంబుగ వెనులగ్గపట్టు।
భవదియ్యదానవాపారబలంబుల।
నలదియేపరులకు నవనిగూల్ప।
సురసంఘములనెల్ల చెరలు పట్టిననిన్ను।
యెదరింపదరమెమరెవ్వరికిని।
గీ॥ కానరాముడె విష్ణునిగా తలంపు।
నెలతసీతను మాయగా నిశ్చయించి।
హనుముడీశ్వరుడని బుద్ధియందు నిల్పు।
మనుముశరణని రామునిమరుగుచొరుము॥ 6

వ॥ అని మరియుననేక విధంబులనందంద భయంబుపుట్టించి। సంగతితోకద్రాక్కిన భుజంగంబు చందంబునమిట్టి పడి మొగములు ముడివెట్టి కన్నుల నిప్పులురుల। తల్లివియని యిమ్మాయలు సహించితిగాని। మొండరుల నైనందెగ జూడనే। శ్రీబుద్ధి ప్రళయాంతకమను సామెతలు నిజంబయ్యె। నీబుద్ధి విని యెడి యనుంగలదెయని యచట వీడ్కొని ప్రళయ చెండమహాద్దండ సప్తార్చి విధంబునంగ్రాలు చుఁపటహాదిరవంబుల బ్రహ్మాండభాండంబు ఘూర్ణిల్ల మరునాడు సూర్యోదయకాలంబున రథంబుపై నెక్కి కొంత చిక్కిన సైన్యంబులంగొని విలయకాలాంతకుని విధంబునం కదలిరా దొణంగె। నంతని క్కడఁ 7

గీ॥ రామచంద్రుడుండునలమిత్రాతనూజు।
ప్రేమతోడుత జూచివిభీషణార్క।
తనయపవనజ జాంభవత్ప్రభృతితరుచ
రేంద్రులెల్లనువినుచుండ యిట్లులనియె॥ 8

ఉ॥ నిన్న శతాస్యుడిచ్చటికి నిక్కుచు వచ్చియనేక సేనలం।
పన్నుగ సంహరించి మనపైజును దెంచినవానియుగ్రతం।
కన్నుల బారజూచి యొకకైవడి నుంటిమిగా కవానితో।
ఉన్నత వృత్తి బోరుకు నోపగనైతిమి నీచవర్తన॥ 9

ఉ॥ యెంతటి వాకికైన నొయక్కుడు దాపట నొక్కవేళలన్।
వింతగబుద్ధి చెంచతిలువిశ్వములో నటుగానదైత్యుడ।
త్యంతరణోత్సవంబున రయంబున వాడొగివచ్చెవానితో।
నెంతయు బోరగావలయు నెల్లసురావలి సంతసిల్లగన్॥ 10

ఉ॥ నావిని లక్ష్మణుండని యెనవ్వుచు నీగతిపల్కనేల? నా ।
లావును దైత్యలావును బరామరి సించెదవుగాక దివ్యబా।
ణావలినద్దు రాత్మునిరయంబున గూల్చెద వేనినాటికిం।
వావిరివానిచేత నిలవ్రాలెదు గాకతలంప నేర్తునే॥ 11

సీ॥ ఆలక్ష్మణుని మాట కనుకూలముగభర।
తుండు శత్రుఘ్నుడాదండనిలచి।
చూడు మీతేపమాసుమహితవిక్రమం।
బనుచుచాపము బూనిరాక్షణంబ।
కుశలవులిద్దరు ఘోరయుద్ధము సేయ
నఝ్వాడగా జొచ్చిరలముకొనుచు।
సుగ్రీవుడారాముజూచి సేనలతోడ।
తలకకనిలిచెనంతకుని రీతి।
నంతనాహనుమంతుడత్యంత శౌర్య।
వంతుడైవిన్నుముట్టుచు వచ్చిరాము।
కంజదళనేత్రునీకేల కళవళింప।
నాశతాస్యుని తృణలీలనవనిగూల్తు।

గీ॥ అనుచుసన్నద్ధులగుచు శంఖాద్యనేక
తూర్యానాదంబులాద్దంద తోడిబడంగెc
రథములెక్కిరిన్నృపులు నురణమునకును।
భాతినార్చుచు శత్రుగర్భములువగుల॥ 12

సీ॥ రాముండు చటుల విక్రమ శీలుడై వేగ
హనుయంతు భుజముల యందు నిలిచి
జానకీ దేవి పశ్చాద్భాగమున నుండి
నిలిచిన ధీరులు ఘనత మెరియ
ఘన ధనర్గుణ విటంకారముల్ దిక్కులు
జగతిం బిక్కటిలంగ సలుపు కొనుచు
బవనుజు మఱుంగున బరcగ విభీషణు
బొంచి యుండగ నియమించి మించి

గీ॥ దైవసంఘంబు జయజయధ్వనులుసేయ
కవులు పెల్లార్ప బ్రహ్మాండ ఘటమువగుల।
కేరిశతకంధరుని విలోకింపుకొనుచు।
ధరణి జకుజూపుచును ప్రమోదముననుండె॥ 13

ఉ॥ అంతశతాననుండువిలయాంతకుడైవడి హుంకరింపుచుం।
పంతముతోడ వచ్చి పటు బాణపరంపరచే కపీంద్రులం।
వింతగcగూల్పవారలును వృక్షమహీధరసంఘముల్ గడున్।
వంతఘటింప వైచిననువాటిని చూర్ణమే జేసెవ్రేల్మిడిన్॥ 14

చ॥ మఱియును మూcడు బాణముల మైదేని గీటుణcగించియుగ్రతం।
శరనవకంబు చేశరభుసయ్యన గూల్చిపదింటనీలునిం।
ధరcబడనేసి గోముఖుని దప్పకయేడిటసంహరించితా।
నరుదుగ పద్దకొండను గవాక్షుని మూర్ఛల జేసివెండియున్॥ 15

సీ॥ దశకద్వయంబున దారకుఁబడనేసి
మొనసి జ్యోతిర్ముఖుముప్పదింట।
తివిరిఖండించి యాద్వివిధునినలువది।
శితవిశిఖంబుల హతుని జేసి।
ఇషుపరంపరల చేరిషభుని వెసద్రుంచి।
గవయుని డెబ్బది కాండములను।
చక్కఁగోవించి పెంపెక్కుచునొకనూఱు।
శరములనంగదుజమిరివైచి।

గీ॥ జాంబవంతునిము న్నూఱుసాయకముల।
నురువడిని గ్రుచ్చిధాత్రి పైనెలరఁగజేసి।
గంధమాదన సంఘమాకపుల వేయు।
మార్గణంబుల పరగించి మదమణఁచి॥ 16

గీ॥ పరగనార్చుచు యిన్నూఱు బాహులందు।
నస్త్ర శస్త్రా శిధరియించి,యమరులదర।
కణఁగి రాముని వెదుకుచుఁగదలిరాగ।
నప్పుడె డజొచ్చి సుగ్రీవుడడ్డ పడియె॥ 17

మ॥ వడివాలంబున వానిచేతులణఁగంబంధించఁగాఞానియ।
ప్పుడమెల్లం వణకంగ నార్చియు కడుంభీమాకృతింబోవనే।
ర్పడనిద్దానవచక్రవర్తికినుకంబాటించి సుగ్రీవునిం।
బడఁగూలన్ వుసఁదన్నెరాఘవమహీపాలుండు చింతింపగన్॥ 18

ఉ॥ రాముఁడు నవ్విభీషణుఁడు లక్ష్మణముఖ్యులు ఋత్రులుం మహీ।
జామణియుంమరుత్సుతుఁడు సంగరవీధినిదక్కవానర
స్తోమములుం నరావలియు చూర్ణ కబంధకవైరి చిచ్చుపై।
నామెయి దీర్చిపుచ్చె శలభావలి కైవడి నొక్క పెట్టునన్॥ 19

ఉ॥ వెండియు నాశతాననుఁడు వేగన రాముని పైరథంబును।
ద్దండ తంద్రోల సారథిని దప్పక దిట్టుచు హుంకరింపుచున్।
కాండపరంపరల్ ధరణి గప్పుచు గుండెలు వ్రయ్యనార్చుచున్।
దండిగరాగలక్ష్మణుండు దైత్యుని పైనెదిరెన్ మహోగ్రుండై॥ 20

ఉ॥ ఎదిరిన రాఘవానుజుని యేపును జూపును బాణతూణముల్
సదముల శౌర్యముంగని విచారము సేయుచు నొక్క తీక్షణ
ప్రదరము వింటు బూనియల పద్మభవాండము వ్రయ్య నార్చుచున్।
వదలక రోష భీషణ వివాదము మీఱగనప్పుడిట్లనున్॥ 21

చ॥ పాఱి పొమ్మోరిమెతుకైనc బవరమందు।
ఎదిరిమద్బాణముల కుసహింపcగలవె।
పడుచచంపె దనని చలపట్టి యింత
నందనుని నిన్ను తల్లి యెన్నటికిcగాంచు॥ 22

సీ॥ ఏడిరాలంక పైనేగిరావణుగిట్టి
ధాత్రి పైcగూల్చు ప్రతాపఘనుcడు।
ఏడిరాబాణంబులేర్చి యార్చుచుకుంభ।
కర్ణుని జంపువిక్రమధురీణుc
డేడి రాకోపాగ్రహృదయుcడైయనినగ్ని
వర్ణుని జంపినవరబలుండు।
ఏడిరామున్నుమహేశ్వరు చాపంబు।
ఖిన్నంబుగావించు భీమశౌర్యు।
గీ॥ డతనిపైcగా నినాదుసాయకమువేయ।
శరధి జూచ్చినcదలc జూపవెఱచియున్న।
కొమ్ముదప్పిన యుముకనైకొనినవిప్రు।
డైనగిరినిన్ను బోనీయకవనిగెల్తు॥ 23

చ॥ అనివినియోరి దుర్మతి వృధావచనంబు లు పలుకనేలదా।
పుననెదిరించి నిల్వుము మహోగ్రశరంబులచేత నీతలన్।
గనియల చేతుచూడుసురకాంతుని వజ్రిని గెల్చు మేఘనా।
దుని దృణలీల చిత్ర గcద్రుంపు టెఱుంగవు యొక్క ప్రేల్మిడిన్ 24

చ॥ అని చటులాగ్నిబాణముల నాశతకంతుని యేసెయేసినన్।
కనలుచునాశరాగ్నులధికంబుగcగాల్పదొణంగెనందుకుం।
మనమున నాగ్రహించి గరిమన్ వరుణాస్త్రము వేసితచ్ఛరా
గ్నిని శమియింపc జేయుచునేసెశిలీముఖ సంచయంబులన్॥ 25

ఉ॥ నేల యునింగియుందిశలు నిండఁగ నేయతదాశుగానల।
జ్వాలలు చుట్టుముట్టుకొనిసయ్యనమీఱ రథంబుదగ్ధమై।
కూలఁగఁజేసెఁజేసినన కుంఠిత శౌర్యమనస్కుఁడై కడున్।
నేలకుడిగినుర్కిమఱినిల్చి కురించె మహాస్త్రవర్షముల్॥ 26

చ॥ అనినడుమిన్ హతంబుగ రయమ్మున ఁజేసి సుమిత్రపట్టివిల్లు।
అపావని చలింప నొక్క చెటు లాస్త్రమునందునియించి యొక్కటన్।
వివశుని జేయమూర్ఛవివేకముదూలగ వ్రాలివెండియున్।
ప్రనిమలవృత్తి మైఁదెలసి బాణపరంపర లేర్పలింపుచున్॥ 27

ఉ॥ వేఱొక విల్లుబూనియొకవింత రథంబుననిల్చి సర్వబృం।
దారకులుత్సహింపనలదానవ సేనలు చెంచలింపదు।
ర్వాదపరాక్రమస్ఫురణ రాముడు జూచి భయంబు నొందర।
ఘోరమణుల్ రథంబు పటుచూర్ణము జేసె జగంబుగంపిలన్॥ 28

ఉ॥ అందుకు దానవుండు విలయానలమున్బలెమండెవేఱొక
స్యందన మెక్కిచాపములు సయ్యా ననూఱొగి బూనియార్చిసం।
క్రందన ముఖ్య దేవతలు గన్గొని భీతిలుచుండఁగోపమున్।
గ్రందు కొనంగనూఱు విశిఖంబుల లక్ష్మణు గ్రుచ్చెచెచ్చెరన్॥ 29

గీ॥ లక్ష్మణుని గాడిమఱియునులఘుతరముగ।
ధరణి వెసదూఱియలరసాతలము సోఁకి।
మఱలశతకంఠుమహితతూణీరమధ్య।
మునను నిల్చెను దైత్యులుమురియు చుండ॥ 30

గీ॥ వెండియును శతకంఠుడుద్దండుఁడగుచు।
శక్తి వైచిన సౌమిత్రి జలదరింప।
వచ్చివిలుద్రుంచి దేహండు జొచ్చిచింప।
వ్రాలెనరదంబుపై నప్పుడాలమునను॥ 31

గీ॥ హామహోదార లక్ష్మణహాయటంచు।
సీతయును రాముఁడును శోకసింధువునను।
దెరలి చూచి రిభరతుండు తివిరియాశ।
తాస్యుపైనేసెవివిధ సాయకములుపుడు॥ 32

ఉ॥ ఏసిను గ్రుడవుచుదను జేంద్రుడ భ్భరతాహ్వాయున్రణో।
ల్లాసుని జూచిమూడుమ దెలక్ష్మణు పాటును నిన్నునట్లనే।
భాసురసాయకంబులను భగ్నముసేయుదునంచుఁ బెల్లుగా।
నేసెసహస్ర బాణములు హెచ్చుఁగదిక్కులు బిక్కటిల్లఁగన్॥ **33**

క॥ అయ్యమ్ములు దృణలీలం।
వెయ్యమ్ములద్రుంచి వైచివేగనదైత్యుం।
కాయమ్ము వగిలి పెక్కగు।
గాయమ్ములు గనుపడంగఁగాండమువేసెన్॥ **34**

క॥ వెండియును దోడుతోడన్
కాండ పరంపరలు దొడిగి కరముల గలకో।
దండములునూఱు ద్రెంపక
దండిగఁ బెట్టే సెసకల దనుజులు బర్వన్॥ **35**

క॥ ఆతని శోణితకణములు
భూతలమునపడకయుండభువనమునిండన్।
ఖ్యాతి మహాగ్ని కల్పా
ఖ్యాతి శరంబులు మఱేసియాలము జేసెన్॥ **36**

చ॥ అవిగనిమండిదానవ కులాధిపుఁడొండు శరాసనంబులం।
వివిధ శిలీముఖంబులను వేగనఁబూనియమోఘ వృత్తియై।
భువివణఁకంగ నార్చి రఘుపుంగవుఁడద్భుత మంద తద్రధం।
బవి రళలీల దగ్ధముగ నప్పుడు జేసె మహోగ్రదగ్రుండై॥ **37**

చ॥ మఱియును వేయిబాణముల మార్కొని వేసి శరాసనంబున।
చ్చెరువుగద్రుంచి సూతునినసింపఁగఁ జేసి మదించి తోడనే।
సురవరులెల్ల నుల్క పటుశూలము కేలనమర్చి యోరియా।
సురుచిరదానిచేత పటుచూర్ణముగా కతలంగి పాఱరా॥ **38**

చ॥ మఱివెసనార్చి వైవజగముంతయు గంపమునొందెవార్ధులుం।
సరసగలంగె మిట్టి పడి శైలము లన్నియు రామచంద్రుండుం।
వెరవెర నొందె లోకమునవింతఁగగా విరినిండె చంద్రభా।
స్కరులటుత్రోవఁదప్పిరతిచంచల వైఖరితద్భయంబునన్॥ **39**

సీ॥ ఈరీతిన దిరాగనేర్పుమైయమ్ముల
వానలుని గుడించి వాని మీఁద।
నవిద్రుంచి శూలమత్యంతరయంబున।
చటులమై యరుదేరశక్తి వైచె
నది ద్రుంచి మండును నది రాగమదిలోన।
దరలకని శితకుంతమ్ముద్రోచె
నది ద్రుంచు వెండియు బోదులు చునే తేర
పూనికి కతారిని బొడిచెభరతు।

గీ॥ నక్కతారియు గణకించి చక్కఁగవియ
నుగ్రుఁడై ముష్టి దాఁటించెను క్కుమెఱసి।
యదియుగై కొనకా శూలమెదిరి యవయ।
వములు భేదించి లీలమైయవని గూల్చె॥ 40

సీ॥ హతమ్ముడాయని భూత లాధీశుండు।
సీతతోనడలి నిశ్చేష్టుఁడయ్యె।
నలవిభీషణుఁడను హనుమంతుఁడునుబాష్ప
నివహనిర్గత రక్తనేత్రులైరి।
చిక్కిన దానవసేనల న్నియు మిన్ను
వగుల నార్చిరమేటి మగల రీతి।
ఇంక నెవ్వఁడు దన్నునెదురునోయనిశత।
కంఠుండుండెను సీతకం ఠుఁడగుచు।

గీ॥ నంతశత్రుఘ్నుఁడంత కాలాగ్నిబోలె।
మలసి తన కన్నుగవపెనుమంటు లెగయ।
మెఱసి చిచ్చుల వానలుగురిసి కొనుచు।
సరభసంబునదాన వేశ్వరుని గదిసె॥ 41

చ॥ కదిసిన వానియుగ్రమును గర్వమునుబ్బును శౌర్యధైర్యమున్।
కదరమహోత్సవంబు సువికాసముహాసము చూచి దానవుం।
డదన మహాగ్ని కల్పవిశిఖావ విచాపములందు బూనియా।
త్రిదశులు దల్ల డిల్లనతి తీవ్రత నేసెరఘూద్వహానుజున్॥ 42

ఉ॥ ఏసిన యమ్ములం దనగనేసిధనుర్గుణ ఠంకృతుల్ మహో।
ల్లాసమునిండ సంగర విలాసమునన్ రిపు మీఁదను గ్రుఁడై।
భాసురసాయక ప్రతతి భంగుల నేసిశతాస్యునందుచే।
వాసిగచిక్కు పాటు లొందవంగఁ బెనంగెపురారికైవడిన్॥ 43

సీ॥ ఇట్టి వేళనే త్రుంతునిక వీని నని డాసి
నారాయణాస్త్రమున్నతినిదొడిగిఁ
ఓరి దానవ చూడరోరియాశరమున
లవణాసురుఁడు మున్నులావుదూలె।
పాఱి పొమ్మోరోరి యాబాణంబు చేమళ్లి।
బ్రతికిపోగలవె యేర్పడఁగనీవు
ఇదిధరించెటి వెరవిప్పుడె యూహింపు
మను యేసి యార్చిననవని వణఁకె

గీ॥ వారినిధు లెల్లబిండిలివండలయ్యె
దారుణాగ్నులు భూనభోంతరమునిండె।
విమలనిశితాస్త్రజాలసమిత్ప్రభావ।
శత గణుండును దానిపై శరములేసె॥ 44

ఉ॥ వానిటినెల్ల ద్రుంచిసురవర్గములుత్సహమందడాసియ।
ద్దానవలోకనాయకుని దారుణభాసుర మస్తకాగ్రసం।
స్థానకిరీట సంఘములు ధాత్రి పయింబడఁద్రోచి వెండియున్।
వానిశరాసనంబులు రవంబులు మీఱఁగద్రుంచె నొక్కటన్॥ 45

ఉ॥ అంతియకాని యజ్ఞలరుహాసనుడిచ్చిన దీవనల్ తదీఁ
యాంతమునొందఁజేయఁదగదయ్యె బలాఢ్యులు చేతఁబట్టినన్।
ఎంతటివారు వారినెనరెక్కడి కెక్కు ధరాతలంబుపై।
నెంతయు చేత కార్యమున నెమ్మొలు దూఱిన దూలుకాకొగిన్॥ 46

గీ॥ ఇట్లు భంజించి నారాయణాస్త్రమపుడు
మరలివచ్చుచు శతకంఠుమహిత రథము।
ఘనులు దివిజులు సేయ జయధ్వనులు సేయ।
దగ్ధముగఁ జేసిపొదిలోన దరల కుండె। 47

గీ॥ అందుకత్యంతకుపితుఁడై యసురవరుఁడు
నూఱుకరములపటుగగదల్ నూఱుపూని
యార్చి వైచినన్నియు నతిరయమున
వచ్చి శత్రుఘ్నుదాఁకె భూవరుఁడువగువ। 48

గీ॥ అట్లు సకల గదాతాడితాంగుఁడగుచు।
తూలివణఁకుచు నెత్తుటఁ దొప్పదోఁగి।
మెదలఁగాలేక శల్యముల్ వదలియప్పుడు
రథముపై వ్రాలెహారామరామయనుచు॥ 49

గీ॥ అట్టి ముర్వురు దమ్ములు యిలనుగూల
కాంచి రాముండు విలయకాలాగ్నిగతిని।
మండిశతకంధరుని బరిమార్పఁదలఁచె।
నంతలోఁకుశుఁడ సురకునడ్డ పడియె॥ 50

గీ॥ పడినవానియలు కపాటించి దానవ
భర్తగదసి య్యైదు బాణములను।
పూనియేసెనపుడు భూపాలతనయుండు।
తోఁడనేసెయిట్లుతునియలుగను॥ 51

ఉ॥ వెండియునన్ని శాచరుడు వింతగరక్కసు మీఁదనల్కమై।
కాండపరంపరల్ పఱపఁగప్పిన నయ్యెడ చొచ్చియాలవున్।
దండజ బాహురీతి దనుజావలినెల్లను ద్రుంచిఖండనోఁ।
ద్దండతరాశుగంబులన దానవనాయకుగ్రుచ్చెచెచ్చెరన్॥ 52

చ॥ శిశువుల మీఁద బోదునను చేకొని మ్రింగఁగబూని వచ్చునోన।
ప్పశుపతియుగ్మమోవెలయభైరవయుగ్మ మోమృత్యుయుగ్మమో।
యశునుల యట్లుదాకి వివిధాస్త్రములంచు నమోఘవిస్ఫుర।
ద్విశిఖములేసె యేసినను వింపొడి చేసెకుశుండు వెండియున్॥ 53

ఉ॥ క్రమ్మరనగ్ని కల్పమగు కాండశతంబు శరాసనమ్మునన్।
సమ్మదవృత్తి బూని నృప చంద్రుఁడు రాముఁడు సత్యశీలుఁడై।
ఇమ్మ హిమించునేని దనుజేంద్రుహస్తశతద్వయంబువై।
రమ్మునద్రుంచగాకనుచురవ్వఁగ నార్చుచు నేసె చెచ్చెఱన్॥ 54

చ॥ ధరణి వణంకె జీవములు తల్లడమందెకులాద్రులెల్లది।
ర్ధిరముగ పెల్లు గా దిరిగె దేవతలున్ భయమంది యేల్లది ।
క్కరులొగి మ్రొగ్గె నంతశతకంఠుఁడు జూచి యమోఘవృత్తి మై।
శరనిచయంబు లేసె నతి సాహసలీల హుంకరింపుచున్॥ 55

చ॥ దనుజుఁడొనర్చు బాణములు తక్షణమందులద్రుంచి వచ్చిచి।
వ్వన ననలంబు లోకమున నొక్కటనిండి తదీయ హస్తపం।
క్తిని విదళించి తోడనె యెదిర్చిలవుండనలాస్త్ర సంఘముల్।
కనలుచు నేసిరక్తములుగారకనుండనొనర్చి వ్రేళ్మిడిన్॥ 56

చ॥ కరములు వ్రాలినం దనుజ కాంతుడు బ్రహ్మదలంచెఁదల్చినన్
కరములు వెండియున్ మొలచె గ్రక్కున మొలచిన వెంటనేధను।
ర్ధరులై విరించి యుగ్రతరఘోరశిలీముఖపావకార్చునే।
ర్పరపుచునేసె నేసినను బాలురుమూర్ఛిల నొంది రిద్దరున్॥ 57

చ॥ మఱియును శబ్దభేదులగు మార్గణ సంఘము లేసినంధరా।
వరుసుతు యుగ్మకంబునిరువంకలగాడి మహాద్భుతంబుగా।
నరవరుఁడున్ మనంబున ఘనంబుగఁగంపిలు చుండ దేవతల్।
హరహరయంచుఁ జూడ విగతాయువులన్ వెసఁజేసి శ్రీఘ్రుతన్॥ 58

మ॥ తనపుత్రుల్ తనతమ్ములున్ దనుజు చేధాత్రీ స్థలింగూలినన్।
తననేత్రంబులనశ్రువుల్ చెదర చిత్తంబందులంమండుచుం।
ఘనతం వాయుజు మీఁదనెక్కిత వెన్కన్ సీతశోఖిల్లఁగా
దనుజాధీశుని డోసెనెల్ల సురబృందంబుల్ విలోకింపఁగన్॥ 59

మ॥ దనుజేంద్రుండును డోసి రాముని మహోద్దండ ప్రతాపంబునన్।
వనధింబిండలి పండులయ్యె నచల వ్రాతంబులుందూలిచ।
య్యనధాత్ర స్థలిగ్రుంగె దిక్కరి సమూహంబుల్ వెసన్ మ్రొగ్గెది।
గ్గనబుట్టెన్ దరమెక్క మ్రోతయ జుఁడు కాలంబులెన్నెమ్మదిన్॥ 60

ఉ॥ రెండు పయోధులో మఱియు రెండు కులాద్రులొరెండు చిచ్చులో।
రెండు మదించి నేనుఁగులొరెండుమృగేంద్రములో యటుందునిం।
ద్రుండును రుద్రుండువరసరోజ భవుండును గూడియద్భుతా।
ఖండమనస్కుపైదివిని గన్గొను చుండిరి మాటిమాటికిన్॥ 61

వ॥ ఈవిధంబున చాప విద్యాగురుండగు రఘువరుండును త్రిలోక కంటకుండగు శతకంఠుండును మహాయుద్ధ సంరంభులైగదసిన ఇట్టి సమయంబున హనుమంతుండు మేరునగంబు నుంబోలిదన వాలంబు రామచంద్రుని ముందట నడ్డంబు నిల్పి దనుజవల్ల బుండేయు శరంబులనుగ్గును లియన్ జెలంగేవిభీషణుండును మానవదానవనాయకులు పెనంగు నెడరాముని శరంబులచే నసురరక్తంబు చదలక యుండనడుమ నడుమ నాగ్నేయ వాయవ్యాస్త్రంబు లేసెదననిపావని మరువుననిల్చి యుద్ధ సన్నద్ధుండయ్యె। నంతవిలయసమయ మహానలాకీలకరాళంబు చాడ్పున నూఱు మొగంబులమంటలొాదవననేక సాయకంబులు నృపవరుని పైఁబ్రయోగింపనవి యెల్లను హనుమదాభీల విశాల వాలంబుననె వజ్రపర్వతంబు సోకితునియెల య్యెనంత॥ 62

మ॥ పటుకోదండమువంచి రాముఁడమరుల్ భాసిల్ల దీవింపవి।
స్ఫుటనారాచములూని యార్చియల రక్షోనాథుపైసే యనా।
చటు లాస్త్రంబులు నింగిముట్టిత గనాశ్చర్యంబుగోనాటియొ।
క్కటి నన్నింబటు చూర్ణమయ్యె దనుజాంగ ప్రాభవం బేమొకో॥ 63

సీ॥ ఒక్క దివ్యాస్త్ర మత్యుగ్రశరాసనం।
ఋనఁబూని రఘురాముఁడొానరసేయ।
అవిభటునకు నైదు హయమునకిరువది
నైకరినంబున గుచుమఱియు
సారధి కిన్నూఱు చక్రంబునకు వెయ్యి।
పాలుపారు కేతనంబున కులక్ష।
రధికుని కరువదిలక్షలు నై భూమి।
యంతయునిండనత్యంత శ్రీఘ్ర।
గీ॥ మన్నియును గూడ దనుజేంద్రుడంతవేగ।
నడుమనే త్రుంచి కుపితుఁడైపుడమి వణఁక।
రాము పై నేను బాణపరంపరను
తచ్ఛరంబులు వాలంబు దాఁకివిరుగు॥ 64

ఉ॥ వెండియుదానవేశ్వరుఁడు విండ్లొ కనూఱు కరంబులందును।
ద్దండతఁబూని సాయకశతంబు దిశల్ వణకంగ నార్చియున్।
గ్రుండగు రాము మీఁదబురి గొల్పి రయంబున నేసె నేసినన్।
దండిగలోకమెల్ల వివిధ స్థితి నిండె మహాగ్ని పెల్లుగన్॥ 65

శా॥ అక్కాండంబులు గొన్ని వాయుజమహో గ్రా ఖీల వాలంబొగిన్।
జక్కందాఁకెహతంబు నొందె మఱి వీఁకంగొన్ని భూపాలకున్।
ప్రక్కల్ వ్రయ్యఁగ దూరి పాఱెనతివైరంబొప్పంగాఁగొన్నిపెం।
పెక్కన్ వచ్చి విభీషణుందగిలె దేవేంద్రాదులీక్షింపఁగన్॥ 66

శా॥ రామక్ష్మాధి పుఁడందుకున్మది మహో గ్రంబొప్పఁగాకర్కశో।
ద్దామాఖీల శరంబు లేర్చి గుణమున్ దర్పోద్ధతిం మీటిసం ।
గ్రామం బందుల రాముడుండవలె లేకన్దా నవుండుండుటకు।
స్సేమంబొప్పఁగ సిద్ధ మొందవలె వర్ణింపంగ రెండుండునే॥ 67

మ॥ అనుచుంవింటనమర్చి యార్చి నిజబాహాశక్తి నుంకించిచ।
య్యన పెల్లేసిన తచ్ఛిలీముఖములత్యంత ప్రచండా కృతిం।
దనుజాధీశునిగాడి యవ్వల వినోదంబొప్పఁదూరిపే।
గనయచ్చేరువనున్న కొండపగులంగాఁదాఁక నుగ్రంబునన్॥ 68

శా॥ అంతన్ మారుతిచెంతనిల్చి పటురోషాయత్తుఁడైవింటన।
త్యంతో గ్రానల బాణముల్ దొడిగి యద్దైత్యేంద్రురక్తంబిలన్।
బంతంబొప్పఁ దొరుంగకుండఁబఱపెన్ బ్రహ్మాదులాశ్చర్యులై
వింతంజూడగనవ్విభీషణుఁడు హృద్వీథిం ముదంబుదుచురాన్ 69

శా॥ దానంజేసియు తన్దురక్తమిల మీఁదం జెందకున్నన్హరి।
ధ్యానంబొప్పఁగ నట్టహాసమొదవన్ దర్పంబుమైనార్చుచున్।
మానంబుల్ చెదరంగ।దిట్టుచును దుర్మార్గంబునన్ హాపరా।
ధీనా యోరివిభీషణా దుని మెదన్ దివ్యేది వీక్షింపరా॥ 70

మ॥ అని పెల్లార్చి సమంత్రకంబుగ మహోద్యమచ్ఛక్తి సంధించియ।
ద్దను జాధీశకులాపరాధునిలమీదంగూల్చి రమ్మంచు పై
చిననంతంతుకు చిచ్చులీనుకొనుచుం శీఘ్రంబునం బోయిుగ్ర
క్కున బంధించెవిభీషణుంసురవరుల్ ఘోషింపఁగాఁ జెచ్చెరన్॥ 71

సీ॥ అది చూచి రాఘవుండన లాస్త్రములు వైచె
కంటకుండగుశతకంఠుమీఁద
నవిద్రుంచిదానవుండైద్రాస్త్రములు వైచె
నవిద్రుంచి నృపుడేసెనహిశరములు।

నవిద్రుంచి వాయుబాణా వళిదనుజుడే
సిన నవి ద్రుంచినజ్జనవిభుండు।
నారాచతతులేసె నగుచునద్దానవ
భర్త రథం బెల్ల భస్మముగను।
గీ॥ విరథుఁడై యంతవేఱొక యరదమెక్కి
పృథ్వి వణకంగ విండ్లెక్కు వెట్టుబూను
నతనిచాపంబులును విశిఖాలివలన
ఖండములుగ జేసె భండనోద్దండుఁడగుచు॥ 72
సీ॥ చాపముల్ వూయిన కోపగించి శతాస్యు
డురువడి మండుచునున్నయట్టి।
శూలంబు కరమునచోద్యంబుగాఁబూని
బ్రహ్మాండ మంతయుబగుల నార్చి
కనలుచు జనవల్లభుని జంపుమనియేసె।
ఏసిన జలనిధు లెల్లనింకె।
గులగిరులదరె దిక్కులు వ్రయ్యలగు చుండె
నింద్రాదులద్భుత హృదయులైరి।
గీ॥ నంతయది డాసివిలయ కాలాగ్నిరీతి।
మండుకొనుచు నురాగహనుమంతుఁడపుడు।
వాలమల్లార్చి వచ్చెడి శూలముగ్ర।
వృత్తి వెసఁ బట్టి నడిమికి విరుచుచుండె॥ 73
సీ॥ హనుమంతుడందుచే నదవదపడుచుండ
నిదిసమయమురామునిలను గూల్ప।
నని నొక్కగదతోడ నడచెరివ్వునదాని।
తాకున కొక్కితంత తల్లడిల్లి।
మనుజవల్లభునాడాత్మ గనలుచు నర్ధచం।
ద్రాత్రశతంబు శరాసనమున
సంధించి దేవతాసముదయంబుల భక్తి।
యొనర నాపైఁగల్గి యుండెనేని

గీ॥ వాని హస్తంబులును తలల్ వసుధఁగూలు।
గాకయనివైచెదైత్యుండు కళవళింప।
నమరులద్భుతమంది హాహాయనంగ।
ఖండలై గూలెతలలును కరశతములు॥ 74

సీ॥ కూలి క్రమ్మరతొంటి పోలిక మొలచెను।
కరములు తలలు నక్కజముగాను।
నాశతాస్యుని రక్తమవని పైఁదొరగిన
మొనసి నూర్గురుశతముఖులుపుట్టి
ఎక్కడఁజూచిన నక్కడ నటువంటి
వికృత దైత్యులు వెల్లి విరిసి యుండ।
నన్నిదిక్కుల బోర నందుకు రఘురాము
డందందబోరుచు నడలు చుండ।

గీ॥ నంత హనుమంతుఁడా శూలమపుడు ద్రుంచి।
సీత నెక్కడఁదగులు నోశి తకరమ్ము!
లనుచువాలంబు చుట్టి రాదిగిచియుండె।
నగుచు సురలుబ్బఁగా మేరునగము రీతి॥ 75

ఉ॥ రావణ కుంభకర్ణుల శరంబుల గూల్చితినంచుమమ్ము ద్రు।
ర్భావమునంబానంగవెసఁబాల్పడి తెందులకేగువాఁడవీ।
వేవిధినైన నిన్నుదునియించి భవత్తనుమాంసమఖండముల్
వావిరి మైభుజింతు మికవార్థులు జొచ్చినఁ బోవనిత్తుమే॥ 76

గీ॥ కొందఱిట్లు ని తిట్టుచుకొందఱలఁగి।
సాయకంబులఁగుప్పుచు శౌర్యమహిమ।
జూడుమనుచునుయక్కడఁ జూచిననుశ।
తాస్యమయమయ్యె నట సురలకట యనగ॥ 77

గీ॥ అపుడు నిర్విణ్ణుఁడై చాపమచట వైచి।
చేతులాడక మిగుల నిశ్చేష్టుఁడగుచు।
నవ్విభీషణువీక్షింప నతఁడు శక్తి।
బద్ధుఁడైయున్నఁ బవనజుఁబారఁజూచి॥ 78

శా॥ ఏచందంబున గెల్చువాఁడకని నేనెట్లాగునమ్మింతునీ।
నీచాత్ముండెచటుంగనుంగొనిన ఁదానేయున్న వాఁడేగతిన్।
భూచక్రంబున సన్మునిప్రవరులంబోషించు తేలాగున్।
నాచేతన్ మనఁగోరు వారు నెపమొందన్ హేతువయ్యెంగదా॥ 79

వ॥ అని యనేక తెరంగులచింతింప మగని వగవుగనుంగొని సీతామహాదేవి తనయాదిమహిమంబు జూప సామర్థ్యంబు దలపోసి తనచేత సాధ్యంబుగాఁ దెలిసి కరంబులుముకుళించి కులసుద్వార్ణ సంపూర్ణిమాచంద్ర। మదీయ ప్రాణనాథ। భవన్మహిమంబున గొంతసేపునేనును మీచేతి విల్లును బాణంబులుంబూనిరి పులతోడంబోరెదఁ నాడదానని యను గ్రహంబు సేయకుండదగదిట్టి సమయంబున మీకునలయకందీరుదను కనుం దివిరి వివిధవిశిఖపరంపరల చేపె నంగెద నాకర్ణింపుమని బెక్కుచందంబుల బ్రార్థింప రామభద్రుండు తనమనంబున నద్భుతంబొంది మున్ను తనతోడ వసిష్ఠుండెఱింగిచుటకును జానకిందన కుశలవు దయసేయమనుటకు। మొదలవిరించి గోరు నెడశతాస్యుండు స్త్రీలందల పకుండుటకును। ఏతత్ప్రకారంబునసై దనుజుండు మడియుట సిద్ధంబని మనంబునందోచిన నలరి బాణాసనబాణ తూణీరంబుల దీవించి యొసంగి ర నవ్వేళనస్వి మలాంగియును పరజ్యోతి స్వరూపంబుగైకొని హనుమంతుని భుజముపై మిన్ను ముట్టనిలచి తన మహాతేజంబు భూనభోంతరాళంబు పరిపూర్ణంబుగానిండి మహోద్దండంబున కోదండంబెక్కిడి సకల బ్రహ్మాండ భాండంబులు ఘూర్ణిల్ల గుణటంకారంబుగావించి తన మహామాయనాకర్షించినది పోడచూప నీవు దనుజుని రక్తబిందు పరంపరలు ధరందొరఁగకుండ నెవ్వరికి నదృశ్యంబై నాలుకనెటుచూచిన యోజనమునేలంబరపియుండు మని నియోగించిన రాఘవుండాశ్చర్యమానసుడైచూచుచుండన మోఘబాణంబులు నిగుడించి శతముఖులందఱ నొక్కదిక్కునకుదావాయవ్యాస్త్రంబునంద్రోయుచు। మహోద్దండ ప్రచండభండనంబు గావించె। నద్దానవనాయకని చయంబును తదీయతేజోవిశేషంబువలన వేతులాడక చూచుచుండి రాసమయంబున॥ 80

గీ॥ విల్లుఝుడిపించి కర్కశ భల్ల శతము।
పూనిదేవతలెల్ల నద్భుతమునొంద।
పద్మజాండంబు పటుపటుపగుల నార్చి।
ఎలమి తన పతి వినుచుండ నిట్టులనియె॥ 81

గీ॥ మూడు మూర్తులకును నేను మూల దుంప।
నగుదునేని శ్రుతుల్ సత్యమగు నయేని।
పుడమినిజ శక్తి శతకంతుడొక్కడును దక్క।
యున్న శతముఖ హీనమైయుండుగాక॥ 82

॥ అనుచువైచిన నందఱు నాక్షణంబ
నీరు గావింపమాయమై పోరుమాని।
చనిరి వెండియు దానవ చక్రవర్తి।
సీతపై నేసెనుద్దండని శితశరములు ॥ **83**

॥ ఇన్విధంబున తన రక్తమిలను దొరుగ।
యందు బుట్టిన శత కంఠులణఁగ నందు।
వలన నిదిమాయఁగాబోలు వనితయ్యైన।
నిట్టి తెఱఁగున బోరుసే బెట్టిదముగ॥ **84**

॥ అనుచు క్రమ్మర జానకి నరయుచుండ।
విష్ణుఁడును బ్రహ్మయును మఱివిశ్వపతియు।
విలయ పావకుఁడును మహావీధిగాన।
బడిననది జూచిమదిభయపడియెనసుర॥ **85**

॥ రామునిదేవి బాణములు రాక్షసునాయకు మీఁద నార్చియా।
రామచెలంగి వైచిన నరాతిభయంకరమై కణంకతో
వేమరుఁబోయి దానవుని విండ్లొగిద్రుంచి, కిరీట పంక్తులున్
భీమముమీరడుల్చిస రెపెట్టె తదీయ శరీర తేజమున్॥ **86**

॥ ఎచ్చట జూడ నచ్చటనెయెమ్మినిమృత్యువు బోలి సీతదా।
మచ్చరమొప్పనిల్చి తను మార్గణపంక్తుల నొంపఁబూనఁదా।
నచ్చెరువంది యాహరిహరాదులకైన వశంబుగాదుగా
చెచ్చెర నిమ్మహామహిమచేఁదనకున్ మరణంబు జొప్పడున్॥ **87**

। అనుచు రథంబుపై నిలువ నద్దనుజాధిపు మీఁద నల్కమై।
ననలశిలీముఖంబులు నహస్రశతంబులువైచె వైచినన్।
దనుజుఁడు సొమ్మసిల్లియరదంబున మూర్ఛిలి వ్రాలె వ్రాలినన్।
గనుగొనిసూతుఁడున్ రథముగ్రక్కున దోలెరణంబు పాయఁగన్॥ **88**

పుష్పంబులర చేత బూననోపనిచెలి।
ఇషు పరంపరఁబూన నెట్లు నేర్చె।
చిల్క పల్కులకు బిట్టుల కోమలియిల।
యెల్ల భీతిలి నార్వనెట్లు నేర్చె।

సేదక్క నన్యుల వీక్షింప నేరని
యింతి సేనలఁగూల్ప నెట్లు నెర్చె।
విస విసనడువంగ నసియాడు కొమ్మసే
రీతియుద్ధము సేయ నెట్లు నెర్చె।

గీ॥ ననుచు రాఘవుఁడద్భు తహర్షవార్ధి।
నోలలాడుచు హనుమంతువాలమహిమ।
వినుతి సేయుచు నాతని వీపుమీఁద।
నుండె జానకిపై ప్రేమనిండు కొనగ॥ 89

ఉ॥ అంతట దానవుండును రయంబున మూర్ఛ దేరి సారథిన్।
వింతఁగఁజూచి యోరి పరవీరులు నవ్వ రథంబు దెత్తురే।
యెంతటి వారలైన పరమేష్ఠియొసంగిన యవ్వరంబుచే।
నింతయున స్త్రైనంకఁగలరే మహిగూలుదురింతెకా గొగిన్॥ 90

చ॥ అనవినసూతుఁడిట్లనియె నక్కట నాథుఁడు దండలేనిచో।
ఘనవిశిఖంబులన్ మనల గ్రక్కున శల్యములుచ్చి పాఱఁగా।
గనలుచు నేయజానకిని గాంచి సురల్నుతియింప నట్టిచో।
దనుజకులాధినాయ రథంబు మరల్పకయుంట ధర్మమే॥ 91

చ॥ వెఱచిన యట్టి వేళమఱివింతగ కైదువ చక్కఁబూనఁగా।
మఱచి నయట్టి వేళ పలుమాఱునరాతికి వెన్ను జూపుచున్।
బఱచిన యట్టి వేళనగుబాటు ఘటింపఁగ జేరిపూరిదా।
గఱచిన యట్టి వేళ నెడగల్గ రథంబు మరల్చు టొప్పుఁగున్॥ 92

చ॥ అనుడుతదీయ నీతి వచనాళికి నుత్సవమంది వానికిన్।
ఘనత ననేక వస్తువులు గ్రక్కున మక్కువనిచ్చి, నేటికా।
జనకజ తోడఁబోరుటకు శక్యముగా దటుఁగాన రేపుస।
య్యనసరుదెంచి రాముని శరావళిచేనణగింతు వేగనన్॥ 93

ఉ॥ ఘోరునఁ బోవనిమ్ము మన భూరిరథంబు గృఁబు చేరఁగా।
నా రఘురాముదేవి వినుమల్ల దెచంపఁగ వచ్చె బూనినా।
క్రూర శిలీముఖంబులల కోమలి పైబని సేయపెల్లుఁగా।
కారణమున్న దోయనుచు కుందుచునేగె శతాస్యుడింటికిన్॥ 94

శా॥ ఆరీతిం శత కంధరుండు తన గేహంబొప్పఁగాఁ జేరియా।
కారం బెల్ల ను చూచి భీతి నతిదుఃఖ ప్రాప్తుడై మీఱిసొం।
పారం జానకి మృత్యువై దగుమహో గ్రాగ్నేయ బాణంబులన్।
వైరంబొప్పఁగవైచునో యనుచు గ ర్వంబెల్లఁదూలెన్ వెసన్॥ **95**

వ॥ అనిమఱియు ననేక మార్గంబులదివ్యతే జోమహిమంబులను శరంబుల వేగంబును। బాణచాతుర్య సంధానంబును। ఉపసంహారచమత్కృతియు నుగ్గడింపుచు నెక్కడగనుగొన్న నక్కడ పరంజ్యోతి స్వరూపంబగు సీత గనుపడిన భీతిల్లుచు తనకు నింకమరణంబు సిద్ధంబనినిశ్చయింపుచు సెజ్జపై। బొరలుచుండు తనయుని విలోకించి తల్లియగు చిత్రగంధి డగ్గరి తనదుకరంబున తద్గాత్రంబు నివిరి రక్తప్లుతనిమ్నోన్నతంబు లైయపరిమిత శరంబులు నాటి యందునువిరిగియున్నగనుంగొని విలపించియిట్లనియె। అయ్యా నెయ్యంబున నేబలుకువచనంబులు వీనులంచొరనీకయింత చేసుకొంటివి ఆయమ్మ యెక్కడ నలుగునక్కడ నిర్మూలంబగు। నెక్కడ కరుణించిన నక్కడఁగల్యాళాభివృద్ధి యగు నప్పరంజ్యోతి మాయకు బ్రహ్మరుద్రాదులలోనె గానివెలియై ప్రకాశింపనేరరు। భూనభశ్శైలసవము ద్రాద్యపారస్థావరంబులును వృగాండ జోరగ విపిపీలికాద్యసంఖ్యజంగమంబులునుగలుగు బ్రహ్మండంబులు నూఱుకోట్లు బుట్టుచుఁగిట్టుచు నమ్మహాశక్తియందు నటియించు ఆదిమధ్యంబును విలయంబునమ్మహామహిమంబునకుంగనుపడవు నీకు విరించి పురుషులచే చావులేకుండ వరంబొసంగు నప్పుడు। దేవతలుగినిసి యిట్టి వరంబులొసంగిన దానవుండు లోకంబుల బాధ పెట్టు నింతవత్సలత నీకుందగదని దూరిన నతండునులజ్జించుచు శతముఖుండు పురుషులందడలెగాని తరుణుల దలం పండటు గాన మిమ్మును గోబ్రాహ్మణుల నెప్పుడు చెనంకునప్పుడే జానకీదేవి తనతొంటి రూపంబున వధియించు నిందులకు సందేహంబు లేదని బలికె అదిగావున సీతయు చిద్రూపంబగు మాయగాని సామాన్యకన్యక గాదు ఎట్టిచందంబుననమ్మగువ చేభవాన్నశంబు సమకూరుట సత్యంబు ఇటమమ్మును పుత్రమిత్ర కళత్రంబులను మనుపంజూచెదవేని సీతారాములకు శరణంబు జొచ్చి తల్లిదండ్రులు మీరు దప్పమా కునితరులు లేరు రక్షింపు మనిపలికి సకల భోగంబులందేలుచుఁ బ్రతుకుమని పెక్కుచందంబులంబలికి న పలుకులు ములు కులచందంబున కర్ణరంధ్రంబులు సోకిన నులికిపడి తల్లితో నిట్లనియె॥ **96**

సీ॥ ఏనలిగి చూచిన నినుఁడు బెట్టి దముగ
వేయికరములయెండ గాలువెఱచు।

నాకుభృత్యులరీతి నాకులందఱుకను।
సన్నుల బనువెల్ల సల్పుచుందు।
రఖిలజీవుల నొంచుయముఁడు నాముందట
కోలకాడైయుండు వేళయెరిగి
సకలలోకములకు సఖ్యతలేకుండ।
మొనసియడచిన యట్టి మృత్యువునకు।

గీ॥ నేను మృత్యువునైయుండి యెనయుచుందు।
మఱియు నాయందు గల మహిమశివునకు।
నైన జొప్పడఁదట్టి నన్ననరుఁడు।
యతివయును గెల్వగలరెనేనణఁతుగాక॥ 97

గీ॥ రేఁపుచని శత్రువుల నెల్లసేపుమాపి
వత్తుగా కొండు వార్తయు వలవజనదు।
మీయటంచును తనతల్లినింటికనిచి।
నెలఁతయునుదాను నారేయి నిద్రజెందె॥ 98

సీ॥ అక్కడ రఘురాముఁడనుజుఁడు తనయులు।
సొరది గూలినఁజూచి శోకమంది
ఏమని వివరింతునేమి సేయుదువీరి
నెచ్చోటు పొడఁగందు నెప్పుటట్టు
కుశుఁడెన్నటికి నన్ను కొమరొప్పవీక్షించు।
నెఁడు కప్రియ భాషలాడుచుండు।
లవుఁడెన్నటి కిఁగలుగు లక్షణవంతుండు।
బాలుండు నామీఁద ప్రాణ పదము।

గీ॥ అనుచునుండంగ సీతనాయకుని జూచి।
యేడ సోదరులధికులకేడసుతులు।
రణగతులు మానియిట్లుడలంగఁదగునె।
యనఘసంసారములు మాయలనఁగవినవె॥ 99

సీ॥ అనుచరాముడు దానుహనుమంతుఁడును నవ్వి।
భీషణుకడకునేఁగియితఁడు।
మమునమ్మి వచ్చియిమ్మాడ్కిని బద్ధుఁడై।
యున్నాడు రక్షింపకున్న దోష
మొనసియాతఁడు జెందుమూర్ఛఁదెలసి।
మని శక్తి శరమున నలుకయై ఖండించి
తెలసిననతఁడు ధీరాత్ముఁడైలేచి।
వాని కోమలపదవారిజముల।
గీ॥ బడిన దీవించి యతనితోఁబరవరభూమి।
చూడవవెనని దివ్వాలు సౌరది బూని।
కవులఁజూపుచు నంతంత కదలుచుండ
పరఁగభల్లూకపతి గానపడియెనచట॥ 100
సీ॥ ఆతని జూచి రామానుమతంబున।
బవన జుఁడల్లనఁబలుకరించె
జాంబవంతుఁడ నన్నుసరవిమైనెఱుగదె।
యోపు దే లేచి రానొక్కదెసకు
నావిని మారుతనందను ఁడీతండు
గాబోలునని ధృతిగలిగి తెలిసి।
హనుమంత రమ్ము రామావనీనాథుండు।
పరిణామమున దనభార్యతోడ।
గీ॥ నున్నవాడె విభీషణుండున్న వాఁడె।
బ్రతికియున్నాఁడె పవనజ భానుసుతుఁడు।
పరమబంధుండవగు నీవు పలుకరించి
నపుడె బ్రతికితి నీకృపకపివరేణ్య॥ 101

సీ॥ కన్నుల శరములు గాడి యొక్కింతయు॥
తెలియవశక్యముగాదు తెలివిపడదు।
వీనులు వినరావు వివశత్వమొదవెడు
దేహంబు మరణ సందేహముననుం।
లోలమై బలుక నాలుకరాదు నోటను।
దడిలేదు లేచిన బడుదు మరల
గావున శరములుగాడి యున్నవిమేన।
నన్నియు దివియు మాయన్న యనిన ॥

గీ॥ రాముడన్నియు దీసి కరంబులందు
దేహమెల్లను నివిరిచింతింపనేల।
నేను రాముఁడనలేచి నృపుని పాద।
వనజముల మీఁద నందంద వ్రాలిఁదెలసె॥ 102

వ॥ మఱియు బరికింపుచుంజనెడిసమయంబున। 103

ఉ॥ అంతకు ఁదెల్లవారి విలయాంతకు కైవడినాశతాశ్యుఁడ।
త్యంత పరాక్రమంబున మహాహవదీక్ష వహించియామరు।
జ్జాతుభుజంబులం నిలచి జానకి చెంతను రామచంద్రుడున్।
ప్రీతిదలిర్పనుండెను విభీషణుఁడుం జనెవారి పొందునన్॥ 104

చ॥ అపుడు సమస్తలోకములు నచ్చరువంది కృశింపుచుండెఁదా।
నపుడు పయోనిధుల్ గలఁగెనప్పుడు పర్వతముల్ చలించెనా।
రపమని మృత్యువచ్చుటఁ బరామరిసింపుచునుండె బ్రహ్మయుం।
గుపితమనస్కుఁడయ్యెనదిగో విలయంబని మాటిమాటికిన్॥ 105

ఉ॥ సర్వసు పర్వులున్ సకల చారణులున్ వరకిన్నరేంద్రగం
ధర్వులు సిద్ధ సాధ్యులు ముదంబు నభ్రమునుండివారిదో।
ర్గర్వము బాణనైపు ణియుగాఢతరప్రతి భాషలున్దయా।
గర్వమనస్కులైనిలిచి కన్గొను చుండిరి యద్భుతంబుగన్॥ 106

ఉ॥ జానకివారి జూచి దనుజప్రభుద్రుంపద్రుణంబునాకు ని।
ద్దానవనాథుతోడ వివిధ స్థితి ఁబోరఁగజూడఁగోరిఖ।
స్థానమునన్ని లింపులు విశాలత నల్ల దెయున్నవారుసే।
బూని తదీయచిత్తములు బొంగఁగఁబోరెదచిత్తవైఖరిన్॥ 107

చ॥ అని శరసంఘమేయ దనుజాధిపుఁడన్ని శిలీముఖములన్।
దునియఁగ నేసివాయుజుని దుష్టత రాగ్రత వృత్తి జూచియా
వనచరుజంపినన్మనుజవల్లభుఁడున్ సతియున్న శింతురో।
య్యున నిజమంచు నిష్ఠురమహాస్త్రము వేర్చెశరాసనంబునన్॥ 108

ఉ॥ ఇగ్గతి బాణముల్ దోడిగి యెమ్మిద విర్చఁగ నార్చు చున్సుధా।
భుగ్గణ మెల్ల నద్భుతము బొందుచుఁజూడఁగనేసెనేసినన్।
దిగ్గన సీతఁజూచి యతితీవ్ర శరంబుల వాటి నెల్లఁదా।
నగ్గలమైన కోపమున నల్లన ద్రెవ్వఁగనే సెనుగ్రతన్॥ 109

ఉ॥ అందులకున్ మహాద్భుతమునందుచు శాతశిలీముఖంబులన్।
క్రందుకొనంగ జానకిని గ్రక్కున నేసి నెల్లదేవతా।
బృందములుత్సహింప నతిభీషణ ఘోషపరంపరంబుచే।
ముందుఁగద్రుంచె తచ్ఛరసమూహములన్ రఘునాథుసడుబ్బఁగన్। 110

చ॥ అవియును గాక ఘోరవి శిఖావళివింటనమర్చి యార్చి యు।
ర్వివికృత దైత్యనాయకుకిరీటములుంబటు చాపముల్ గడున్।
భువిబడనేసి చండతరభోగి శరంబుల వాని తేజము।
గ్రవిధినణంగఁ జేసి యతిగాఢతర ప్రతి శౌర్యకోపియై। 111

ఉ॥ చాపములంగిరీటములు సార శరీర విశాల తేజముల్।
ఏపునబోయినన్ రఘుకులేంద్రుని దేవిపయిన్ మహాహనా।
టోప గదాచయంబునుఁగడుంవడి రువ్విన నగ్గ దాశిను।
ద్దీపిత సాయకంబులద్రుతింబొడిజేసె సురల్ నుతింపఁగన్॥ 112

ఉ॥ అంతటిలోన సీతవిలయానలకీలయుఁబ్రోలెనాత్మలో
నెంతయు రోషమెత్తి దనుజేంద్రు శిరంబులు గూలుగావుతన్।
వింతనంచునేసె నొకవిష్ణుశరంబున నేయనెల్లరా।
స్త్రాంతములందుఁబిక్కటిలనగ్ని పరంపరలీనుచున్వడిన్॥ 113

చ॥ చని శతకంధరుతలలు చయ్యనద్రుంచి తదీయ హస్తముల్
తునియలు జేసి వచ్చె నటుతోడనె మొల్చె శిరఃకరంబుగ్ర।
క్కున ఘనలీల మొల్చెనవి గాంచెధరాసుత వెండియుంరయం।
బునఁబడనేసెనప్పటికి భోరున మొల్చెను మస్తహస్తముల్॥ 114

ఉ॥ ఎప్పుడువిల్లు బూనునొకొయప్పుడు నిక్కుచు నెక్కుపెట్టెనో।
యెప్పుడు తూణమందునొకొయెప్పుడు బాణము లేర్పరించునో।
యెప్పుడు పూనునోశరము లెప్పుడు ద్రుంచునోయెప్పడాతలల్।
గుప్పున మొల్చునోయను చుఁ గోరి సురల్ గనుచుండెరద్దివిన్॥ 115

క॥ నక్తంచరలోకేంద్రుని
రక్తముయిలమీఁదటన్ దొరంగకయుండన్।
యుక్తముగనపుడు మాయా।
శక్తి వెసంద్రాగు చుండె సయ్యుననడుమన్॥ 116

క॥ ఇవ్విధమునఁబోరాడఁగ
నవ్విమల శరీరిజనకజాత్మ జజూడన్।
మవ్వముగనజుఁడు రుద్రుఁడు।
నవ్వుచుదివినుండి రపుడు రమణులతోడన్॥ 117

ఉ॥ అప్పటి కిన్ధరాసుతరయంబున దానవనాధుమస్తముల్।
గుప్పున గ్రూలఁనేసె నవిగొబ్బునవెండియు మొల్చె మొల్చినన్।
దప్పక మళ్ళీ దాదునిమెఁదాకొని క్రమ్మర మొల్చెఁదామఱిం।
జప్పుడుగాక యుంశితసాయక ధాటిని గూల్చెచెచ్చెరన్॥ 118

ఉ॥ ఖండలు సేయఁగామొలవఁగాదలకాయలు తండతండమై।
కొండల రీతిఁబ్రోవులయి కోరిమరిన్ దివిశోకియిమ్మహీ।
మండలమెల్లనిండిన రమామణి జానకిజూచి యద్భుతా।
ఖండవిచారయ్యై యపుడు కాండము లేయకమాని యాత్మలోన్॥ 119

చ॥ శిరములు ద్రుంచివేసరితి చేకొని చండతరాస్త్ర కోటిచే।
కరములుద్రుంచి వేసరితి కాండములున్ సరిపోయె దానవే।
శ్వరుఁడిల గ్రూలుటం మఱొక జాడలు చొప్పడవేమి చందమో।
వరముల సత్యమేమొగెలు వంవశమేమియుఁగాదు యెట్లొకో॥ 120

చ॥ అనిదను జేంద్రుఁడేసెడి శరావళికిన్ హనుమంతువాలమొ।
య్యనసరి కట్టు చేసి మనుజాధిపు రాముని బల్కరింపుచున్।
దనమహిమంబు దివ్వులు ముదంబున సన్నుతి సేయుచుండఁగా।
మనమున చింతనొందఁగ రమామణిసీతను గాంచి యాడకున్॥ 121

ఉ॥ హారధరాహిరాజ తుహినాచలతారకశైల మల్లికా।
శారదనీరదస్ఫురిత చందనకుందలసత్ప్రభాంగుఁడా।
నారద సంయమీంద్రుడు మనంబునఁబొంగుచు సీతపాలికిన్।
ధీరదయార్ద్రవృత్తి నరుదెంచె రఘూద్వహుండుత్సహింపఁగన్॥ 122

ఉ॥ సీతకు లోకమాతకు విశేషదయాశ్రిత పోషి తాశ్రిత।
వ్రాతకు మేరుధీరణ శివస్తమపూజ్యగుణౌఘశైర్యవి।
ఖ్యాతకు వీతభీతకు మహాత నభావరి భూతచండఖ।
ద్యోతకునున్ నమస్కరణమొయ్యన సేయుచు డాసెడాసినన్॥ 123

ఉ॥ రాముఁడు సన్మునీంద్రునకురాజిత బుద్ధినమస్కరించిమీ।
రేమికతంబునిచ్చటి కి నెచ్చగు మచ్చికనేగు దెంచిరు।
ద్దామపరాక్రమంబొదవ దైత్యుడు పోరగ జొచ్చె ఘోరసం।
గ్రామముమించె నిల్వనెడఁగల్లదు యేమటుచెప్పు యొప్పుఁగన్॥ 124

చ॥ అనవిని మౌని గోప్యముగ నారఘురాముని తోడడాసియి।
ట్లను నకటా శతాస్యుని శరావళిచే నని నెంతఁబోరినన్।
తనరఁగ నేలఁగూలునె వృధాశ్రమమింతియె గాకవీనిగొ।
ఖ్బనమడియింపఁగా నుపమభోరునఁ జెప్పెదచిత్తగింపుమా। 125

గీ॥ వీని నాభిని చుట్టు రాబూనియలవి
శల్యసంజీవి కరణుల తుల్యముగను।
గలిగియున్నవి తద్వస్తుఘనతఁజేసి।
తలలు కరములు తెగియును మొలవఁదొడఁగె॥ 126

గీ॥ బలిమినటుగాన నాగ్నేయ బాణమేసి।
తత్తదుగ్రౌషధములెల్ల ధగ్ధములుగ।
జేసి బ్రహ్మాస్త్రముననొండె వాసిగల్గు।
శక్తిచే నొండె దైత్యుని సంహరింపు॥ 127

అదియెటువలెనన్న నతిశ్రీఘ్రవృత్తిమై।
నెఱింగింతువినుము మహీతలేశ।
తన ప్రధానుఁడు గొల్వ దైత్యేంద్రుఁడఖిలది।
క్కులు గెల్వనరిగెయుక్కనను దొల్లి।
యరిగిసమిస్తామరాదుల స్రుక్కించి।
మరలి వచ్చుచు కణ్వమౌని వనము।
చొచ్చి కలంచుచో శోధించి యమ్మౌని
కూరిమిపట్టినిఁ గోరి చూచి
పొలంతి చక్కఁదనమున కద్భుతమునొంది।
మదన సంజని తాంగుడై మదిని గలఁగి।
యంతకంతకువిభ్రమాయత్తుఁడగుచు।
చెలఁగి విమలాంగియను దానిచేరిపలికె॥ 128

వనటనొందగ నేల వరసౌధమునఁగల్గు।
తూగుటుయ్యలలందుఁదూగరాదె।
కందమూలములేల కడుఘృత పుత్లతముగా।
మించుదేరఁగ ననుభవించరాదె।
నారచీరలు యేల సారమాణిక్యపు।
పట్టుపుట్టంబులు గట్టరాదె।
నేలవ్రాలఁగనేల పూలపాన్పులపైని।
లీల నాతోఁబవ్వళించరాదె॥
ఏల ననుజూడ వీవనంబేలయిట్టి।
జోలెకాఁడైన తిరిపెపుజోలియేల।
యఖిలలోకంబులకుఁ బతినైననన్ను।
గదసి వర్తింపరాదె యోకమలనయన॥ 129

సీ॥ అనవిని విమలాంగి యడలుచునోరిదై।
త్యాధమ యిట్టి వాక్యములుదగునె।
పరసతీజనముల పరధనంబునకుఁదా।
నాశించువానికి నాయువణఁగు।
రౌరవాద్యఖిల నరకములు సిద్ధించు।
చేసినపుణ్యముల్ చెడుదలంప।
మాతండ్రి కణ్వుఁడీ మాటలు వినునేని
కదసినిను భస్మంబు గాశపించు।
గీ॥ యోరినాకావరమునఁబరనారిఁ జెనకి।
మడసి బోయిన కుజనుల మాటవినవె।
యనుచుపొమ్మింటి కూరకేహతముగాక।
తరుణి కై సేల నిట్టి మదంబు కుమతి॥ 130

వ॥ అనిమఱియు చతురోపాయంబుల ధర్మంబులందెలిపియు। మర్మంబులు గలంచియు పాటిగాదని జెప్పియు। అతని తమకంబునకు భయంబంది నాలుగ్గుదిక్కులు పరికింపుచునుండ నుద్దండంబున శతముఖుండుగదసి సకలైశ్వర్యహీనుండగు నొక్కపేద తపసింజెప్పి వెఱపించినం దలంకుదునె యని మదనకదనమునకు నోదవిన తహతహలన్ జెలిపైఁబడి పెనంగి శతముఖంబులచుంబనంబు గావించి యనేక ప్రయాసంబుగా ఁగూడిన నది సద్యోగర్భంబై బాలుంగని యమ్మహాదనుజుని దేహంబు తన పైఁబడుట జేసి శరీరంబు విడిచె తదనంతరంబ। కణ్వుండు సమిత్తుల నిమిత్తము చనినవాఁడై తనపట్టి యొంటి నున్నదియని రయంబున వచ్చి యచ్చోట విహరింపుచున్న శతముఖునింగని భయంబు నొందిపర్ణశాల కునరుదెంచి యందు శిశువు కావునరని యొరలంగ నవ్వల శవంబై యున్న కన్నియనవలోకించి శోకించి తనదపోమహిమంబున నంతయుందెలసి కోపంబున శతగళునింజేరి యోరి యిట్లుధర్మంబున నరుదెంచి నా పెంపుగూతురునిత్తెఱంగున మానభంగంబుగావించి ప్రాణంబులంగొని యున్నవాఁడవు నగుటంగాన నింతిచే నిట్లు నీతలలుతునియలైమరణంబు నొందంగలవని శపియించిన శతకంఠుండును యొడ చేతనలసి తనపురంబున కరిగె। తచ్ఛాపంబప్పుడను కూలంబయ్యెంగావున నాదిపరంజ్యోతియగు జానకి చేత నవశ్యంబునుం గూలు నాలంబునకు నీదేవింబు గొల్పుమని హితోపదేశంబు జేసి యంతర్ధానంబునొందె రామచంద్రుండును మహాశ్చర్య చిత్తుండై సీతకు తద్వృత్తాంతంబంతయు

నెరింగించి యిక జాగు సేయక దనుజుంబరిమార్పుమని పురికొల్పిననలరి। భేరీమృదంగతూర్యాది నాదంబులు వినోదంబులగా నఖిలభువనంబులు నిండ నుద్దండ ప్రచండ భుజాదండంబున కోదండంబంది యనలకల్పకాండపరంపర లేర్చి హయంబులం గూర్చి। సారథిని వ్రాల్చి కేతనంబులు పొడిచేసి చక్రంబులు విక్రంబున ఖండించి పలకలు వ్రక్కలుగా నొనర్చి మఱియును॥ **131**

చ॥ బలువి డికర్కశక్రకచ భల్లశతంబరి వోసివానిచే।
తులు తలలున్ ధరాస్థలిని తోడనె గూల్చి శరీర మెల్లవ్ర।
క్కలుగనొనర్చినం మఱియు గర్వము దూలి వశంబు గాకచం।
చలమున నున్నగాంచియలజానకి నుగ్రత మిన్నుముట్టుచున్॥ **132**

మ॥ అనలాస్త్రంబరివోసి యేసి నది హాహాకారమొప్పంగజ।
య్యన జీవంబులు సంహరింపుచు మహైశ్వర్యంబుగా వాని నా।
ఖిని దానుండు మహౌషధీలతలునాఖీలంబుగాగల్చిగొ।
బ్బున భస్మంబుగఁజేసి వచ్చెను సురల్ భూషింపఁగావెండియున్॥ **133**

శా॥ బ్రహ్మాస్త్రంబరి బోసి దిక్తటము లభ్రంబున్ వెసన్ నిండగన్।
బ్రహ్మాండంబు చలింప నద్రులదరన్వాదోనిధుల్ గల్గన్।
బ్రహ్మేంద్రాదులు తల్లడిల్ల శివుఁడోపంజాలునంచుంబర।
బ్రహ్మంబున్ వినుతింప సీత బలశుంభద్వృత్తి మైనార్చుచున్॥ **134**

గీ॥ అవనిపై నేఁబతివ్రత నైతినేని।
యరయరాముండు ధర్మాత్ముఁడయ్యేనేని
వేదములు సత్యమగునేని వీడు నిమ్మ
హాస్త్రమున దగ్ధుఁడ గుగాక యనుచు నేసె॥ **135**

గీ॥ అప్పుడాదివ్యసాయకమతిరయమున
చిచ్చులీనుచుఁజని వాని చేతులెల్ల।
ద్రుంచి యొకతలచిక్కదుందుడుకు మెఱసి।
కడమతలలెల్ల తలదృణలీలపుడమి గూల్చె॥ **136**

చ॥ మఱియును శక్తి వైవ నదిమండుచు శీఘ్రతనేఁగి దేహమ।
ఖ్బురముగఁజించి యున్నతల భోరున దుల్చినద్రుంగియమ్మహా।
సురవరుడుగ్రవజ్రమున చోద్యముగా బడుకొండవోలేని।
ధ్ధరపడ తద్భరంబునకు తల్లడమందె ఫణీంద్రుడత్తఱిన్। 137

సీ॥ అప్పుడగురియించి రమరులు గుసుమంబు
లప్పుడు విమలంబులయ్యెదిశలు
అప్పుడు తగనాడి రప్సరాంగనలెల్ల
నప్పుడు రవిచంద్రులలరుచుండి।
యప్పుడు రాముండ హర్షమొందె
నప్పుడు జేసెసింహధ్వానమాసీత।
అప్పుడు నారదాద్యఖిల తాపసులును।
చనుదెంచిరచటికి సంభ్రమునను।

గీ॥ జానకీ దేవియును దానుచరణములకు।
నొరఁగె నొరఁగినక్కునవొనర జేర్చి।
నీకతంబున వైరంబునేఁడు బాసె।
కంటి కీర్తులటంచునక్కడ చెలంగె॥ 138

ఉ॥ శంకలుమాని యబ్జజుడు జానకి పాలికి నేగుదెంచుచో।
పొంకము గానుతించి మఱిభోరుననొక్కవరంబు వేఁడుమో।
పంకజ నేత్రి యన్న తనభర్తయనుజ్ఞను జేసి వారితో।
నుంకువమీఱనిట్లనియె మానసమున్ ముదమందుచున్ వెసన్॥ 139

క॥ మాకొఱకు నఖిల నృపతులు
దాకొని బలములతో వచ్చి దైత్యునిచేతన్।
ప్రాక టముగ నరిగిరిమీ।
రేకంబున వారినెల్లనిండుముదమునన్॥ 140

ఉ॥ వారలనిచ్చి వెండియును వారిజనేత్రిని గోరుమనగం।
ఛీరతఁబొంగి వానర విభీషణసైనికులన్ మరందులన్।
వారక పుత్ర పౌత్రులను వైళమునన్ బ్రతికించుఁడంచున్ వి।
స్తారమ్మృదూక్తి వేఁడినను సయ్యన నిచ్చిరి దేవసంఘముల్॥ 141

చ॥ సకల ధరాధి నాథులును సైన్యములున్ భరతాది సోదరుల్।
సకల కుమారకుల్ దనుజ సంఘములుం బటు విక్రమోజ్జ్వల
ప్రకటశరీరలై మనిన బాగుగ దేవతలెల్లవారిపై
సుకరముగా గురించి రతిచోద్యముగా నమృతంపు వర్షముల్॥ 142

వ॥ అంతహత శేషువైనవారు శతాస్యుమరణంబెఱింగింప మూర్ఛిల్లి మహిని వ్రాలి తెలసి యాచిత్ర గంధి విలపించుచు। కోడంద్రునుం దన వెంటనుండిన రా పురంబు వెడలె॥ 143

గీ॥ కదనమంతయు జూచుచు కదలి వచ్చి।
తలలు దివి సోకగా బడి వెలయు కొండ।
వలెను గూలిన తనయు నవార్యలోక।
కంటకుండైన యాశతకంతు గనియె। 144

వ॥ కనియనేక ప్రకారంబుల కోడంద్రునుందాను నతని పైబడి మోదుకొనుచునేలలుదడుపుచు। తమకుదిక్కేదియనుచు। సీతను దూఱుచు। బాష్పంబులు రాల్చుచు విలపించి మఱియును బుత్ర శోకంబును దరింపజాలక రొమ్మును శిరంబును మోదు కొనుచు చిత్ర గంధియిట్లనియె॥ 145

సీ॥ సురవర్గముల నెల్ల చెఱలు పట్టిన నీదు।
ఆజ్ఞయు నెచ్చట నణఁగె తండ్రి।
దిక్కరి ఘటముల వ్రక్కలు గావించు
నీభుజబలము యేనీటగలిసె।
మొగమెత్తిగనుగొన ముక్కంటి నైనను।
వెఱపించులావు యేవీటఁబోయె।
నీతపంబునకు విధాత్రుఁడిచ్చిన యట్టి।
వరములమహిమయే వరదఁగలసె।

గీ॥ వెలయ రాఘవుఁడాదిమవిష్ణుఁడంటి।
సుదతి జానకి యప్పరంజ్యోతి యంటి।
గపులు సురలంటి, జయములు గలుగ వంటి
నకట వినసేరవైతి వేమందు తనయ। 146

గీ॥ రాఘవుని జంపి జానకీ రమణికీవు।
తలఁతు వెప్పుడు నకట వైధవ్య మొదవ
నది మృషావాదమ్మె నీనిజాంగనలకు।
సహజ వైధవ్య మొదవెనటంచు మఱియు॥ 147

ఉ॥ రాయను బోకుమంటి గదరాయను నిన్నికఁబాసియోరలే
రాయను హాశతద్వయకరాయను మమ్మిటు బాధ పెట్టితే।
రాయను తనూజుగ రాయను నెక్కడ గందు రాకుమా।
రాయను నల్గసేలవినరాయను హాశతకంధరాయనున్। 148

ఉ॥ మాయను మోసఁబెట్టితివి మాయునీకిదిధర్మమౌనె రా।
మాయను నయ్యోనాదుఫలమాయను దానవలోక సార్వభౌ।
మాయను డాయవింత చలమాయను నేటికి జేసితింతభా।
మాయను దుర్లభంబులన మాయను బావురె దైవమాయనన్॥ 149

గీ॥ అనుచు నొరలంగ వారల ననుయించి
రాముఁడిట్లనెనేల విలాపమొంద।
నాహవంబున నెంచఁ జయాపజయము।
లందఱికి గలవు యిహము నిత్యంబుగాదు॥ 150

గీ॥ ఎవ్వఁడనిలోన నాతోడనిట్లు పోరె।
నెవ్వఁడీ లాగు మాచేత నిట్లు గూలె।
చెల్లు నితనికి రణమున విల్లు పూన।
నరయ నెన్నిటనైన కృతార్థుడితఁడు॥ 151

గీ॥ అనివిభీషణునటుపంపి యగ్నివిధులు।
సలుప నియమించి తీరిన సమయమందు।
నా శతాస్యునితనయుమ హాగుణాఢ్యు।
నీలకేతనుఁడను వాని నృపుడు గృపను॥ 152

గీ॥ డంబు గా నప్పురికిని పట్టంబు గట్టి।
పెక్కు భంగుల దీవించి ప్రేమనిగుడ।
రమణ నగణిత తూర్యనాదములు మ్రోయ।
క్షితివరుఁడు డాసెనెల్ల దేవతుల కడకు॥ 153

చ॥ సురలును మౌనులున్ నృపుని శోభిల దీవన లిచ్చి మెచ్చుచో।
నరిగిరి రాముడున్ బటురయంబున మారుతి జూచి క్రమ్మరన్।
శరధులు దాఁటు జేయుమని సయ్యన పేఁడిన వాయుజుండుజె।
చ్చెర తనతోక పైనన డపెసేనల నంద ఱనొక్క పెట్టునన్॥ 154

ఉ॥ తమ్ములు దాను సీతయును దానవ మానవ వానరావళుల్।
సమ్మద లీలనశ్వముల చారు మదేభరథాదులింపుమై।
గ్రమ్మకొనంగ నెక్కి శతకంఠమహోగ్రవధప్రకారముల్।
పేర్మిగను గ్గడింపుచు విభీషణ భానుజులుత్సహింపఁగన్॥ 155

ఉ॥ మానవనాయకుండును గ్రమంబున సేనలు గొల్వఁ దానయో।
ధ్యానగరంబు జేరి తనతల్లులగాంచి నమస్కరించి యా।
జానకిఁజేయు పౌరుషము సర్వము చెప్పి సుమంత్రుతా।
నౌనని సన్నుతింప ముదమార విభీషణుబిల్చి యిట్లనెన్॥ 156

చ॥ పెనగితి వాలమందునను పెక్కువిధంబులజాలజాలనా।
మనసునకు వచ్చె నీదుమ హిమావిజయంబులటంచు మెచ్చిస।
త్కనకవిభూషణాంబరనికాయమొసంగి ముదంబుమీఱ నం।
పిన తన సేనతోడుతవిభీషణుఁడున్ జనె లంక కత్తఱిన్॥ 157

చ॥ రవి తనయాంగదాదులను రమ్మని గౌఁగిటఁ జేర్చి మీకృపా।
ప్రవిమలదృష్టిచేత నగుబాటు ఘటింపకయుండ దైత్యునిన్।
భువినణఁగింపఁగాఁగలిగె భోరుననంచునమూల్య వస్తువుల్।
సవినయవృత్తిమైనొసఁగి సయ్యనఁ బంపెమైఁదయామనస్కుఁడై॥ **158**

చ॥ సకల ధరాధినాథులను సంభ్రమమొప్పగఁబిల్చి సూనృత।
ప్రకటతరోక్తులున్ వివిధభంగుల నాదరణంబు చేసి వా।
రక సెలవిచ్చినన్నృపులు రామునికింత ప్రియంబు దప్పకే।
బలములు గొల్వగ జనిరిగభానుకు లేంద్రుని యుగ్గడింపుచున్॥ **159**

చ॥ పిదప మరుత్సుతున్ సమరభీషణనీతి గుణౌఘభాషణున్।
సదమలభాషణుంబిలచి సారెకు గౌఁగిటఁ జేర్చి ప్రీతి దు
ష్కృదనధురీణ శత్రుమదఖండన నీమహిమంబుచేఁజుమీ।
యదవదఁవాసిదైత్యుని శరావలి చేనణగించి మించుటల్॥ **160**

ఉ॥ నీమదిలోని కోరికలు నిక్కమెఱుంగుదు నెన్ని భంగులన్।
నేమముగా నొనర్తు నదినే నేనిక నమ్ముమటంచు సీతయున్।
రాముఁడు నిచ్చె గోర్కులపరంపరలున్ మణిభూషణంబులున్।
వేమరల వాయుజండును వివేకము మీ రగ మ్రొక్కిగ్రక్కునన్॥ **161**

చ॥ మనుజవరేణ్యుచేతఁగెఁబలుమాఱును దీవనలంది గంధమా।
దనమున కేఁగె రాముఁడును తమ్ములు పుత్రులు బంధు మిత్రులున్।
ఘనముగ నుత్సహించి యతిగౌరవమొప్పఁగ రాజ్యభారమొ।
య్యన వెస దీర్చుచుండె కరుణాయు త నార్ద్ర మనస్కుఁడై॥ **162**

ఉ॥ ఎవ్వరు యీకథల్ చదివి రెవ్వరు వ్రాసిన ధర్మబుద్ధిమై।
నెవ్వరు విందు రట్టి సువివేకులకుం రఘునాథుడిచ్చు నా।
మవ్వపు భోగభాగ్యములు మానిత సౌఖ్యమునిష్ట సంపదల్।
నివ్వటిలం బ్రియంబులును నీరజగర్భుని సన్నిభాయువుల్॥ **163**

వ॥ అనియివ్విధంబున శంకరుండెఱింగించిన శాంకరీదేవి మహాద్భుతంబు నొంది మహాత్మాయిట్టి చమత్కార కథావిధానంబెన్నడును వినియెఱుంగము। నేఁడు శ్రవణానందంబు గావినం గలిగె। కృతార్థురాల నైతినని యానందింపుచుండె నంత॥ **164**

శ్రీరమణీయ వైభవ విశిష్టగుణాకర దీనలోకమం
దార గభీర ధీర సముదార సుకీర్తి విహార శత్రు సం।
హార యఘప్రహార సదయానుశరీర సుధాకర ప్రభా కార।
లసద్విచార జయకారణ భోగయ రెడ్డి భూవరా। **165**

ఇది శ్రీమద్వేదాద్రి పురని వాస శ్రీరంగచరణ సరసీరుహ భ్రమ రాయమాన పొబ్బాల గోత్రపవిత్ర రెడ్డి పుత్ర భోగ నృపాల నిజాశ్రి త లింగసుకవి ప్రణీతంబైన సీతావిజయంబను. మహాప్రబంధంబు । సర్వంబును చుతర్థా శ్వాసము సంపూర్ణము. 166

ధాన్యనామ సంవత్సర మాఘశుద్ధ 3 బుధవారము. రెండుర్ఘూముల వఱుకు సీతావిజయమ బ్బారి ర్యుస్వహస్తంగా వ్రాసుకున్న ప్రతిలో నున్న ప్రకారమబ్బారి దేశ రాజు కొ॥ లక్ష్మీ నరసయ్య వ్రాసెను.

Transcribed in 1920-21 from a M.S. of Yellapragada Venkata asimha Rao Garu, Pedapalli, Guntur Dt.



# రచయిత పరిచయము



పేరు : మూలా రామమూర్తి

జననం : 15-11-1936

జన్మస్థలం : విజయ నగరము

విద్యాభ్యాసము: ఎం. ఎ (తెలుగు), ఎం. ఎ (సంస్కృతం)

బిరుదులు : రామాయణ కథారత్న, సాహిత్య రత్న

వృత్తి : రిటైర్డ్ ఆఫీసు సూపరింటెండెంటు, దక్షిణ మధ్యరైల్వే, సికింద్రాబాదు

సాహిత్య విద్యా గురువు : డా॥ దివాకర్ల వెంకటావధాని

జ్యోతిష విద్యా గురువు : శ్రీ ఆర్. పి. కళ్యాణ సుందరం అయ్యర్

ప్రవృత్తి : సాహితీ వ్యాసంగము మరియు తెలుగు విశ్వ విద్యాలయ జ్యోతిషశాఖలో అతిథి ఉపన్యాసకత్వము -

ఎం. ఎ జ్యోతిష తరగతులకు పాఠములు వ్రాయుట

అభిరుచులు : అంతర్జాతీయ రామాయణ సదస్సులు, ప్రపంచ సంస్కృత మహాసభల యందు పాల్గొనుట, మారిషసు, ఆస్ట్రేలియా, థాయిలాండు, అమెరికా జర్మనీ మున్నగు దేశములు పర్యటన.

ప్రత్యేక గౌరవము : అమెరికన్ ఫెడరేషన్ ఆఫ్ ఆస్ట్రాలజర్సు, టెంపే, ఆరిజోనాలో ఫేకల్టీ మెంబరుగా నియామకము.

శ్రీ విరూపాక్ష విద్యారణ్య మహాపీఠమున మత సంహోదారుగా నియామకము.

అభినివేశము : దేశవ్యాప్తంగా సౌందర్యలహరి, రామాయణం, భాగవతం, ఉపన్యాసములు, ఎ.ఐ. ఆర్.లో ప్రసంగములు, మారిషసు మున్నగు దేశములలో టి. వి. ప్రసంగములు.

ముద్రిత రచనలు : సత్యనారాయణ వ్రతము సంస్కృత శ్లోకములకు కథానురూప సంగ ఆంధ్రానువాదము) (మూడు ముద్రణములు) శతకంఠ రామాయణము ఉను సీతా విజయం.

పలు జ్యోతిష శాస్త్ర వ్యాసములు, అమెరికా వారి పత్రికలో ప్రకటింపబడిన వి.

వర్తమాన చర్యలు : రామాయణం, భాగవతం మున్నగు గ్రంథముల పరిశీలనము

జ్యోతిషశాస్త్రమున విస్తృత కృషి.